సీ. "చరణము ల్నిడుపుగా సాఁచి కేలొక్కటి, పుడమిపై నూఁతగా నిడి వసించుఁ
గూర్చున్నతటి నాయకుండు రాదవుదవ్వ, నను గాంచి కడుఁ బ్రయత్నమున లేచు
ద్విత్రాంఘ్రివిన్యాసమాత్రన దరితరు, స్కంధాదులవలంబకముగ నడచు
నొక కొంత లేని యోపికఁ దెచ్చికొని భర్త, కుపచార మొనరింప నుద్యమించు
నలసదృష్టులవలయు వస్తులను దెలుపు, నలఁతియెలుగునఁ బరిమితోక్తులను బలుకుఁ
గలికి నీరాక వివలిపంపు వలువఁ దాల్చ, నెలలు నిండినకోలఁది నవ్వేలఁది మిన్న॥"

చతుర్థాశ్వాసము, ౧౧౩.

సీ. "ఎవరైన పడిపడి నెదురుగా నేతేర, ననుఁ బిల్చుటకె వత్తు రని తలంతు
సఫలప్రయత్నులై చనువారి వార్తలు, విని నాకు నిటు లెప్వ డని తలంతు
నగరి మోసలతీవి నడయాడువారి నెల్లను, స్వామివల్లభు లని తలంతు
దేవేరిబోనగత్తెలచేత నైన నా, మనవిఁ దెల్పింతునా యని తలంతు
నాకలోకంబునుండి నా రాకఁ జెవుల, సోఁక నెటిఁగించువారలు లేకయిటుల
శ్రీకళత్రుండు పేక్షించెఁ గాక యున్న, నీకరణినుంచు నే యంచు నేకతమున॥"

తృతీయాశ్వాసము, ౧౪౯.

రెండు మూఁడు పదములతో నర్థము నంతయుఁ దెల్పుటయందు వీరి సరివార లనేకులు లేరు.

"నిదురఁ దోఁగెనటంచుఁ బదములొత్తుభుజిష్యు, లూరకుండిన నంఘ్రు లూఁపుకొనుచు."

ద్వితీయాశ్వాసము, ౨౭.

"వాకిట జందెము లుద్ధృతోరులై యొడుకుచు నన్న లున్నను."

తృతీయాశ్వాసము, ౧౬.

"ఎందునుండియొ యొచటికో యేగుచుండి, పిడుగు వడినట్లుగానుట్టి పడియె నెదుట."

తృతీయాశ్వాసము, ౨౩.

"యాతాయాతవీతోత్తరీ, యదశం దొట్టిలఁ దల్లడిల్లె నగరం బాబాలగోపాల ముఖ్యః"
తృతీయాశ్వాసము, ౭౫.

"అఖిల సజ్జన లోకాభయ ప్రదంబు, లైన నాల్గుభుజంబుల నతని బొదివి లేనఁగా నెత్తి."
చతుర్థాశ్వాసము. ౭౭.

"పురి గిరి పిటేఁదిగాఁ దిరిగి బయిల్ గాంచి, ప్రోవ వేహారి యంచు మ్రొక్కి—"
షష్ఠాశ్వాసము. ౧౫౬.

సందర్భోచితములగు పదవాక్యముల నేర్చికూర్చుట, శబ్ద బాహుళ్యము లేకయే యుద్దిష్టార్థమును వివరించుట, రచనాచమత్కృతిచే వర్ణితాంశమును జదువువారి హృదయఫలకములపైఁ జిత్రించుట,—ఇవ్వియే నిజమైన కవిత్వలక్షణములు; వీనియందే వీరి సామర్థ్యమంతయుఁ జూపఁబడి యున్నది.

వర్ణనలు:—ఇఁక వీరి వర్ణన సామర్థ్యము శైలి కంటెను బ్రశంసనీయము. సృష్టి వైచిత్ర్యములు జనసామాన్యమును కగ్రాహ్యము లనియు, గగనతలంబున నగోచరంబులై లక్షలకొలఁది మూఁగి దాగియుండు నక్షత్రసమితి దృష్టిపథంబు నధిగమింపఁ జేయు దూరదర్శని (Telescope) చందంబునఁ గవులకల్పనలు స్థూలదృష్టిచే మనము కనుఁగొన లేనివాని నన్నిటిఁ గన్నుల కగపడఁజేయు ననియు, నెల్లరు నొప్పుకొను విషయములే. ఇఁక వర్ణనలు స్వభావానుగుణములుగ నుండ వలయు నని విప్పి చెప్ప నేల? కవి చిత్రకారునివలె,సాధ్యమైనంతవఱకు సహజాకృతిఁ దేల్చుటకుఁ బ్రయత్నింప వలయును. లేనిచో నిది యిట్టి దని పోల్చుట యశక్య మగుటయే కాక, వారి సామర్థ్య మెట్టిదో యెఱుకపడుట కూడ దుర్లభము. అస్పష్టవిషయముల విశదపఱచుటయం దతిశయోక్తి సహాయకారియైన నతిశితతరణి కిరణములకరణి, మేరమీఱినచో నిష్ప్రయోజన మగుటయే కాక, తెలుచుగ మొదటికి మోసము దెచ్చుటయుఁ గలదు. కావున సత్ప్రేక్షలలోఁ గవులు చూపు సామర్థ్యము స్వభావోక్తియందుఁ గన్పఱచినచో మన కావ్యము లింకను శ్రావ్యములుగా నుండును. అయిన నిది మనము తలంచునంత చులుకనైన కార్యము కాదు. అవయవానురూపతయు, సహజలక్షణ సౌందర్యమును లేని వికృతరూపమును

ప్రాయు నలవాటు సులభసాధ్యము కాని, కృత్రిమాకారము నే నిజస్వరూప మని భ్రాంతిం గొలుపుచు జీవకళ యుట్టిపడునట్టు లిఖించు ప్రజ్ఞ శారదావరప్రసాదలబ్ధ మని చెప్ప వలసియున్నది. ఇట్టి సామర్థ్య మేతద్గ్రంథకర్తయం దధికముగాఁ గననగు. ఐనను వీరి కల్పనాసామర్థ్య మనల్పము. ఎట్టి విశేషములు లేని సామాన్యవిషయములనె మనోజ్ఞముగఁ జమత్కరించి యెన్నఁడు మఱపురాకుండు నట్లు వర్ణింపఁ గలరు. తార్క్ష్యభూధరౌన్నత్యమును, దదధిరోహణసమయమున మూకబధిరాంధపంగులకు సంగత మైనలాభమును, వేంకటేశునకుఁ గుక్కుటేశుం డనుచరసహితముగ నొనర్చిన పరిచర్యయు, నెంతయుఁ జక్కఁగా వక్కాణింపఁబడి యున్నవి.

సీ. "సెలయేటి యిసుకతిన్నెల గూఢమణికేళి, కల నిలింపాంగనల్గలసి యాడ
దీర్ఘికాబ్జముల నధిత్యకహంసముం, దలములు జతగూడి వెలయఁ జేయ
వృక్షశాఖల డాసి ఋక్షాళి తేజస్త్రి, మిర మేళనాశ్చర్యగరిమఁ జూపఁ
గటకకూటములందుఁ గదిసి గంధర్వసం,ఘా తంబు సంగీతకలనఁ బెరయ

తే. గీ. నాకభూలోకములకు సంతతముగాఁగ, రాకపోకలు నెరపఁ బరస్పరంబు
దివిజమనుజులు కోర్కిసంధించుకొనిన,దండినిశ్రేణి యనఁగ నక్కొండ దనరు."

ద్వితీయాశ్వాసము, ౨౯౭.

సీ. "గొంతెత్తి గోవింద గోవింద యని సంత, రువ్వఁగా బిట్టువాక్రుచ్చువారు
శ్రుతిమాతె మారుతాహతి వీణెసారణి, ననువుగా సవరింపు మనెడువారు
ద్వారగోపురదృషద్ద్వారశాసనవర్ణ, సమితి విస్ఫుటముగాఁజదువువారు
వడివడి ముందుకైనడచి క్రమ్మఱితన, యడుగులఁబడి మ్రొక్కులిడెడువారు

తే. గీ. నైనవారలఁ దనవెంట నరుగుదెంచు, వారి నలమూకబధిరాంధపంగుజనులఁ
జూచుచుఁ గపటనాటకసూత్రధారు, చిత్రనాటికపటిమ కచ్చెరువు చెందె."

షష్ఠాశ్వాసము. ౧౫౭.

సీ. "తొలికోడితానెయయ్యెలుఁగెత్తిమ్రోఁయుభం, గులఁ గుక్కుటేశుండుకొసరికూసె
నాలమందల కెల్లనధి నేత తానెయై, ఖాంకరంబుంగా నందిఱంకె వైచెఁ
దీర్ఘంబుఁదెచ్చుహస్తికిఁ బెద్ద తానెయై, లంబోదరుఁడు బృంహితం బొనర్చె
విహగంబులకునెల్లఁ బెద్ద దానై కుమా, రునికేకి పెలుచ నిస్వన మొనర్చెఁ

తే. గీ. దానె లింగార్చకులకుఁ బ్రాథమికుఁ డగుచుఁ
బ్రాతరనిలుండు కేతనాగ్రమున నున్న
ఘంట మ్రోయించె వందిమాగధులు తామె
యగుచు భక్తులు పేర్కొనిరపుడు మమ్ము॥"

షష్ఠాశ్వాసము, ౧౩౨.

కొన్నిసమయములఁ బాత్రల యుల్లంబుల మల్లడిగొను తలఁపులు మెలపునఁ వెలువఁబడుటయుఁ జూడనగు.

సీ. "పయనంబులు వెడలుచోఁబవమాన మెదురౌట, దుర్నిమిత్తం బనితోఁపదయ్యె
వాహనంబులు లేక బ్రహ్మర్షిముఖ్యులు, దోడరాఁ దగదనితోఁప దయ్యె
మాహేశ్వరుండైన మౌని దౌదవ్వులఁ, దోఁప నప్రమతిఁ జూపఁదోఁపఁ దయ్యె
గౌరీప్రసాదరుద్రాక్షపయోజమాల కం, ధోయి నద్దుకొనంగఁ దోఁపఁ దయ్యె

తే. గీ. నేమి సేయుదు దివ్యపరీమళాఖ్య, బడిశమునఁ బడి శమగుణం బుడుగ వడిగఁ
జిత్తమీనంబు చిక్కులఁ జిక్కెనకట, దైవనిర్ణయ మెవ్వారు దాఁటువారు?"

తృతీయాశ్వాసము, ౫౨.

మ. "మునిరాణ్ముఖ్యుని శక్తి మున్నెఱుఁగనో మున్కొంటి యీదంటనై
యనసూయాసతియందు నత్రికి సుతుండై పెల్ల నాలింపనో
జనసక్రోధనుఁ డీతపోధనుఁడు మసాధ్యప్రభావాఢ్యుఁ డం
చని విన్నాఁడను గానొ నా తెలివి యేమై పోయెనో! యక్కటా!"

తృతీయాశ్వాసము, ౫౩.

సీ. "కట్టించుకొనినాఁడు కద వైజయంతంబు, తన కేమొ యిది శాశ్వతం బటంచుఁ
గావించెఁ గద యోలగము సుధర్మాస్థాని, తనయధికారంబె తప్ప దనుచుఁ
బాలించెఁ గద స్వర్గపట్టనం జేపట్టు, నను దన కదియె కాణాచి యనుచుఁ
గొలిపించుకొనెఁ గదా వలపించి యప్సర, స్సతులచేఁ దన పెంపె సత మటంచు

తే. గీ. నారయ యాయింద్రుఁ డిప్పు డెందరిగె నొక్కొ.
మనలఁ దొలివేలుపుల మాట మఱియు సవతి
తల్లికొమరుల మాటఁ దత్స్వర్గరాజ్య
మెల్ల మన కనుభోజ్య మంచెఱుఁగఁడొక్కొ."

తృతీయాశ్వాసము, ౧౧౧.

సందర్భోచితవర్ణనలకై వెదకికొన నక్కఱయే లేదు. ఈ గ్రంథమునం గల మనోహరవర్ణన లన్నిటిం గూర్చి విస్తరించి వ్రాయవీలు లేమిచే దిక్ప్రదర్శనముగఁ గొన్నింటి మాత్రము వివరించెద. నాచూచినంతవఱకు నాంధ్రప్రబంధములలో నెద్దాని యందును ఋతువర్ణన మీ గ్రంథమునందువలె హృదయ రంజకముగను స్వాభావికముగను జేయఁబడి యుండలేదు. ఆయాఋతువులందు భూపులు మొదలు కాఁపులువఱకుంగల యన్ని యంతస్తులవారు లెట్లెట్లు కాలము గడుపుచుందురో, ప్రపంచమంతయు నెట్టిమాఱుపు లందుచుండునో తెలుపఁబడి యుంటయే కాక, యప్పుడప్పుడు మన యనుభవములోనికి వచ్చిన వయ్యు మనము గమనింప నట్టియు, గమనించియు మఱచిపోవు నట్టియు, విషయములన్నియు మనస్సున కొక్కసారిగాఁ బ్రదర్శింపఁబడి, స్వప్నము నందుంబలె నిమేషమాత్రమున సంవత్సరభుక్తి జ్ఞప్తికిఁ దేఁబడియున్నది. ఇయ్యెడ వీరికింగల పరిశీలన శక్తియుఁ, బ్రపంచజ్ఞానమును, బ్రకాశితములగుచున్నవి. హాస్యరసాస్పదము లగుపద్యము లనేకము లీ ఘట్టమునఁ గన్పట్టును.

సీ. "ప్రపాబహిః కుట్టిమాభ్యర్ణగాంభఃపూర్ణ, కలశాంబువులు గతి క్లమముఁ బాప
నవ నారికేళవల్కకళింజకస్థితుల్, మార్గాభిఘాతోత్థశ్రమంబు నుడుప

జంబీరరసపూర సమ్మిశ్ర మగుతక్ర, సారంబు వృషను జల్లారఁజేయ
నాయతకాయమా నాంతరస్థితతాళ, వృంతముల్ ఘర్మంబు వితతినడఁప
తే. గీ. నిదుర గదురంగ నపుడధ్వనీనజనము, విడియునాకొకపుణ్యాత్ముఁ డిడినయట్టి
ప్రపసపారసుఖాప్తి మైఁ బనుల మఱచి, పట్టపవలింటివడసోఁకు దట్టమండ."

ద్వితీయాశ్వాసము, ౭౮.

సీ. "మునుఁగిడ్డతఱుమాపు మునుకదుప్పటిచెమ్మ, గిలకుండవలఁతిరో వెలలుచొచ్చి
హత్తించి తొడిగిన క్రొత్తచెప్పులజోళ్లు, దడియకుండఁగ వీథి దమలఁ జేరి
గుత్తంబుగాఁ జుట్టికొనిన చుట్టలనిప్పు, లాఱకుండఁగఁ బంచ టరుఁగు లెక్కి
ఘొన్నఁ గట్టలయోఁతఁ గన్నఁగానక జాతి, పడకుండ రచ్చసా వడులనిలికి.

తే. గీ. చేలపనులందుఁ జొప్పడు చెలిమిసంజ
గాఁపుఁగొమరులు పసుపుసుంకములఁ గొనిన
శాలిపాలికలకుటీర పాళిఁ జేరి
రెట్టకేలకు నజ్జడి నేకతముగ॥"

ద్వితీయాశ్వాసము, ౯౧.

సీ. "పట్టుఁబుట్టముఁజుట్టి నట్టిబోడిశిరంబు, పైనొప్పునక్షయపాత్రి నొకటి
యురుకక్షములలోని తిరునామములపుస్త, కమునను దాళవృంతమును రెండు
క్షుద్రకుటీప్రాంత శునకభీతినిఁ గుడి, కేల దాల్చిన తిరుకోల నొకటి
డాచేతిదారుఖండ పుఁ దాళ యుగి రెండు, స్వప్రతీకంబులఁ బదియు రెండు.
తే. గీ. రమణ నష్టాదశోర్ధ్వపుండ్రములు దనరు, నమరసత్యార్థవైష్ణవత్వము ఘటిల్ల
బికిరి మెత్తంగ సాతాని పిండుదిఱుగుఁ, దగదను గ్రామసవాసరాంతములనపుడు."

ద్వితీయాశ్వాసము, ౧౦౦.

సీ. "నవశాలిసస్యకృంతనవిధానైకసం, భ్రమమహత్కృషిదండిభవనంబు
వార్షికవ్రీహిసంపాదనాజస్రసు, త్వరచరద్గ్రామ సేవకజనంబు

పార్థివగ్రాహ్యాప డ్భాగగ్రహణజాగ్ర, దుదోగ్యగిపురుషభటోత్కరంబు
ప్రతిగేహపర్యట ద్వాద్యనాదసనాథ, కోణంగిముఖ్యభిక్షువ్రజంబు.

తే. గీ. దనర నవ్వేళ నాప్రభాతప్రదోష, మాప్రదోషప్రభాతంబునటుల యిటుల
తిరుగ నయ్యయిసందడితెఱపి లేమిఁ, జేల కూళ్లకు నొకవింతచెలువు దోఁచె!"

ద్వితీయాశ్వాసము. ౧౦౧.

స్వర్గవర్ణనముకూడ నీ రీతిగనె నిరుపమానసౌందర్యము కలదై యున్నది. ఏవ వోడమఁ జేయకుండ శృంగారరస మెంతవఱకుఁ జూపనగునో యంతపర్యంతము గనఁబఱుపఁబడి యున్నది. ఉత్తరహరివంశము, మృత్యుంజయవిలాసము, మొదలగు గ్రంథముల యందలి స్వర్గవర్ణనలకుఁగూడ దీని యెదుటఁ దలయెత్తి మెలఁగ వలను పడదు. దిగధీశుల విష్ణుం బొడగని నప్పు డొనర్చిన స్తవము లెంతయు సహజములుగా నున్నవి. నైమిశారణ్యవర్ణన, నాచనసోముని బదరికాశ్రమువర్ణనవలెఁ జదువువారి మనములఁ దనతోఁగొనిపోయి, మునిజనావాసమునఁ బ్రవేశింపఁ జేసి, పక్షిజాతుల కూఁతలును, సెలయేళ్ల మ్రోఁతలునుఁ దప్ప నేచప్పుడు లేక యొప్పు నప్పట్టునఁ, బరమ శాంతస్వాంతులై, తపోధ్యాననిష్ఠాగరిష్ఠులై, సంసరణతరణితరణమునకు "శ్రీరమణ సేవ లె కేవల నొకతోట" నెఱింగి, "ప్రత్యహముం గృతనిత్యకృత్యులై శౌరి కథార్థముల్ వినుచు శార్ఙ్గిఁదలంచుచుఁ జక్రిమంగళా కారము నాత్మ నెంచుచును గాలముఁబుచ్చుచు" నుండు జటిమండలిదర్శన మొందఁగూర్చుచున్న యది. అదితి దౌహృదప్రసవ వేదనావర్ణనల చీటుకొనఁదగినవి. నే నింత వఱ కెన్నఁడునుఁ గని యుండ లేదు.

సీ. "నివరిప్రాలొల్కనివండినబప్పుయిణిపాల, పరమాన్న మొకమానిపత్ని యిచ్చెఁ
దనప్రోపుఁ గాంచి క్రొత్తగఫలించినవింత, చెట్లపండ్లొక మునిస్త్రీ యొసంగె
నిజగృహేశాభిమంత్రితసిద్ధమహిమాక్ష, తల నొక్కమునివధూతిలక మునిచె
యువమయుష్టికపిష్టనవఘృతపక్వఖా, ద్యము లొక్కతబిసియిల్లాలు దెచ్చెఁ

తే. గీ. దాను బూజించు దేవిపాదముల మీఁది, గొనబునిర్మాల్య మొకతపోధనపురంధ్రి
యిడియె సీమంతశుభశోభ నెసఁగుకన్య, కమునిసాసుంతసీమంతవతికి నచట.

చతుర్థాశ్వాసము, ౧౧౨.

సీ. "శ్రవణానన్యముగ నారణ్యకోపనిషత్తుఁ, బారాయణము సేయ వలయు నేమొ
బల మెలర్పఁగ మహేశ్వరునిముంగిటినుండిఁ, బట్టియిట్టటుఁ ద్రిప్ప వలయు నేమొ
గ్రుక్కలొక్కటిరెండుఁ గ్రోలఁగా స్వధితిచే, జలమునుమంత్రించియీ వలయు నేమొ
కచమునందిడుకొనం గాఁ బత్త్రపుటముపై, విలిఖించి యంత్రమీ వలయు నేమొ

తే.గీ. యనుచు మీశ్రుష ప్రసూత్యుపాయజ్ఞులెల్ల, నుటజబహిరంగణంబున నుండి యెపుడు
జరఠమానికుటుంబినీ జననియుక్తి, నొక్కటఁదదీయబాలకా హూతులగుచు॥"

చతుర్థాశ్వాసము, ౧౧౬.

వామనమూర్త్యావిర్భావఘట్టము శైలిచేఁ బోతనార్యుని భాగవతముతోఁ దూఁగ లేకున్నను, గథాసంవిధానమునమాత్రము దానికి వీసమైనఁ దీసిపోకుంట యటుండఁ గొన్నివిషయముల దానిని మించి యున్నదని యొప్పుకొనక తప్పదు. తృతీయాశ్వాసము నందలి శారికాసంవాదఘట్టము మున్ను వాకొనిన యన్నిటికన్న నెన్నికఁ గనఁదగి యున్నది. పదలాలిత్యమున నేమి, కథాచమత్కృతియం దేమి, భావవివరణమున నేమి, కళాపూర్ణోదయ ప్రభావతీప్రద్యుమ్నములఁ బురుడించు చున్నయది. ఇతరాంతరంగ వృత్తిజ్ఞత్వమును భాషాప్రావీణ్యమును యోజించిచూచిన నీశారికలును సూరనార్యుని హంసీపతంగము నొక్కయాకుననే చదివిన వను సందియ మొదవక మానదు. అమరావతీపురికి మరలివచ్చిన పిమ్మట శచీపురందరుల స్వాంతమునకు "దొంతరవింతలచే సంతరింపఁబడిన దంతుర మగుభ్రాంతి," కలభాషిణీ మణికంధరులకు, రంభానలకూబరులకును గల్గినచిత్తవిస్మృతిని స్మృతికిఁ దెచ్చుచున్నది. షష్ఠాశ్వాసమునందలి కథవాడఁ జాలపటమునఁ గవికిం గల స్వకపోలకల్పనాసామర్థ్యముం బ్రకటించుచుఁ గళాపూర్ణోదయ రచనల వెల్లి గొల్పు చున్నయది. ఇందుఁ బాలునకు నాభీరునకు జరిగినసంవాదము వలన నిక్కవికిం గల సందర్భోచితపదప్రయోగ నైపుణ్యముఁదెలిసికొనవచ్చును.

గ్రంథనామము:—"మహేంద్రవిజయమునకు మాతృక యైన యుపమాకామాహాత్మ్యము సంస్కృతమున రమారమి నూఱనుష్టుభ శ్లోకములుగలదై" బ్రహ్మకైవర్త పురాణమున నొక భాగముగానున్నది. ఈ కవీంద్రుఁడు దాని నధికముగాఁ బెంచి, మూలము నందలి కథతో నూతనగాథల జతగూర్చి యల్లి, యాఱాశ్వాసముల ప్రబంధముగా రచియించి యున్నారు. మాతృకకువలె దీనికిఁగూడ సర్వవిధముల నుపమాకామాహాత్మ్యమను పేరే సరియైన దైనను, "నింద్రజయంబు ముఖ్యగాథగఁ దోఁచెం గాన మహేంద్రవిజయ మని దీనికిఁ బేరిడుట మంచి" దని గ్రంథాది యందుఁ దెల్పఁబడియున్న కవి యభిప్రాయము కేవలమపూర్వ మని కాని యసంగత మని కాని చెప్పఁ జొప్పడదు. మొదటి మూఁడాశ్వాసము లందును మనువునుగూర్చి యొక్కవాక్య మైనలేకున్నను గథ కంతకుఁ బ్రధాననాయికానాయకులు వరూథినీప్రవరాఖ్యులయ్యును, నాంధ్రకవితాపితామహునిప్రబంధము "స్వారోచిషమనుసంభవ" మను పేరఁ బరగుచున్నది. దానికన్న నిది సార్థకనామమే.

కథావిషయము:—ఈ గ్రంథముయొక్క ప్రధానోద్దేశ ముపమాకాక్షేత్రమహిమానువర్ణనము. ఎవ్వరైనబంధురతటాకోపాంతమునఁ దపంబు సల్పినను, దజ్జలంబుల మజ్జనం బొనర్చినను, గరుడభూధరంబధిరోహించినను, దత్కూటస్థితుం డగు దేవుని సేవించినను, దత్తన్మనోభీష్టసిద్ధిరూపమున నాక్షేత్రమాహాత్మ్యమెల్లరకుఁ బ్రకటీకృతం బగుచుండు నని బోధించుగాథ లిందుఁబొందుపఱుపఁబడి యున్నవి. అట్టి కథల ముఖ్యార్థమే సంగ్రహముగ నీ క్రిందపద్యమున హృద్యముగఁ దెల్పఁబడి యున్నది.

సీ. "బ్రహ్మవిద్యామహాప్రజ్ఞానిధిత్వంబు, దివిజేంద్రసదృశవైభవసమృద్ధి
యదితికశ్యపసమానాపత్యయోగంబు, నంధ్రనాయక కౌతుకానుషక్తి
నారదప్రతిమానతారకజపసిద్ధి, ధూర్జటినిభధూతదోషవృత్తి
హీనభూతాభసాంతానికలోకాప్తి, వల్లవతుల్యకైవల్యపదవి

తే. గీ. యేతదస్మత్ప్రపూతవిఖ్యాతమహిమ, సహితమహితకథావిధశ్రవణపఠన
నిరతనిరతులకొదవు—"

షష్ఠాశ్వాసము, ౨౭౧.

ఇఁక నాయకాగాథల గ్రంథవిషయము నుండి విశేషపఱిచి ప్రత్యేకముగ దాని యందుఁ గానఁబడు రచనావిశేషముల మాత్రము గొన్నిటిని వివరించెద.

మొదటి రెండాశ్వాసముల యందును వేదాపహర్త యగు సోమకాసురునివధ దెలుపఁబడి యున్నది. ఈ భాగము కథాచమత్కృతిచేఁ బ్రసిద్ధము కాకున్నను, రస భరితంబులై విసువొదవింపక చదివినకొలఁది మది ముదము గదురఁ జేయు ఋతువర్ణనల వలన నెంతయు మనోహరమై పొలుచుచున్నయది. తృతీయ, చతుర్థ, పంచమాశ్వాసము లీగ్రంథమున నెన్నికఁ గన్న కథలన్నిటిలోమిన్నయైన వేల్పుమన్నె కాని గాథచే వన్నె కెక్కియున్నవి. ఈ భాగమును "మహేంద్రవిజయ"మనుటకన్నను "మహేంద్ర గర్వనిర్వాసన" మనిచెప్పిన నొప్పిదముగనుండును. పేరు వేఱుగనున్నను, దానింబట్టి కవియుద్దేశముకూడ భిన్నముగనుండు ననుకొనవలసి వచ్చినను, ద్రచ్చి చూచినమాత్ర మింద్రునికింగల్గిన శృంగభంగమే ప్రధానాంశ మనియుఁ, దద్వివరణముననే కవితను సామర్థ్యమునంతయు వినియోగించినా రనియు, ముఖ్యముగ దానివలననె గ్రంథమున కీర్తిప్రాశస్త్య మొనఁగూడిన దనియుఁ, దోఁపకమానదు. ఈ యభిప్రాయమును స్థిర పఱుచుట కష్టముకాదు. ఈ విషయమున మూఁడుభాగములు స్పష్టముగాఁ దెలియు చున్నవి. 1. పురందరుఁడు సురేంద్రపదభ్రష్టుండగుట. 2. నిశాచరుఁడు శచీవర సింహాసనాధిష్ఠాన మొనర్చుట. 3. త్రివిష్టపపతి పునఃప్రతిష్ఠితుండగుట. మొదటి దానియందు రాజు గర్వితుఁడైనచో ననుచరహితముగ శిక్షింపఁబడునని చూపఁబడినది. రెండవదానియందు రాజుగుణశాలియేయైనను, దుర్నయమూర్తుల నికటవర్తులుగాఁ జేరఁదీసినచో వారిమూలమునఁ దాను దండితుఁడగు నని తెల్పఁబడినది. మూఁడవ భాగమునఁ బశ్చాత్తప్తులైనవారిని భగవంతుఁడు కృపాళుండై చేపట్టు నని తేలుచు న్నది. మదించినవారి కున్నది పోవుటయే మృత్యుసదృక్షంబగు శిక్ష. అది తమ వైరులఁ జేరుట పైదానిని మించినవంచన. తుదకు బ్రతుకుఁ దెరువున కితరుల బతిమాల కొనవలసిన గతికిఁ దేఁబడుట వీనినన్నిటిఁ దలఁదన్నిన బన్నము, ఇద్దియే మనశతమను

నకు సంప్రాప్తమైనస్థితి. అది యకారణముగఁ గల్గినది కాదు. మున్నొకపరి విష్ణుదర్శనార్థమై వైకుంఠపురి కరిగి యచ్చట.

శా. "ముల్లోకంబుల నేలు చుందు సవనంబు ల్నూఱు గావించితిఁ
దెల్లం బై తగుసౌమనస్యమున వర్తింతుఁ బుధశ్రేణియం
దెల్ల న్ముఖ్యుఁడ నై మెలంగుదు"

తృతీయాశ్వాసము, ౧౫౦.

నని విఱ్ఱవీఁగి తుదకు శ్రీహరిం బొడగాన లేక, శారికలచేఁ దిరస్కృతుఁడై, నారదమునిచేఁ బరిభూతుఁడై యరిగినత్రోవనె మరలివచ్చెను. అయిన నంతటితో జ్ఞానము దెచ్చికొనక, మదాంధుఁడై కరణీయకార్యముల మఱచి, యకరణీయకృత్యముల జరపుచు, గురువుల నాదరింపవలయు నని తెలిసియు దుర్వాసునకుం బరిచర్య సేయక, వారిప్రసాదము నిరాకరింపఁగూడ దని యెఱింగియు న ట్లొనర్చి, యత్తాపసుకోపాగ్ని కగులఁ జేసి శాపోపహతుం డయ్యె. కావుననే పూర్వముకన్న నధికశిక్షకుఁ బాత్రుఁడై తనరాజ్యమును గోల్పోవుటయే కాక యది శాత్రవుల యధీన మగుటగూడఁ దాఁ జూడవలసి వచ్చెను. తనతప్పు తా నెఱింగిన వాఁడగుటచేతనే యసహాయుం డై శ్రీహరిదరిఁ జేరుటకు వెఱచి, సురగురునిం గూడఁ దోడితెచ్చుకొనవలసి వచ్చెను. ఇతఁడు నేర మొనర్చిన కారణముననె "ప్రత్యక్ష మైతి నీకు మాత్రంబె సురపాల నైకలోల" యనియు, "మెచ్చితి నీసచ్చరితకు, వచ్చినపని ముచ్చటించి వరమడుగు" మనియు, బృహస్పతితోఁ, గుపితుం డగు నాహరి, బలారిం గికురించి మాటాడఁ దొడంగె. ఇంద్రునివలని లోపమును, నాతని శిక్షింపవలెనను మహేంద్రుని మనోనిశ్చయము నెఱింగినవాఁడై, రాజనీతిపారంగతుం డగు గురుం డతిజాగరూకతతో నంత వఱకు జరిగిన దంతయు న్యాయ మని యొప్పుకొని, యతివినయోక్తులఁ దనమనోభీష్ట మల్లనల్లన వెల్లడిచేయఁ గోరి "శ్రీవర! దేవరం గనుటచేతను జేతనులు...నిత్యవిభవంబును గాంచి ...సదాసుఖితులౌదురటంచుఁగోవిదులు వచింతు"రనియారంభించి, "దేవర

పాటవసూపుటయే వర” మని స్తోత్రము చేసి, “స్వర్గమర్త్యపాతాళములు దేవమనుష్యా సురులకుఁ దావలములుగ” సృష్టింపఁబడి యున్నను, “త్రిదశాలయం బని స్వర్గమునకు, బలిసద్మ మనుచుఁ బాతాళమునకు” సంజ్ఞ లమరుచున్న నిప్పుడు “తత్క్రియలంబు దప్పుటకుం” గారణ మొండుండునోపు నని యొడఁబడి, తన కింద్రుని కోడఁగూడిన కడగండ్ల విడి విడిగా, దెల్పి, “దీనజనతార్తిసంహారి దానవారి శౌరి యనుఖ్యాతి నిలుపు కో”మ్మని వేవిధమ్ముల వేఁడుకొనఁ జొచ్చె. ఇంతియ కాక పన్నగశయనుఁడు ప్రసన్నుఁడై “మీసంకటములు దీర బలిని రసాతలసీమకుఁ బంపెద” నని మాట యిచ్చిన పిమ్మటఁ గూడ సురాచార్యునికిఁ దనివి తీరకుంటఁ జూచి, “పలుమఱు శ్రీహరి గురునిం దలఁపు తెలుపుమనిన నింద్రుదు నాకము నందు న్నిలుపు మని కోర” “నవ్విధము నటు కానిమ్మని హరి యనుగ్రహించె”నఁట! సురేశ్వరునకు బుద్ధి గఱపు టకుఁ గానున్నఁ బుట్టుఁగైదువుజో డింతె ట్టునకి సేయుట యెన్నఁడైనఁగని యున్నారమె? వజ్రనాభదైత్యుఁడు స్వర్గముపై దాడివెడలి సురలఁబాఱఁదోలి నస్వ డింద్రునిఁ గని, కృష్ణుఁ డిష్టబంధువనియు, సత్పురుషుఁ డనియుఁ గొనియాడి యాతని వెఱపు బోఁ జఱచుట మన మెఱుఁగమా? ఈ గ్రంథాదియందు వేదములఁ గోల్పో యిన బ్రహ్మ తన తండ్రి యొద్దకు నిర్భయముగాఁ బోవుట మనము గనియుండమ లేదా? హరి యైనను దన యభిప్రాయ మస్ఫుటముగాఁ దెల్పియుండ లేదు. “కులబలసంపదా దులు దగుల్కొన హత్తిన మత్తవృత్తి...తప్పుల ముడివోయినప్పుడు కదా తొలఁగు” నని మొదట జనసామాన్యమునుంగూర్చి చెప్పి, పిమ్మట బుభుక్షుండు “ప్రభూతా ప్రభవ ప్రభూతపటువైభవగర్వభరంబునఁ దజ్జత దప్పి భవానిప్రసాద మభిభవించె” ననియు, దుర్వాసుఁడు “సదయుండై గోవిందుఁడే కలఁ డటంచు నాక్రమవ్వక యూరకయే నెడలిన” శాపము గ్రమ్మఱింప నెవ్వరికిఁ దరముగాదనియుఁ, బాఠశాలాధ్యక్షుఁడు తన క్రిందియుపాధ్యాయుని ధిక్కరించిన విద్యార్థికి బుద్ధి చెప్పిన చొప్పున దిక్పాలమాలికిఁ దలవంపు గలుగఁ బలికెను. మఱియు బలిభంజన మొనర్చిన పిదపఁ గూడ “స్వారాజ్యం బింద్రునిచేత సాంద్రప్రేమంబున నిస్తంద్రత నేలింపు”మని మునులు ననిమిషులును

మనవి సేసినం గాని పట్టాభిషేకంబున కియ్యకొనఁడాయె. అంగీకార మొసంగిన పిమ్మటం గూడఁ, దాను సన్నాహ మొనర్పు మనుటకు మున్న పార్వతీపరమేశ్వరుల నారాధింపకయే, బ్రహ్మర్షియుక్తుం డై పట్టాభిషిక్తుం డగుటకు వచ్చి యుండె నని విని "యేకతంబున నింత పుట్టె, దాని నిప్పుడైన మరలింపఁ గానఁ డయ్యె" నని వాస్తోష్పతిం గూర్చి గీష్పతితో మొఱవెట్టసాఁగెను. ముక్కంటియు నాతని మచ్చికంటియు గూడఁ దెఱగంటిదొరకు తమ యడుగులపైఁ బడి మ్రొక్కు లిడిన లేవనెత్తి "యైన దేమయ్యెనో భుక్తమయ్యెఁ గాని, యిప్పుడైనను దృశ్యమందించు కైన, నీశ్వరుని కంటె భేద మంచెంచఁబోకు" మని చెప్పి, యాతని యహంభావము వేరంటఁ దెగనఱకి, తమ పురి కరిగిరి. కావున నీ మూఁడాశ్వాసములలో మహేంద్రగర్వభంగము ముఖ్యాంశ మని సంశయము లేక చెప్ప వచ్చు. అయినను, మొదటఁ బడరాని వెతలఁ బడి, తుదకు స్వకర్తృకముచేత నైన నేమి, యీశ్వర సంకల్పమున నైన నేమి, కథా నాయకుఁ డానందాభ్యుదయ మందిన కారణమువలన, నయ్యలరాజు రామభద్రుని గ్రంథమునకు "రామాభ్యుదయ" మను పేరు వచ్చిన తీరుననే, మహేంద్రునకు భగవత్కటాక్షమునఁ దుదకుఁ గలిగిన విజయమునుబట్టి యీ గ్రంథమునకు "మహేంద్ర విజయం" బను నామంబుంచఁబడి యుండవచ్చును.

షష్ఠాశ్వాసమునందలి కథాసూత్ర మొక్కొక్కచోటఁ జిక్కుగాఁ దోఁచిన నోపికతోఁ జదివిన వదలించుట సులభమే. క్షేత్రమహిమను దెల్పునవి కొన్నియుఁ, దారకమంత్ర ముపదేశ మందినవారికి వేంకటేశుఁడు సులభగమ్యుఁ డని చూపునవి గొన్నియును, నై దీనియందుఁ గూర్పఁబడిన కథలు రెండు విధములుగా నున్నవి. అశ్వత్థ వృక్షము నాశ్రయించి యున్న బ్రహ్మరాక్షసోత్కరమునకుఁ "బద్ధయోదకబిందు సంపర్కమునను, దుష్టభావంబుమాత్రం బె తొలఁగెఁ గాని" "బంధుర సరోంతర్వారి పూరంబులం దానంబాడు" నంతవఱకుఁ బిశాచవృత్తి విడిచి పోదయ్యె. తార్క్ష్యశైలా రోహణ మొనర్చిన వెంటనే మూకబధిరాంధపంగులకుం గలయవరోధము నివారింపఁ బడియె. కళింగరాజకన్య చిఱుతప్రాయమున గరుడభూధరమునకుఁ దోడ్కొనిపోఁ

బడియుంటం జేసి, బ్రహ్మరాక్షసులనుండి రక్షింపఁ బడుటయే కాక యాంధ్రేంద్రు పురంధ్రియయ్యె. పుణ్యక్షేత్రముల నన్నిటిఁ గన్న నారదున కుపమాకలోఁ గాని తారకజపసిద్ధి కల్గదాయె. ఈ మంత్రరాజ ముపదేశ మందినవల్లవునకును బీఠికాపుర వల్లభునకును, వేంకటేశుఁడు వశుఁడై కోరిన వరము లొసంగెను. కళింగరాజతనూజ వృత్తాంతమును, బీఠికాపురాధీశులకు వంశపరంపరాగతము లగు నామధేయముల వ్యుత్పత్తియును, దెల్పుగాథ షష్ఠాశ్వాసమున కెల్ల స్తోత్రపాత్రమై యున్నది. కొన్ని గ్రామనామముల యర్థముం బట్టి మిగుల నేర్పుతోఁ గూర్పఁబడిన దగుటచే, స్వకపోల కల్పితం బయ్యు వాస్తవముగానే తోఁచు చున్నయది ఒంటిమామిడియే మునివాసము, గావికముపాడే బ్రహ్మరాక్షసుని రావి; తేటగుంటయే ద్విజుఁడు వార్చిన గుంట; గోపాలపట్టణమే వల్లవులిపల్లె. వల్లవుని వృత్తాంతము కూడ శ్లాఘనీయముగనే యున్నది. విద్యాగంధ మెఱుంగక పశుప్రాయుఁడుగాఁ బెరిఁగిన వానికి సామాన్యముగ నీశ్వరతత్త్వవిచారణాసక్తియే పొడమదు. పొడమినను వానిమనం బాధ్యాత్మిక విషయములఁ జాలదూరము పోనేరదు. ధరణీజాతవ్రాతమును, జంతుసంతానమును బెట్టుపోఁతలు లేకయే పెరుఁగుటయు, నంతరిక్షమున లక్షలకొలఁది నక్షత్రము లాలంబరహితములై వ్రేలాడుచుండుటయుఁ జూచి, యాదికారణ మగు శక్తి యెచ్చటనో యుండి తీరవలయు నని గ్రహింపఁ గలఁడు కాని, యాశక్తి యిట్టి దని నిరూపింపఁ జాలఁడు. కావున నట్టి నిష్ఫలప్రయత్నముల మండి యాతని మనస్సు వెనుకకు మరలిపోవును. పిమ్మటఁ జిత్తమునఁ గల్గుమార్పులు వానికి లభించు సాంగత్యము ననుసరించి యుండును. సర్వసాధారణముగ ముక్తిమార్గాన్వేషణాసక్తచిత్తవృత్తాంత మిట్టిదయై గన్పట్టును. ఇదియే మిక్కిలి రమ్యముగా నిందు వర్ణింపఁబడి యున్నది.

"భాషాభిమాని."

19-9-1906.

# తొలిపలుకు

శ్రీ మహేంద్రవిజయ దివ్యమహాప్రబంధ కృతికర్త, శ్రీ దేవుల పల్లి సుబ్బరాయశాస్త్రులవారు సుప్రశస్తకవితా శక్తిగల కవివతంసులు. ఉత్తమోత్తములగు నాంధ్ర కవితిలకులలో నగ్రస్థాన మలంకరించువారిలో నొకరు. మఱియు లోకములోఁగల సకల దేశములలోని కవిశ్రేష్ఠులలోని వారు. ఏ దేశమున నైన నిట్టి విశేష శేముషీ విభవాభిశోభితులగు కవిశిఖామణు లల్పసంఖ్యాకులుగ నుందురు.

శ్రీ మహేంద్రవిజయ ప్రబంధరాజ మాంధ్రమునఁగల సుప్రశస్తమైన గ్రంథములలోనిది. వీరికవిత్వము సర్వాంగసుందరమై విలసిల్లును. వీరి రచన రసికజనమనోరంజకమై రాజిల్లును. చదువఁ దువఁ జవులూరుచుండును. వీరి కవితాలతయం దనవసర పదములు లేవు. కవితావాహిని యసాధారణధారాశుద్ధి గలది. వీరి కవితాకాంత కరఘుకరము రమణీయమై మెఱయుచున్న వీరి శైలి పరిశీలించిన ననన్యసామాన్యమై యసమానలసమానమై విలసిల్లును. వీరి కవితయందు గల భావనాశక్తి వర్ణనాతీతము. ప్రసన్నత ప్రశంసనీయము. రచన రసోచితమై చెన్నారుచుండును. రసపోషణ మతులితమై తనరారును. రసము పొంగి పొరలుచుండును. వీరి కావ్యకన్య శబ్దార్థాలంకారములతోఁ నలరారును. వర్ణనా వైదగ్ధ్యము విశేష విస్మయము గొలుపును. మహామనోహరములైన సహజవర్ణనము లనేకములు గలవు. చమత్కారము లగు జాతీయములతో తేజరిల్లుచుండును.

వీరి కవిత్వతత్త్వమును గురించి విమర్శకశిఖామణి యగు మొక్కపాటి సుబ్బరాయుడుగారు పీఠికయందు మిక్కిలి చక్కగా చర్చించిరి. ఈ ప్రబంధమునందలి విశేషములను విపులముగను, వివరముగను, విశదపరచిరి. ఈ విమర్శనము ప్రశంసార్హమై యాదర్శముగ నున్నదనుటకు సందియములేదు. ఈ పీఠిక పాఠకులకు ముదమాపాదించును.

ఈ సుధీనిధు లిరువురు పావనచరిత్రులగు నా మిత్రరత్నములు. వీ రిరువురును నాకు గురువర్యులు. వీరి రసవత్తరములగు రచనలకు తొలిపలుకు లిఖింపగలుగు భాగ్యము లభించుటచే నేను కృతకృత్యుడనైతిని. వీ రిరువురును దివంగతు లగుటవలన నేను నేడుగూడ మిగుల వగచుచున్నాను. దైవ సంకల్పము దప్పింప నేరితరము ?

నా గురువర్యులగు వీ రిరువురకు గౌరవ పురస్సరములగు నా నమోవాకము లనేకము లర్పించుచున్నాను.

**శ్రీ రావు వేంకటకుమార మహీపతి సూర్యారావు.**

(శ్రీ పిఠాపురం మహారాజుగారు.)

★

అవిఘ్నమస్తు.

శ్రీగణాధిపతయేనమః.

శ్రీసరస్వతీదేవ్యైనమః

శ్రీహయగ్రీవాయ నమోనమః.

# శ్రీ మహేంద్రవిజయము



## ఇష్టదేవతాస్తుతి.



శ్రీరంజిల్లనొనర్చుఁ గావుత శిలా జీవప్రదాన [1]ప్రథా
ధౌరంధర్యముఁ గాంచి దారుశకలద్వంద్వంబునుం బాదుకా
కారం బూని భజింప భూభరణభాగ్యస్ఫూర్తిఁ గల్పించు సీ
తారామాంఘ్రియుగంబు మాకు ససుఖోదారాయురైశ్వర్యముల్.

చ. వసుధ జనించి యాజనక వంశము నయ్యనవంశ మింపుసొం
పెసఁగ సమున్నతత్వము వహింపఁగ మించిన సీత [2]శీతదృ
క్ప్రసరణము ల్సుధారసపరంపరలై యలరారుఁ గాత నేఁ
డసదృశదోహదస్ఫురణ నస్మదభీష్టలతాఫలాప్తికిన్. 2

---

1. ప్రఖ్యాతి వహించినది. 2. చల్లని చూపులు.

శా. శ్రీవర్ధిల్లఁగఁ జేయుఁ గావుత జటా శ్రేణీమిథోబంధరే
ఖావిశ్లేష మొనర్ప [1]స్వర్ణది తరంగవ్యాజహస్తంబుచే
శీవిం జొన్పినదంతకంకతముఘూండ్క్రి న్మౌళి [2]లేఁజల్వడా
ల్పావుం దాల్చిన శంకరుం డెపుడు సమ్మోదం బెదం గ్రమ్మఁగన్.

ఉ. స్నానజలంబు [3]ధౌతవసనం బను లేపన మోఁగిరంబు దా
నే నెఱిఁ గూర్చి నాథు నెనయించునొ పెండిలికూఁతు రంచు [4]సం
వ్యానముఁ బూని యవ్వరుని యవ్వ నటంచు నటించు భృంగిచం
దానకు నెచ్చెలుల్ నగిన నవ్వెడు శాంకరి మమ్ముఁ బ్రోవుతన్. 4

చ. అనుపమ మైన యాత్మ చతురానన రూఢికిఁ దోడు సత్యవ
ర్తనము మెఱుంగువెట్ట విబుధప్రకరంబుల కెల్లఁ బెద్దయై
మనుమని సన్నశోకలన మానితుఁ జేసిన సద్దయార్ద్రహృ
ద్వనరుహుఁడౌ మహామహు [5]పితామహుని న్నుతియింతు
[ నెంతయున్ 5

శా. శ్రీపూర్ణాకృతిముక్తిసౌధచతురంఘ్రిస్ఫాటికస్తంభశో
భాపీఠీకృత [6]శాతమన్యవశిలాభాస్వత్ఖురోద్యద్రజ
శ్శ్రీపేర్మిం బురుషార్థపాళి నిడ నా శ్రీధేనువాగీశ్వరీ
రూపం బూని తనర్చు వాణి సమకూర్చు న్మాకు వాఁగున్నతుల్. 6

---

1. ఆకాశగంగ. 2. చంద్రుఁడు. 3. తెల్లనిబట్ట.
4. ఉత్తరీయము. 5. బ్రహ్మ. 6. ఇంద్రనీలపురాలు.

సీ. [1]కలుము లీ నోపఁడే కమలాప్తసుతరాజ్య
సంఘటనోపాయ చతురమంత్రి
యిష్టార్థము లొసంగఁడే జానకీరాఘ
వాన్యోన్యకుశలవార్తైకదూత
చిరతరాయుర్వృద్ధిఁ జేయఁ జాలండె ల
క్ష్మణజీవదానభిషగ్వరుండు
కళల నీనేరఁడే ఘనమానిసంపూర్ణ
రామసభైక పౌరాణికుండు
తే. గీ. పావనాకృతి శైవాంశ భవుఁడు శ్రీహ
రిస్వరూపుఁడు [2]భావివిరించనుండు
నిరవధికకీర్తి యగు నాంజనేయమూర్తి
తత్పరిసేవనములు జగత్పావనములు. 7

సీ. ప్రవితత [3]ప్రత్యూహ పవమానగిళన దు
ర్వారతుం [4]డాజగరంబువాఁడు
బహుళాంతరాయపర్వత వినిర్భేదన
ప్రౌఢైకదంతవజ్రంబువాఁడు
పటువిఘ్నగణ[5]తుషవ్రజసముద్ధూనన
[6]ద్రాఘిష్ఠకర్ణ[7]శూర్పములవాఁడు

---

1. సంపదలు. 2. భవిష్యత్ బ్రహ్మ. 3. విఘ్నము.
4. అజగరము-పెద్దపాము. 5. పొట్టు. 6. మిక్కిలిపొడవైన. 7. చేట.

ఘనతరాతంకపంకవినాశనపటిష్ఠ
కటతలదానోదకంబువాఁడు

తే. గీ. భూరి [1]పుష్కరఫూత్కార వారికల్పి
తాసమయవర్షసిక్త [2]రౌప్యాద్ర్యుపత్య
కాత [3]టోత్ఖాత కేలిసంప్రీతివాఁడు
సిద్ధిగణనాథుఁ డిష్టాప్తిఁ జేయుఁగాత. 8

మ. కవనా[4]ఖ్యేక్షువణంబు నాటి జగతిం గాండోన్నతిం బెంచి ప
ర్వవితానస్థితి సంఘటించి రససంపన్మాధురీ సాధురీ
తివిశేషంబు రసజ్ఞజాలమునకుం దెల్లంబుగాఁ గూర్చి గౌ
రవముం జెందినవారి భక్తిఁ దలఁతుం బ్రాచేతసవ్యాసులన్

కం. [5]నన్నయభరితమనోజ్ఞక
నన్నయభవ్యోక్తిగా నొనర్చునుఁ గృపచే
నన్నయభయధృతిమతితో
నన్నయభట్టాదికవిజనంబు నుతింతున్. 10

మ. తమకావ్యాదుల సత్కవుల్ "గుకవినిందం జేసి" యం చొక్కభా
గముఁ గల్పించి రకారణంబ యది నిష్కారుణ్యమాత్సర్యభా
వమె కా కాఘను లుండకున్న నల [6]దేవానాంప్రియశ్రేణి కె
ట్లమరుం గీర్తివిశేషపూర్తి యిలఁ గావ్యాసారపూరోత్థమై. 11

---

1. తొండము. 2. రౌప్యాద్రి + ఉపత్యక = వెండికొండ చేరువనేల. 3. గజక్రీడ.
4. చెఱకుతోఁట. 5. నుతింపదగిన నీతి. 6. మూఢులు.

కం. అని యిష్టదేవతావం
దనముఖకావ్యముఖలక్షణంబుల నెల్లం
బొనరించి యెద్దియే నొక
వనమాలిక్షేత్రమహిమ వర్ణించుటకై. 12

కం. ఊహల కనుగతిగాఁ గా
తూహల మెద మెదల భక్తిదోహలహితసం
దోహలలితానుమతి ను
త్సాహలసచ్ఛక్తిపూర్ణతా [1]హలహలికన్. 13

కం. ఏవానిం గృతిపతిఁగా
భావింతునొ యెట్టి దివ్యభవ్యక్షేత్ర
శ్రీవర్ణ్యము యని యోజన
కావించుచునుండి యే నొకానొక [2]రజనిన్ 14

సీ. శ్రీజానకీదేవి చెలఁగు వామాంక భా
గముతో [3]నిరాబారిగముల తోడ
నాంజనేయాంజలిన్యస్తమా శస్తమా
పదముతో నధికసమ్మదముతోడ
వెనుక సౌమిత్రి పట్టినయట్టిహురుమంజి
గొడుగుతో నపరంజిమడుఁగుతోడ

4. త్వర. 2. రాత్రి. 3. మునులు.

భరతశత్రుఘ్నులుసురటులబూనినపార్శ్వ
యుగముతోఁ జిఱునవ్వుమొగముతోడఁ

తే. గీ. గరములుమొగుడ్చునృపులతోఁ గవులతోడ
ప్రేమరసపూర్తిఁ బట్టాభిరామమూర్తి
[1]పుష్పకాంతరవర్తియై పూర్వపుణ్య
కలన నాగ్రమోల నిలచినట్టులు పలంచి. 15

చం. నిలిచిన [2]కౌసలేయుఁ గని నెమ్మది పమ్మద మిమ్మడింప సాఁ
గిలి ప్రణమిల్లి కొంతవడికిం బులకించిన మేనితోడ దో
యిలి నిటలంబునందు ఘటియించి తదంచితచారుదివ్యమం
గళమహనీయమూర్తి పదకంజములం దిలకించుచున్నెడన్ 16

మ. ఉపమాకాకృతిఁ బుష్పకంబును సుపర్ణోర్వీధరశ్రీ సువ
ర్ణపరార్ధ్యోన్నతపీఠబంధురసరఃప్రౌఢి స్వామిమత్కారా
జ్జపుటప్రోడము వేంకటాధిపతి తేవన్ రామచంద్రుండు నా
కపు డాదేశమురీతిఁ దోఁచె మును నే నాదేశముం గాంచుటన్. 17

కం. వెఱపు న్వెఱఁగు న్వెఱపుం
దొరకొన నప్పుడు నతు ల్నుతుల్సేయుఁగఁ జె
చ్చెరఁ గన్నొఱఁగియెటకే
నరిగెను శ్రీరామమూర్తి యనుచరయుతుఁడై. 18

1. విమానములో నున్నవాడు. 2. శ్రీరాముని.

కం. అంతట జాగ్రదవస్థా
క్రాంతుఁడనై యుండ నప్పుడే కనుపట్టె నితం
డెంతవిశదప్రసాద
స్వాంతము గలవాఁడో యనుచు నతి కౌతుకముతోన్. 19

సీ. మద్వంశజుల దయామతిమీఱ నాదినుం
డియుఁ బ్రోచె వారల నిష్ఠ కలరి
మత్పితామహపితామహు రామశాస్త్రిని
దోడఁబల్కుచుఁ గృతార్థునిఁగఁ జేసె
మత్ప్రపితామహుమహితు వేంకటకృష్ణ
శాస్త్రి నేలెను దదర్చలకు మెచ్చి
తామహుఁ గాచె మహిని సీతారామ
శాస్త్రిఁ దత్సేవకు సంతసించి

తే. గీ. మజ్జనకు[1]నాత్మబోధసంపజ్జనకునిఁ
గృప మనిచె మున్ను వేంకటకృష్ణశాస్త్రిఁ
దత్తదుపచారసంతుష్టచిత్తుఁ డగుట
నన్ను మన్నించె నిటులు ప్రసన్నవృత్తి. 20

తే. గీ. అనుచు ముదితాంతరంగుఁడ నగుచు నిష్ట
దైవతం బగు రఘుపతిధ్యాన వేళ

1. వేదాంత తత్త్వబోధ.

నాదివిభవావతారమర్చావతార
మనలఁ జూపుట కేమి హేతువొ యటంచు. 21

కం. మామూర్తిద్వయ మొక్కటి
గా మది భావింపు మనుటగా నెంచి కృతి
స్వామిని రాముని వర్ణ్య
శ్రీమహితుని వేంకటేశుఁ జేయుతలఁపుతోఁ. 22

తే. గీ. [1]దేవభాషోదితంబు లాంధ్రీకృతంబు
లైన సులభార్థపద్ధతు లగును దాన
నఖిలపఠనీయశైలిచే నలరు నందు
వలన వలనగు విఖ్యాతి కలుగు నంచు. 23

తే. గీ. బ్రహ్మకైవర్తనామపురాణవిదిత
గరుడశైలఘనక్షేత్రగురుమహత్త్వ
మును దెనుఁగొనర్పఁ గుతుకంబు మునుకొనంగ
మును కనుంగొన్న తద్ధామమును దలంచి. 24

సీ. ఆసమున్నతశైలభాసమానాసమ
ప్రాసాదమంటపప్రాంగణంబు
నాపావనగ్రావసోపానపార్శ్వప్ర
దీపావళీస్ఫురద్విభ్రమంబు

2. సంస్కృతము.

నారామణీయకస్ఫారామలోపత్య
కారామతులసీసుసౌరభంబు
నామేఘ[1] మేచకశ్రీమేదురామేయ
కోమలస్వామి తేజోమహత్త్వ

తే. గీ. మా పురంబా సరంబా రథావతంస
మా మహోత్తైర్థికులు నా యుపాయనంబు
లా మహోత్సవ మా భోగ మా ప్రసాద
మా మహాలక్ష్మిఁ గనినట్టు లపుడు దోఁప.

చ. ఇలఁ గల మానవావళి కభీష్టదుఁడై సులభప్రసాదుఁడై
కలియుగమందుఁ దోడఁబలుకం దగు వేలుపు వేంకటేశుఁ డ
బ్బలితపుదైవతంబు నిలువం జెలువం బగు గారుడాద్రికి
న్నెలవుపమాక తన్మహిమ నెక్కొనుగాథ లభింపఁ గోరుచోఁ.

సీ. ద్వైతమతాచారతత్త్వరహస్యజ్ఞుఁ
డఖిలపురాణేతిహాసవిదుఁడు
దేవతాబ్రాహ్మణాతిథిపూజనాసక్తుఁ
డలిపిరాలాన్వవాయాబ్ధిచంద్రుఁ
డమితతీర్థక్షేత్రయాత్రాతిమాత్రప
విత్రగాత్రుఁడు బుధస్తోత్రపాత్రుఁ

1. నలినికాంతి సంపద.

డనఘుఁడు నిత్యసత్యవచఃప్రచారుండు
నగు లక్ష్మణార్యసమాహ్వయుండు

తే. గీ. స్పష్టవర్ణసమిష్టిగా వ్రాసికొనిన
సంస్కృతగ్రంథము నొసంగె సంతసమునఁ
గరుడగిరి శేఖరాఖ్యుఁ డిక్కరణిఁ గరుణ
వృద్ధవిప్రాకృతిని వచ్చి యిడె ననంగ.

కం. దానిం గొని చదువుకొనం
గా నింద్రజయంబు ముఖ్యగాథగఁ దోఁచెన్
గాన మహేంద్రవిజయ మని
దీనికిఁ బే రిడుట మంచిది కదా యనుచున్ 28

చ. [1]అదనులఁ దైవతావళి[2]కుదగ్రముగాఁ గృప భక్తపాళిపై
నొదవిన సజ్జనాకృతుల నొక్కొకచోఁ బొడసూపు నంచు న
భ్యుదయపరంపరాప్తి కిది యొప్పగు సూచక మంచు నెంచికొం
చెద ముదమంది రామవిభు నిక్కృతికిం బతిఁ జేయువాఁడనై. 29

కం. రామకరుణాత్తవృద్ధి
క్షేమకళాభోగభోగకృతికృతికీర్తి*
స్తోమకమనీయవైభవ
మామకవంశావళీక్రమం బెఱిఁగింతున్. 30

---

1. సమయములు. 2. హెచ్చుగా.

### క వంశావతారవర్ణ

సీ. బ్రహ్మర్షులకు నైన వాఙ్మనసాతీత
        మగుచు నగోచరంబైన దెద్ది
యాద్యంతశూన్యమై యఖిలంబుఁ దానయై
        తన కఖిలముగాక తనరు నెద్ది
దిక్కాలములకు భేదింప కవిచ్ఛిన్న
        ముగ నిత్యసత్యమై నెగడు నెద్ది
సంతతాఖండసుస్వప్ర ...... హా
        జ్యోతిస్స్వరూపమై యొప్పు నెద్ది
తే. గీ. యట్టి శ్రీశబలబ్రహ్మమైనయట్టి
    యాదినారాయణుని నాభియందు ముందు
    పొందుగఁ దదీయ సంకల్పమున [1]సిసృక్షు
    పరఁగ సరగఁ జతుర్ముఖబ్రహ్మ వొడమె. 31

కం. [2]ఆవనజాతప్రభవుని
పావనమూర్త్యంతరములు ప్రభవించిరి లో
కావనసక్తులు సమదు
ర్జీవనశక్తులు సుతు ల్వసిష్ఠప్రభృతుల్.

తే. గీ. పరమపావనదివ్యతపఃప్రపూర్తి
    శిష్ట[3]ము ష్టింపచప్రవజశ్రేష్ఠమూర్తి

1. సృజియించుకోరిక. 2. బ్రహ్మ. 3. పిడికెడుగింజలను పచనము చేసికొనెడువాఁడు.

5 *

యాత్మవిద్యావరిష్ఠుఁడౌ నవ్వసిష్ఠు
గోత్రమునఁ బుట్టెఁ గౌండిన్యగోత్రమౌని. 33

కం. రెండవ [1]శశిఖండశిరో
మండనుఁ డన సర్వమౌని మండలమణిమా
ర్తాండద్యుతి గౌండిన్యుఁ డ
ఖండతపశ్శ్రీప్రభావఖనియై తనరెన్. 34

శా. లోకస్తుత్యుఁడు శాంతిదాంతినిధి [2]సుశ్లోకుండు నై నట్టియా
శ్రీకౌండిన్యమహామునీంద్రుని తపశ్శ్రీగౌరవం బెట్టిదో
లోకంబం దితరర్షి గోత్రు లొకపాలుం బాలు తద్గోత్రజుల్
ప్రాకట్యంబుగఁ గావ్యకర్తలు బుధశ్లాఘ్యుల్ గలా రెన్నఁగన్ 35

కం. ఆకౌండిన్యసగోత్రు ల
నేకులు గల రిల రమాసమిద్ధకటాక్ష
శ్రీకలితలలితకవితా
ప్రాకటనైపుణ్యపుణ్యపరిపాకమతుల్ 36

కం. అందు మతత్రయభూమి
[3]బృందారకబృందములను వెలసిరి స్మార్తుల్
గొందఱు వా రిరుతెఱఁగుల
నొందిరి వైదికులునా నియోగులు నాఁగన్. 37

---

1. ఈశ్వరుఁడు. 2. మంచికీర్తిగలవాఁడు. 3. దేవతలసమూహము.

ఉ. అందుఁ ద్రిలింగవైదికబుధాగ్ర్యకుటుంబజనాగ్రగణ్యరూ
ఢిం దగుఁ బాండితిం గనిన ఠీవుల దేవులపల్లివంశ మొ
ప్పం దనకాన్పు ముత్తెముల పోఁడిమి వృత్తవిశుద్ధమై గుణా
స్పందగతిం దనర్చి మహిపత్యుపకంఠవిభూషణంబుగాన్. 38

కం. ఆదేవులపల్ల్యన్వయ
[1]యాదోనిధిపూర్ణచంద్రు లగు విద్వాంసుల్
వేదంబుల శాస్త్రంబుల
వాదంబుల నెదురు లేని వారలు గారే. 39

కం. ధరఁ గొంద ఱందు సీతా
వరపదసేవనవిధానపావనులు గరం
బరయం గొందఱు లక్ష్మీ
నరసింహపదాబ్జసేవనప్రహ్లాదుల్. 40

మ. సముదంచద్గతిఁ దత్కుటుంబములు కృష్ణాగౌతమీమధ్యభా
గమునం దాగిరిపల్లి నామక మహాగ్రామాగ్రహారంబు ము
న్నమరన్ స్వప్రతిభావిశేషముల కత్యానందుఁడై ఫాదుశా
యమరం బిచ్చుట నచ్చట న్నిలచె నిత్యం బైన[2]కాణాచిగాన్. 41

ఉ. వారలలోన రామపద పంకజభక్తి నిరంకుశప్రభా
[3]తారభటీప్రభూతపటిమా సమమంజులవాక్ప్రసంగ వి

1. సముద్రము. 2. స్థానము, ఉనికిపట్టు. 3. ప్రౌఢిమ.

ద్యారమణీయకీర్తిసము దారుఁడు వేంకట ధీరుఁ డెంతయుం
గూరిమి నిల్చెఁ జామరల కోట పురిం దదధీశు కోరికన్. 42

తే. గీ. అప్పుడప్పుడువారలయందు మఱియుఁ
గొంద అల మండపేటయుఁ గోరుమిల్లి
మొదలుగలయూళ్లఁ గాఁపురంబుగ వసించి
రచ్చటచ్చటి విభుల సంప్రార్థనముల. 43

కం. దేవులపల్లికులాగ్రణి
యా వేంకటసూరిమణి బుధావళి మదిసం
భావింప మించు ప్రతిభం
గావించెం గావ్యనాటకము లమితముగాన్. 44

తే. గీ. సప్తగోదావరాంతర [1]జనపదమున
నెందు షడ్దర్శనీపారదృశ్వుఁ డైన
యతని సిద్ధాంతసంప్రదాయంబె కాని
పరమతోదితరాద్ధాంతఫణితి గలదె. 45

కం. అతనికి స్వప్రతిబింబ
ప్రతిముఁడు ప్రతిభావిశేష [2]వాచస్పతి యా
సుతుఁడు జగన్నాథార్యుఁడు
ప్రతతయశస్కుఁడు జనించె వంశకరుండై. 46

---

1. గ్రామము. 2. బృహస్పతి.

శా. సాధుస్తుత్యచరిత్రుఁ డర్కసమతేజస్కుండు సర్వావనీ
నాథానీకసభాప్రపూజ్యుఁడు జగన్నాథాభిధానార్యుఁ డం
బోధిస్ఫారతరంగరంగదురువిస్ఫూర్జద్వచస్సంగునిం
గాఢాబోధనశాలి వేంకటబుధుం గాంచెం దనూజోత్తముల్. 47

కం. ఆ వేంకటబుధమణి గనె
ధీవాచాజితబృహస్పతిభుజంగపతి
శ్రీవృతుల రామకృతి ఘనుఁ
డౌ వేంకటరామశాస్త్రి యను నందనులన్. 48

తే. గీ. అగ్రజుం డొప్పె సకలశాస్త్రార్థవేది
సేతుసీతాచలాంతర ఖ్యాతచరితుఁ
డఖిలసర్వంసహాధీశ్వరార్చితుండు
కీర్తిలసితుండు శ్రీరామకృతివరుండు. 49

తే. గీ. అతఁ డెలమి మైలవరపు వంశాబ్ధిచంద్రుఁ
డగుచు విఖ్యాతిఁ గను వేంకటావధాని
పుత్రికామణి ధర్మకళత్రముగను
గొనియె సీతాంబ సకల సద్గుణకదంబ. 50

సీ. మును ధారిణి జనించి జనకాన్వవాయంబుఁ
బరమపవిత్రమై పరఁగఁ జేసి
పిదప శ్రీరామసాధ్వీరత్నమై మించి
యినవంశమున కెల్ల ఘనతఁ దెచ్చి

భర్తృతోడను [1]మహావనవర్తన మొనర్చి
 [2]సకలదోషాటనాశము ఘటించి
భాస్వత్సతాదిమల్భక్తిసంయుక్తులై
 పరిచర్య సేయ సంపదలఁ బొదలి.

తే. గీ. యార యీసతి నాయంబు సార్థకముగఁ
 దనరె ననుచును జనులచే వినుతిఁగాంచె
 ముఖవినిందితహిమధామనిఖిలభాగ్య
 ధామ సీతాభిధానకాంతాలలామ.* 51

ఉ. భాసురకీర్తియై [3]విబుధవర్గనుతుం డగు రామమూర్తి సీ
 తాసతిఁ బెండ్లియాడి వసుధ న్విలసిల్లినకైవడి న్జగ
 ద్భాసురకీర్తియై [5]విబుధ వర్గనుతుం డగు రామశాస్త్రి సీ
 తాసతిఁ బెండ్లి యాడి వసుధ న్విలసిల్లెను ధర్మశాలియై. 52

సీ. తనదు రామాహ్వయంబున కనుగతిగాఁగ
 సీతాసతీశుఁడై చెలఁగె నెవఁడు
 తనదు [5]సర్వజ్ఞత్వమున కనుకృతిగాఁగఁ
 గామాదివిజయంబుఁ గాంచె నెవఁడు

1. మహా + అవనము—గొప్పగా రక్షణసేయుట. మహా + వనము—గొప్ప అడవి.
2. రాక్షసనాశనము—చెడ్డ పనులను నాశనముచేయుట. 3. దేవతాసమూహము.
4. పండితసమూహము. 5. ఈశ్వరత్వము.

తన చతు[1]రాస్యత్వమునకు సమంబుగా
సరసవాక్సంగతిఁ బరఁగె నెవఁడు
తనదు [2]సూర్యాత్మజత్వమునకు సరిగాఁగ
ధర్మప్రతీతిచేఁ దనరె నెవ్వఁ.

తే. గీ. డతఁడు నుతిఁజెంది జగతియం దలరెఁ గీర్తి
ఘనమహీపతి జగపతి గజపతీంద్ర
వరసభాస్థానపాండిత్యపదనిరూఢి
భాసురుం డైన రామభూమీసురుండు. 53

చ. నిజపదమూలదత్తకృతి నిత్యకృతోత్తమ[3]తారకాఖ్యమం
త్రజపములం బ్రతుష్టుఁ డగు రామునిచే వర మాతఁ డాత్మవం
శజులకునై కొనె న్నిగమశాస్త్రపురాణరహస్యతత్త్వవి
త్త్వజనక మాతదంఘ్రియుగ భక్తివిశేషము శాశ్వతంబుగాన్. 54

చ. అతనికిఁ బూసపాటికుల జాగ్రణియుం గవితారసజ్ఞుఁడుం
బ్రతతయశుండు నౌ విజయరామనృపాలవరుండు గౌరవాం
చితమతి రాజధానిదరి సీమ నొసంగెను సర్వసస్యశా
శ్వతఫలసార మౌ వెలగవాడ సమాఖ్యమహాగ్రహారమున్. 55

కం. ఆతని సోదరుఁ డగుచు మ
హీతలమున వెలసె లసదహీనవచో వి

1 బ్రహ్మత్వము 2. ధర్మరాజత్వము. 3. శ్రీరామమంత్రము

ఖ్యాతుఁడు వేంకటరామసు
ధీతిలకము సర్వదేశ[1]దీవ్యద్యశుఁడై. 56

తరల. జనకజాధిపపాదపంకజషట్పదాయితమానసుం
డనుపమానకళాధురంధరుఁ డర్కసన్నిభ తేజుఁడుౕ
ఘనుఁడు వేంకటరామసూరి [2]విఖండితాంతరవైరియై
వినుతిఁ జెందెను లోకమందు నవీనపాండితి దండినాన్. 57

కం. ఆతఁడు మృదుసంగీత
ఖ్యాతిని సాహితికళాచకాచకి నఖిల
జ్ఞాతలనేతలచేత న
హా తగు గౌరవముఁ గను సభాంగణములలోన్. 58

ఆ. వె. అతఁడు సుకృతిని రఘుఁడతివగాఁ గొనెఁ గోట
మర్తిహనుమదార్యమణికుమారి
సత్యసుమతిని రఘుపత్యంబ యను పేరఁ
దగు వధూటి నకల సుగుణపేటి. 59

కం. వారి తనయుఁ డలరారె న
వారితనయుఁ డాత్మనృపతిపార్శ్వగనానా
సూరిహిత కారి బ్రహ్మన
సూరి[3]దశాస్యారి భక్తి సువ్యక్తమతిన్. 60

1. ప్రకాశమైన కీర్తిగలవాఁడు. 2. అంతశ్శత్రులగు కామక్రోధాది గుణములను జయించినవాఁడు. 3. పదిముఖములుగల రావణునివైరి శ్రీరాముఁడు.

చ. నవరసభవ్యకావ్యరచనారుచిరప్రచురస్ఫురద్వచో
నివహుని రామనామజపనిర్మలధర్మలసత్ప్రవర్తనా
ర్జవలసమానమానసుని రావు మహీపతి రాయ భూపతి
ప్రవరగురుత్వభాసురుని బ్రహ్మసభాసురు నెన్నశక్యమే. 61

కం. బాపన దీనజనార్తిం
బాప నరాధీశు కడఁ గృపామతి నెసఁగుం
గోపన యే తరగతులకుఁ
గోపనఁ దగువారి నెడపి గురుభావమునన్.

కం. తారావళిఁ గృతిఁగొని యా
త్మారమణుం డతని కొసఁగె మాన్యక్షేత్రం
బారూఢి భక్తి మదిఁ జెలు
వారఁ బగర్దీనుపాలె మను గ్రామమునన్. 36

తే. గీ. అతని జ్యేష్ఠపితృవ్యుఁ డైనట్టి రామ
సూరి దత్సతి సీతాంబ సుతులఁ గోరి
రామచంద్రాంఘ్రిపూజనవ్రతనిరూఢిఁ
బెంపుఁగనుచుండి తత్కృపావిలసనమున 64

తే. గీ. తనయు వేంకటకృష్ణాఖ్యుఁ గనిరి పిదప
రామసూరియు నఖిలగార్హస్థ్యసుఖము
గని [1]తురీయాశ్రమంబున ఘనతఁ గాంచి
పరఁగె ధారిణి శ్రీశివస్వామి యనఁగ. 65

1. నాల్గవయాశ్రమము; సన్యాసాశ్రమము.

కం. తత్పుత్రుఁడు [1]సర్వమహీ
భృత్పూజితపదుఁడు సదయహృదయుండు గళా
విత్పతి రఘుపతిసేవా
తత్పరమతి కృష్ణకృతి నుతస్థితిఁ దనరెన్. 66.

శా. జోహారు ల్గదియింతు రాతనికి శిష్యు ల్దేశదేశాగతుల్
సాహిత్యోన్నతి శాస్త్రపద్ధతినిఁ బ్రజ్ఞాశాలులై ఘట్టసం
దేహాపేతమనస్కులై భువిఁ బ్రసిద్ధిం జెంది విద్వాంసులై
యూహా వేంకటకృష్ణశాస్త్రిమణివిద్యాప్రౌఢి సామాన్యమే. 67

సీ. ఆతఁ డప్పలపురుషోత్తమాభిధప్ర
సిద్ధ[3]కార్తాంతికావళీశేఖరునకు
గొనబు గారాబుఁ గూతురై కొమరు మిగులు
దాని వేంకటలక్ష్మి నుద్వాహ మయ్యె. 68

మ. కృపకుం జోటు సుమంగళీత్వమునకుం గేహంబు గుర్వర్చనా
నిపుణత్వంబున కాటపట్టు సుగుణానీకంబు శోభిల్లు చో
క్కపుసద్మంబు పతివ్రతాత్వమునకుం గాణాచి వీక్షింప ము
ర్వి పయిన్ వేకంటలక్ష్మిజో డగు పురంధ్రీలోకచూడామణిన్. 69

మ. జననం బందిరి వారి కార్యులు [3]తనూజన్ముల్ త్రిమూర్తుల్ వలెన్
ఘనవిద్యానిధి రామశాస్త్రియును లోకఖ్యాతశాస్త్రప్రవ

1. అందఱు రాజులచేత పూజింపబడినవాఁడు. 2. జ్యోతిష్కు.
3. కొడుకులు.

ర్ధనుఁ డౌ వేంకటరామశాస్త్రియును సీతారామస్వైకవ
ర్తనసంలబ్ధకళావిశేషుఁ డగు సీతారామ విద్వాంసుఁడున్. 70

కం. ఆముప్పూరిలో నగ్రజుఁ
డామరకరితురగతరుసమామలకీర్తి
స్తోమవిశదీకృతాఖిల
భూమండలుఁ డగుచు రామ బుధవరుఁ డలరెన్. 71

సీ. రచియించె నెవ్వాఁడు రమ్యచంపూప్రబం
ధము రామచంద్రోదయ మను దాని
ఘటియించె నెవ్వాఁడు కనదలంకారశా
స్త్రము వరసాహితీ దర్పణంబు
వచియించె నెవ్వాఁడు బాలభాగవతాఖ్యఁ
దనరారు మృదుకావ్యమునకు వ్యాఖ్య
నొనరించె నెవ్వాఁడు ఘనతరధ్వనిభావ
నవరసంబులఁ బెక్కు నాటకములు

తే. గీ. నాతని నుతింపఁ దరమె రాజాధిరాజ
రావు వేంకటనీలాద్రిరాయలబ్ధ
సరసతరసాహితీసారచక్రవర్తి
బిరుదపరికరుఁ డల రామ విబుధవరుఁడు.

కం. అతనికి వేరొక నామము
పతి పేరని సీతమాంబ పలుకమిచే నం

చిత మగు ముద్దులపేరై క్షితి
బుచ్చయశాస్త్రి నాఁగఁ జెలఁగుచు నుండెన్. 73

మ. ఘనుఁడా బుచ్చయశాస్త్రి ధర్మగృహిణింగాఁ గైకొనెం బ్రీతి ను
ర్విని విద్యానిలయంబనాఁ దనరు సవ్విట్ఠాల లక్ష్మీనృసిం
హునిపుత్రి న్నరసాంబ [1]వక్త్రతులనాప్రోద్య న్నిశానాథబిం
బను సత్కీర్తికదంబ బింబఫలసంబంధోష్ఠ దంతాంబరన్. 74

సీ. అఖిలదేశికసమూహ[2]రథాంగనిత్యభా
సురసూర్యమండలి నరసమాంబ
నిఖిలదీనప్రజానీకచాతకచయా
విరత[3]కాదంబిని నరసమాంబ
సర్వబాంధవపికజాలసాంతత్యకాం
తవసంతవేళ యీ నరసమాంబ
సకలయాచకచకోరకనిరంతరవిభా
స్వరచంద్రరేఖ యీ నరసమాంబ

తే. గీ. నాథసేవావలంబ యీ నరసమాంబ
పరమసుగుణకదంబ యీ నరసమాంబ
సయుసియుక్తకుటుంబ యీ నరసమాంబ
నరసమాజస్తవాలంబ నరసమాంబ.

1. మొగముపోలికకు. 2. చక్రవాకము. 3. మేఘమాల.

కం. ఆ బుచ్చయశాస్త్రికి సుతు
లై బహుశాస్త్రాగమజ్ఞులై వేంకట భా
మిూబుధుఁడుఁ గృష్ణశాస్త్రియు
నాఁబొడమిరి మువురు లక్ష్మణమనీషియునా౯. 76

కం. ఆ మువ్వురిలో నవరజుఁ
డై మెఱసెను లక్ష్మణార్యుఁ డవనీతనయా
స్వామి పదాబ్జయుగధ్యా
నామలమతిజగతివిశ్రుతామితయశుఁడై. 77

వ. అందగ్రజుండు.

ఉ. వేంకటరాయశాస్త్రి పృథివీతనయాహృదయాధినాథప
త్పంకరుహద్వయాపచితి వైభవజాతసమగ్రసాహితీ
సంకలితప్రగల్భసువచస్కు౯ మనోజ్ఞయశస్కు౯ రూపమిూ
నాంకు విధూతశంకుఁ దరమా నుతియింపఁగ నేరి కేనియుః 79

ఆ. వే. వినుతసుగుణశాలి వేంకటరాయార్య
పాళి మహాళిహాళి నాలిగాఁగఁ
బేర్మిచే వరించె విట్టాల కృష్ణార్య
సుతను దిమ్మమాఖ్యఁ దతసమాఖ్య 80

చ. అతని సహోదరుం డలరె నా మలయాద్రిహిమాచలాంతర
క్షితితలవర్త్యశేషనృప శేఖరభవ్యసభాంతరాళసం

సితపర[1]విద్వద్దోఘకరి సింహము వేంకటకృష్ణసూరి స
న్నుతగుణహారి శిష్యజన తోషణకారి యశోనుసారియై. 80

కం. ఆ వేంకటకృష్ణాఖ్యో
ర్వీవిబుధుఁడు పతిసమాఖ్య వేంకటలక్ష్మీ
దేవి వచింపమిఁ దమ్మన
కోవిదుఁ డను వేఱు పేరఁ గొమరొందెఁ భువిన్. 82

సీ. సంత [2]తాంతేవాసి చింతితవిద్యాస
మృద్ధిక్రియాహయగ్రీవమూర్తి
దినదిన శ్రీరామ దేవసేవాభినం
దితమనస్స్ఫుర ణాంజనేయమూర్తి
నిత్యసూనృతభాష ణాత్యంత తాత్పర్య
సాంద్రవర్తనహరిశ్చంద్రమూర్తి
సతతదీనావన వ్రతమహాకారుణ్య
విభవసంపూర్ణతా విష్ణుమూర్తి.

తే. గీ. వలిలె హరిదంతకరిదంత వలయకాంత
మహితకలధౌతకటరాయ మానకీర్తి
నయగుణస్ఫూర్తి తమ్మన నామధేయ
సకలపండితమండలీ చక్రవర్తి. 83

1. విద్వాంసుల సమూహము. 2. శిష్యుఁడు.

కం. చెన్నలరుబుద్ధి గురుమిం
చెన్నలరుచి నెంచె రూపు సిరి మేలని త
మ్మన్న నల విబుధు లెల్లను
మన్నలను మెచ్చి నిచ్చ మనిచెద రెలమిన్. 84

చ. ఘను డతఁ డింద్రకంటికుల [1]కంధిసుధాకరుఁ డైన కొండయా
ఖ్యునకును బాపనమ్మకును గూర్మికుమారిక యైన బుచ్చమా
ఖ్యను [2]హరిదంతదంతురిత కాంతసుధాకరకాంత సత్ప్రమా
ఖ్యను వరియించెఁ బంచశర [3]ఘస్మరుఁ డద్రికుమారి కై వడిన్. 84

సీ. స్ఫూర్జితకాంతివిస్ఫూర్తిచే సర్వంస
హాదేవితోడ సామ్యము వహించుఁ
బరమపాతివ్రత్య గరిమచేత నరుంధ
తీ సతితోడ మాదిరి వహించు
బహుభోగభాగ్యసంపదచేత నిందిరా
సుందరీమణితోడ [4]జోకగాంచు
ఘనతర సౌభాగ్య కలనచే [5]భూమిభృ
త్పతికుమారికతోడ జత వహించు. 85

తే. గీ. నహహ యా సాధ్వి కెనయైన యట్టి దాని
నెందులను గాంచ మని యెన్న నెసఁగె నవని

1. సముద్రము. 2. దిగంతరము. 3. చంపినవాఁడు. (ఈశ్వరుఁడు)
4. సామ్యము. 5. పార్వతి.

నసమసుగుణకదంబ కృపావలంబ
పూర్ణతరసత్కుటుంబ శ్రీ బుచ్చమాంబ. 86

కం. సుతు లాదంపతుల [1]కయా
న్వితులై బుచ్చయ్యశాస్త్రి వేంకటరామ
క్షితిసురవర్యుఁడు బొడమిరి
మతిమంతులు కీర్తిపూర్తిమగ్నదిగంతుల్. 87

కం. వా రిరువురిలో జ్యేష్ఠుఁడు
శ్రీరామసమర్చనా గరిష్ఠుఁడు సుమనో
వారశ్రేష్ఠుఁడు బుచ్చయ
సూరివరిష్ఠుండు దనరె సుస్థిరకీర్తిన్. 88

సీ. ఏ యార్యవర్యుండు గాయత్రితోఁ గూడ
నధ్యయన మొనర్చె నాగమముల
నే పండితుఁడు పదియేండ్ల యీడునను వ
క్కాణించె నల పంచకావ్యములను
నేసూరి పదియు రెండేండ్లవాఁడై కనె
నాటకాలంకారపాటవంబు
నే కోవిదుఁడు పదాఱేండ్లప్రాయమ్మునఁ
జదివె శబ్దన్యాయశాస్త్రయుగము

1. శోభాన్వితులు.

తే. గీ. నే విచక్షణమణి పూర్ణ యౌవనమున
నాంధ్రభాషామహారహస్యంబు నెఱిఁగె
సతని వినుతింపఁ దరమె దిగంతకాంత
సద్యశస్సాంద్రుఁ డుబ్బయశాస్త్రిచంద్రుఁ. 89

ఉ. నిచ్చలు రామనామజపనిష్ఠ సమాశ్రితశిష్యకోటికి
స్వేచ్ఛగ విద్యలం గఱపు నేరుపుల న్గురువృద్ధసేనల
స్సచ్చరితప్రభూతసుయశంబుల నెల్లధరాతలంబున
న్బుచ్చయశాస్త్రి సాటియగు పూరుషులుందురె యందు రందఱున్

మ. ప్రకటగ్రంథవిదుండు బుచ్చయసుధీంద్రశ్రేష్ఠుఁ డావింజమూ
రి కులేంద్రుం డగు వేంకటేశబుధుపుత్రీరత్న మా సుబ్బమన్
సకలస్త్రీజనతాశిరోమణి సమంచన్మంజువాగ్ధోరణి
న్వికచాంభోజదళాక్షిఁ బత్నిఁగ మహాప్రేమంబుచేఁ గైకొనెన్ 91

చ. అతని సహోదరుండు తనరారె నిరంతరరామనామసం
స్మృతిపరిపూతచిత్తుఁడయి మేదిని వేంకటరామశాస్త్రి య
ప్రతిమవిహాయితప్రచుర రావుకులేశ్వర రామరాణ్మహీ
పతి కరుణాకటాక్షసముపాత్తబహూకృతియై కృతీశుడై. 92

కం. ఆ వేంకటరామార్యుఁడు
శ్రీ పింగలవంశ వరనృసింహాహ్వాయసం
ఖ్యావన్మణిసుత లక్ష్మీ
దేవి న్వరియించెఁ గులసతీమణి గాఁగన్. 93

ఆ. సత్సతీసమాజసంశ్లాఘ్యమానపా
వనపతివ్రతాత్వభాసమాన
యగుచు గణుతిఁ గాంచె జగతి లక్ష్మీదేవి
సాటి బోఁటులెల మేటి యనఁగ. 94

కం. ధరణీకుమారికావర
కరుణాస్ఫురణాభివృద్ధకాంక్షితుఁ డాయి
ర్వ్యారకుం దనూభవుండై
ధర శంకరరామశాస్త్రి తనరారె నొగిన్. 95

కం. అతఁ డతివగ వరియించె
న్వితత శ్రీ వింజమూరి వేంకట రామ
క్షితిసురవర్యుని కూరిమి
సుత వేంకటరమణమాంబ సుగుణకదంబన్. 96

కం. అతనికి వేంకట రామయ
సుతుఁ డెసఁగుచు నున్నవాఁడు సుగుణాన్వితుఁడై
క్షితిజాధినాథకరుణో
న్నత విద్యాయుర్యశోధన శ్రీయుతుఁడై

ఉ. అతని తాత తాత యయి ఖ్యాతివహించిన రామశాస్త్రికిం
బ్రీతిఁ దనర్చు తమ్ముఁడయి వేంకటరామసుధీవరుండు భూ

మీఁతనయాధినాయకసమిద్ధకృపాసముపాత్తసర్వ[1]ఖ
ర్వేతరశాస్త్రకౌశలసమేతుఁ డనం దనరారె ధారణిన్. 98

శా. తర్కవ్యాకరణాదిశాస్త్రముల సిద్ధాంతంబు సందేహసం
పర్కం బించుక రాకయుండ జగతిం బ్రఖ్యాతి యాతారకేం
ద్వర్కం బై తనరారఁగాఁ దెలిపి శిష్యశ్రేణికి న్నిత్యముం
గోర్కె న్వేంకటరామకోవిదుఁ డొసంగుం గూర్మి వాటిల్లఁగన్

మ. అతఁ డార్యాగ్రణి వింజమూరికులజుం డై యొప్పు లక్ష్మీశుఁడన్
క్షితిదేవోత్తము కూర్మికూఁతు సుగుణశ్రీసంవిధాన న్మహా
యతకీర్తిప్రతిభాసమాన రఘుపత్యంబాభిదాన న్సమం
చితరాగంబున ధర్మపత్నిగ వరించె న్నారి లక్ష్మిన్నవాలెన్. 100

మ. అఘవిధ్వంసనహేతుసువ్రతవిధానాసక్తి లోకప్రియా
లఘుసత్యోక్తి హరిత్సమూహపరివేల్లత్కీర్తియు [2]సర్వభూ
తఘృణాస్ఫూర్తి నితాంతశాంతియును నిత్యక్షాంతియుం జూడ నా
రఘుపత్యంబకుఁ గాక యన్యుల కిలం బ్రాపించునే యేరికిన్. 101

కం. తనయుఁడు వారికి సమధిగ
తనయుఁడు జనియించె రూపతారుణ్యరమా
తనయుండు కృష్ణవిబుధుం
డనిశముఁ దన యశము దిశల నసదృశతఁ దా.... 102

1. సాంఖ్యము మొదలగు శాస్త్రము. 2. అన్నిభూతములయందు దయ.

గీ. సరస విద్యల గురువుల సరస నేర్చి
నిర్మితిగఁ గావ్యనాటకనిర్మితిఁ గని
రాజు లర్చింప బహుశిష్యరాజు లలర
మహితగతిఁ గృష్ణబుధుఁ డొప్పె మహితలమున. 103

ఉ. అర్కనిభుండు కృష్ణబుధుఁ డాతఁడు రాజసభాంతరంబులం
[1]గర్కశతర్కశబ్దము లఖండతరంబుగ [2]వ్యాహరించుచో
శర్కర లట్లు దోఁచు మృదుసాహితివాక్యము లుచ్చరించుచో
శర్కర లట్లు దోఁచును రసజ్ఞరసజ్ఞులచంద మెట్టిదో. 104

ఉ. నిర్జితవైరియూథుఁ డవనీసురనాథుఁడు కృష్ణ కోవిదుం
డార్జవ మొప్ప భూవరసభావళి శాస్త్రములం బ్రసంగము
[3]ల్వార్జనురుద్భవాండచయభాండవిఖండనలీలఁ జేయుచో
నూర్జితగర్జితస్ఫురణముం బచరించుచు మించు నెంచఁగన్. 105

కం. కిరణవిభాస్వరుణవిభా
స్ఫురణ దగెం గృష్ణశాస్త్రి భువిఁ దనకు మహీ
వరజనతాదరము నత
స్థిరఘనతాప్రాపణముఁ బ్రసిద్ధి ఘటింపన్ 106

సీ. తనదువ్యాఖ్యాక్రియాదక్షత విశ్వగు
ణాదర్శకావ్యసద్వ్యాఖ్య పలుకఁ

1. కఠినము, 2. చెప్పచో. 3. పడగండ్ల సమూహము.

దనఘనపాండితీదార్ఢ్యంబు దర్కసా
రంబునాఁ దనరు గ్రంథంబు నుడువఁ
దనసరసప్రబంధనిబంధనంబు సా
హితిసార మను మహాకృతియె తెలుపఁ
దనసర్వవిద్యాప్రదానైకతానత
శిష్యప్రశిష్యగోష్ఠియె వచింప.

తే. గీ. నలరె శ్రీరామచంద్రపాదారవింద
యుగళసంసేవనప్రాప్త నిగమశాస్త్ర
సారసారస్యసరణిప్రశస్తమధుర
మృదువచనపాళి కృష్ణశాస్త్రీంద్రమౌళి. 107

గీ. పృథులగుణశాలితయును సద్వృత్తతయును
విమలకాంతియుఁ దనరు నుర్వీసురాగ్ర
గణ్యుఁ డగు కృష్ణశాస్త్రి విఖ్యాతిఁగాంచె
లలితగతి వంశముక్తాఫలం బనంగ.

మ. శ్రితవిద్యార్థిజనప్రతోషణహయగ్రీవుండు కృష్ణార్యుఁ డా
యతకీర్తిస్థిర వెల్మకన్నికులజుం డౌ సూర్యనారాయణ
క్షితిదేవోత్తముపుత్రి సన్నుతగుణశ్రేణి న్మహాలక్ష్మి న్సం
తతమోదంబు మనంబునందుఁ బొలుపొందం బత్నిఁగాఁ గైకొనెన్

సీ. కాంతపాదాంబుజాక్రాంతసంసర్గసం
క్రాంతభృంగాయితస్వాంత యగుచు

సంతతగురుజనసంతోషసంధాయి
శాంతతాదిగుణ [1]నిశాంత యగుచు
సంతానభూజలతాంతకాంతిస్ఫూర్తి
నంతకీర్త్యుజ్జ్వ [2]లాశాంత యగుచు
క్ష్మాంత రాఖిలసతీసంతతి ప్రతిదినా
త్యంత సమ్మానితోదంత యగుచు.

గీ. మఱి కృతాసేతుకాశికామధ్యసంస్థ
సకలపుణ్యనదీక్షేత్ర నికరయాత్ర
యుభయగోత్రపవిత్రశ్రీ శుభచరిత్ర
యై మహాలక్ష్మి తనరారె [3]నోరగోత్ర. 110

శా. క్ష్మావాసాఖిలభామినీ జనవతంసం బౌ మహాలక్ష్మియం
దావిద్వజ్జనతాశిరోమణి సముద్యద్భాగ్యసౌభాగ్యస
ద్భావైశద్యముచేత హృద్య మగు పుత్రీయుగ్మముం గాంచి తా
నావారాణసి మేను వాసి కనె నిత్యానందమహా స్థానమున్.

సీ. శ్రీదగు నక్కుమారీద్వయి జ్యాయసి
యై పురంధ్రీరత్న మగుచుఁ దనరు
చున్నలక్ష్మీదేవి [4]నన్నగాధీశ్వర
కన్యకఁ జంద్రశేఖరుని కరణి

1. స్థానము. 2. దిగంతము. 3. భూమి. 4. పార్వతి.

వింజమూరివలాబ్ధివిశదాంశుఁ డైనట్టి
వేంకటరామకోవిదవరేణ్యుఁ
డుద్వాహమై శ్రీరఘూద్వాహపాదపం
కజయుగసేవాప్రకర్షలబ్ధ

తే. గీ. బహులసదపత్యభృత్యసంప్రత్యయాతి
భాగ్యసౌభాగ్యసంపద వాసి చెందె
వసుధ నాదంపతులె కదా భవ్యకీర్తిఁ
[1]ప్రథిమ గనుచుండ్రు మామకశ్వశురు లగుచు. 112

కం. భాసిలె నా కృష్ణబుధా
గ్రేసరుని పితృవ్యుఁ డగుచు శ్రీరామపదా
వాసహృదయాంతరుండై
శ్రీసీతారామశాస్త్రి చిరతరకీర్తిన్. 113

సీ. సకలలోకఖ్యాత సకలలోకత్రాత
నిత్యసంస్తుత్యపాండిత్యశక్తి
మిత్రనందనముఖ్య మిత్రనందనసఖ్య
రామపాదామలోద్దామభక్తి
శ్రుత్యంతసమ్మత శ్రుత్యంతసమ్మిత
సత్యసాంగత్యసంప్రత్యయో !

---

1. ప్రఖ్యాతి.

బంధురక్షణకథా బంధురక్షణవిధా
గణ్యసాద్గుణ్యనైపుణ్యయుక్తిఁ
తే. గీ. గాంచి మించె నబ్ధికాంచి మధ్యస్థసా
నాధరాతలాధినాథలబ్ధ
రాజితస్వమాన్యరాజి సీతారామ
బుధవరుండు ధీ విబుధ గురుండు. 114

శా. శాంతిం జూచిన మూర్తియే శుచిత నెంచ న్రూపమే జానకీ
కాంతాంఘ్రిద్వయభక్తి నారయఁగ నాకారంబె యశ్రాంతహృ
త్సంతోషం బరయంగ విగ్రహమె సీతారామవిద్వద్వరో
దంతం బెంతసి యెంతు ముర్విఁ గలరే తత్తుల్యులౌ పండితుల్.

శా. సీతారామసుధీవరుం డతఁడు వాసిన్ భాసిలెం బాండితీ
స్ఫీతిప్రౌఢిఁ బరోపకారనిరతి న్నీలాద్రిరాయాధిపుం
బ్రీతుం జేయుచుఁ దత్కుమారమణి యౌ శ్రీసూర్యరాయక్షమా
నేతన్ రంజిలఁ జేయుచు న్సరసవాణీధోరణిన్ ధారుణిన్. 116

కం. కొలచెలనకొండనాఖ్యో
జ్జ్వలబుధసుత సుబ్బమాఖ్య సహధర్మిణిగా
నలసీతారామార్యుం
డల సీతారాము రాముసట్లు వరించెన్. 117

సీ. ఏ పురంధ్రి మనంబు గోపురంబుగ నుండు
నేపుగఁ బతియంఘ్రిదాపునందు

నే సతి సౌభాగ్య మాసతిత్రో సాటి
. యై సరిలేని వికాస మూను
నే భామ సౌందర్యశోభావిశేషంబు
శ్రీభామినీజకాంతాభఁ బూను
నే వధూటి శమం బిలావధూసదృశమై
ధీవరేణ్యా స్తవశ్రీ వహించు.

తే. గీ. నట్టి కల్యాణి మృదువాణి నసితవేణిఁ
గులయుగపవిత్ర సుచరిత్ర జలజనేత్ర
సుతనుగణముఖ్య సుసమాఖ్య సుబ్బమాఖ్య
వినుతిఁ జేయంగఁ దరమె శేషునకు నైన. 118

ఉ. ఆ మహనీయదంపతుల కాత్మజుఁడై పొగడొందె భవ్య తే
జో[1]మిహిరుండు కుందశరసుందరుఁ డూర్జితబుద్ధిశాలి వి
ద్యామహితుండు మేరుధరధైర్యుఁడు వేంకటకృష్ణశాస్త్రి ల
క్ష్మీశమహీశాబ్జనాభులకు [2]జిల్కాహుమాయివజీరు తీరునన్. 119

సీ. తన ముఖాంభోజాతమున కంబుజాత్రాస
నాంగనామణి రాజహంసి గాఁగఁ
దన మనస్సారసంబునకు రాఘవరామ
భద్రుండు మత్తషట్పదము గాఁగఁ

1. సూర్యుఁడు. 2. మన్మథుఁడు.

దన కీర్తి యొప్పె దానసీమకు నభంబు
కసూరి! కాచిత్రకంబు గాఁగ
దన యాతిథేయతా ²ఘనసమాగమ వేళ
కతిథిజాలము ³బర్హివితతి గాఁగ

తే. గీ. బరిఢవిల్లెను దేవులపల్లి వంశ
కలశజలనిధియామినీకాంతుఁ డఖిల
భూతలాధీశ్వరనికాయపూజ్యుఁ డగుచుఁ
బృథులగుణహారి వేంకటకృష్ణసూరి 120

గీ. క్షితివినుతి గాంచె వేంకటకృష్ణసూరి
శ్రీమహారాజపద రావు రామరాయ
రాజవర్యాళికిఁ దారకబ్రహ్మమంత్ర
సిద్ధతత్త్వోపదేశ దేశికతఁ బూని. 121

కం. ఆ వేంకటకృష్ణార్యుఁడు
భావుక జనమంచివంశ వారిధిలక్ష్మి
దేవి యగు వేంకమాంబను
బావనతరగుణకదంబఁ బరిణయ మయ్యెన్. 122

శా. పాతివ్రత్యముచే నరుంధతిని సౌభాగ్యంబుచే గౌరి వి
ఖ్యాతస్ఫీతశమంబుచేత ధరణిం గల్యాణసంపత్తిచే

1. బొట్టు. 2. మేఘములు; గొప్పవారు: 3. నెమళ్ల సమూహము.

శ్రీతస్త్రీమణిం బోల్పం గాం దగు ననం జెల్వొందు సాధ్వీజన
వ్రాతోత్తంసము వేంకమాంబ వినుతింప న్శక్యమే యేరికిన్. 123

సీ. అనఘాత్ముండై నట్టి జనమంచి కృష్ణాఖ్య
ధరణీసురేంద్రుండు తండ్రి గాంగ
సాధ్వీలలామ యైజగతిపైం దనరిన
గౌరమ్మ దల్లియై గరిమ మీఱ
సుజనావతంసమై సొబ గొందుచున్న ర
ఘ్నాకరార్యుండు దమ్ముండై తలిర్ప
హిమకరశిఖరి తండ్రిగ మేనకాసతి
జననిగా మైనాకుం డనుజుండు గను

తే. గీ. శివి నెసంగెడు పార్వతీదేవి యనంగం
దేజరిల్లిన సత్పురంధ్రీమతల్లి
తతయశఃకల్పవల్లి మాతల్లియైన
వేంకమాంబను వినుతింతు విపులభక్తి. 124

ఉ. ఇజ్జగమందు నెచ్చటయు నిట్టి సతీమణిం గాన మంచు వి
ద్వజ్జనము ల్నుతింప సతతంబుం జెలంగుచు భవ్యకీర్తిసం
పజ్జితకల్పవల్లి యయి మాన్యతం గాంచిన వేంకమాంబ న
స్మజ్జనని న్నుతింపం దరమా ధర మాదృశు లైన వారికిన్. 125

కం. ఆ దంపతులు తనూజుల
నా దశరథనృపతనూభవాంఘ్రిసపర్యా
పాదితసకలకలాస
మ్మోదితలోకులను గనిరి మువ్వుర మమ్మున్ 126

కం. భాసిల్లె మాకు నగ్రజుఁ
డై సీతారామశాస్త్రి యనఘుం డనిశ
శ్రీసీతారామధ్యా
నాసక్తిపవిత్రమానసాంతరుఁ డగుచున్ 127

గీ. వింజమూరికులపవిత్ర సీతారామ
యార్యునకును రాజమాంబికకును
సుతను సుబ్బమాఖ్యసతిగ సీతారామ
విబుధమణి వరించి వినుతిగాంచె. 128

గీ. ఆమహితురాలు మహిమజాహ్నవిని బోలుఁ
బున్నియంబులబారు నోముల కొటారు
సతులకును మేటి కరుణారసంపుఁ బేటి
సుగుణనికురుంబ దనరారె సుబ్బమాంబ. 129

కం. వరగుణుఁడు చిరంజీవిగఁ
బరఁగుచునున్నాఁడు రామభక్తుఁడు మత్సో
దరుఁ డన్నిట మత్సముఁడై
ధర వేంకటకృష్ణశాస్త్రి తమ్మన్నయు నాఁ. 130

గీ. అకలుషస్వాంతవర్తనుం డగుచు వింజ
మూరి చినసుబ్బరాయవతారనామ
యుగళి విఖ్యాతిగనిన యార్యునిసుపుత్రి
ధర్మపత్నిగ నాతఁడుద్వాహమయ్యె. 131

కం. కనె నతఁడు సుతుఁజిరాయువుఁ
జిన వేంకటకృష్ణశాస్త్రి శ్రీరామకృపన్
దనరారుచు నున్నాఁడిఁక
దనరఁగలఁడు వాఁ డపత్య ధనసంపదలన్. 132

సీ. హితపండితులఁగూడి శతలేఖినీపద్య
నిర్మాణచాతురిఁ బేర్మినరసి
నిజవంశముక్తావళి జనంబు వినుతింప
గీర్వాణభాషను గృతి గ్రహించి
యాశ్చర్యకరవిధా నాష్టావధాన వి
నోదకేళులఁ గడుమోదమంది
యభిమతబహుపురాణార్థగుంభితశుంభ
దాశుధారాలీల లాలకించి

తే. గీ. కల్పితానన్యసామాన్య గౌరవమునఁ
బ్రేమ రావు గంగాధర రామ రాయ
భూమివరమణిసానుజన్మునిఁగ నెపుడు
మించు కృపఁజూడ విఖ్యాతిఁ గాంచినాడ 133

ఉ. సాధుజనావనప్రవణ శస్తయశస్స్తవనీయ రావు గం
గాధర రామరాజు నృపగౌరవపూర్వకదత్తసింహపీ
ఠీదనరత్నభూషణ[1]పటీప్రకటీకృతకావ్యకల్పనా
సాధనుఁడం దదాత్మభవసంస్కృతదేశికతాప్రసిద్ధుఁడన్. 134

కం. శ్రీమద్రఘురామప్రభు
నామస్మృతిపాదపూజనవ్రతముఖదీ
క్షామతిఁ జంద్రమపాలె
గ్రామనివాసుండ సుబ్బరాయాహ్వయుఁడన్ 134

ఉ. వేలుపు రాఘవుండు పదివేల పురాణము లన్యు నెన్న నీ
యేలిక లన్న రావుకులులెప్పటి వారల కప్పుడొప్పు భూ
పాళి నిజంబుగాఁ దనకటంచును దేవులపల్లివంశ భూ
పాళిదలంచుచుండుఁ దనపాలిటికీ యుభయంబె ప్రాపుగన్. 136

షష్ఠ్యంతము లు.

కం. ఏవంవిధమత్కులకుల
దైవతభావానుభావదర్శయిత్రుత్వా
ద్యావిష్కృతావతార మ
హావిభవాకృతికి స్వీకృతాస్మత్కృతికిన్ 137

కం. మిత్రాన్వవాయమణికిఁ సు
మిత్రాపుత్రానుస్మృతిసమేధిత విశ్వా

1. వస్త్రములు.

మిత్రాధ్వరవిమతసురా
మిత్రాగ్రగసంసదనుసమీరణఫణికిన్ 138

కం. గ్రావార్యభిమర్శభవ
గ్రావార్య క్రోధగౌతమాగ్రహయుగ్యా
గ్రావాభితాహల్యా
గ్రావాకృతిముక్తికరచరణరేణునకున్. 139

కం. జపదధిపగాధినృపజ
న్యుపదిష్టవిదేహవల్లభోపానీతా
నుపమకపర్దిధనుర్హా
త్యుపగతసీతాస్వయంవరోద్వాహునకున్. 140

కం. సూక్ష్మేతరచక్రాదిక
లక్ష్మాకరకరపదాదిలలితాంగునకున్.
లక్ష్మణహనుమత్సీతా
పక్ష్మలచక్షుర్నితాంతపరిషంగునకున్. 141

కం. భాసురత భూసురవర
ధీసురుచిర కవనపద్ధతిస్తుత్యగుణ
శ్రీసక్త్యభిరామునకును
శ్రీసీతారామునకును శ్రీరామునకున్. 142

వ. సమర్పణంబుగ నాయొనర్పంబూనిన మహేంద్రవిజయంబునకుం
గథాక్రమం బెట్టు లనిన.

చ. కల దిల నైమిశం బన నొకానొక పావన మహా వనంబు స
ల్లలితఫలావనప్రముఖభూజద్రుమ పుష్పలతావనోచితా
మలతటినీవనంబు కలమంజులనాదలసత్పికీశుకీ
కులకలహంససంస దనుకూలసమంచితజీవనంబునై. 144

చ. కులపతి శౌనకాఖ్యమునికుంజరుఁ డందు జగద్ధితంబుగాఁ
దలఁగనిదీక్షతోఁ జలుపుద్వాదశవార్షికసత్త్రముం గనం
బలువురుమౌనిముఖ్యులు సమాగతులై నిజశిష్యకోటితో
నిలిచిరి పెక్కునాళ్లు చటనిర్మలకర్మలసత్ప్రసక్తిగాఁ. 145

సీ. తరుమూలవేదికోపరిభాగజపవిధా
నాస్తీర్యమాణకృష్ణాజినంబు
ద్రుమకోటరన్యస్తసుమసమిత్కుశ పరి
గ్రహణప్రసారితకరతలంబు
[1]మృగశృంగసంగతాత్మీయాక్షమాలికో
న్మోచనోన్మీలితలోచనంబు
[2]కుజ శాఖాశోష్యమాణవల్కలసమా
దానసమున్నమితప్రవేష్ట

తే. గీ. మగుచు నచ్చోట నెచ్చోటనరయ సరయు
సముప కల్పితసువిహితసవనహవన

---

1. లేడికొమ్ము. 2. వృక్షశాఖ.

నవనవద్రవ్యసంభృతిప్రవణశిష్య
సంకులము దోఁచు సంయమీశ్వరకులంబు.

ఉ. వారలు భక్తియుక్తులయి ప్రత్యహముం గృత నిత్యకృత్యులై
శౌరికథార్థము ల్వినుచుఁ జక్రిఁ దలంచుచు శార్ఙ్గిమంగళా
కారము నాత్మ నెంచుచును గాలముఁ బుచ్చుచు నుండ్రు సంసృతి
క్షీరధిఁ దాఁట శ్రీరమణసేవలె కేవల నౌకలౌటచేఁ. 147

గీ. నిరతశౌరికథాకర్ణనరతవర త
పోధనశ్రేణి గనియె సుబోధనప్ర
తీతుఁ డగు రోమహర్షణజాతు గుణస
మేతు నధిక ప్రభారుణ సూతు సూతు 148

గీ. కాంచి యాదరణాతిరే కాంచితముగ
విహగపతిశైలమహిమంబు వినఁదలంచి
పలికె నో వ్యాసశిష్య నీవలన వింటి
మమిత దివ్యస్థలీమహిమముల నందు. 149

చ. కలిగెను గాదె యాదట జగంబునఁ గల్గు నగంబు లెన్ని యో
వలమురిదాల్పు వేల్పు నిలువం బలువన్నెయు వాసియు న్విరా
జిలఁ జెలువొందు నందలి యశేషవిశేషము లాలకింపఁగా
నల గరుడాచలస్థల మహత్త్వకథ న్వినుకోరికెంతగాఁ. 150

సీ. గోత్ర విఖ్యాతమై స్తోత్రవాగ్విన్యాస
పాత్రమై పరమపవిత్రతాతి
మాత్రరీతి సరిత్కళత్రరోధఃక్రోశ
మాత్రదూరస్థమై యాత్రనీక
నేత్రపర్వంబుగా మిత్రశతాంగభృ
త్పత్రమార్గాంతర్ధి చిత్రశృంగ
[1]పత్రరథాన్వయ నేత్రాభిఖ్యాకస
ద్గోత్రసన్నిధిజనస్తోత్ర సౌఖ్య

తే. గీ. దాత్రళిసుగీతిపదశతపత్రమాన
సత్రపాకరబంధురగోత్రసరసి
[2]ధ్యాత్రఘముఁబాపనోపునోమిత్రపుణ్య
గాత్ర శ్రీబాదరాయణచ్ఛాత్రవర్య. 151

కం. ఉపమాకలనము గానమి
నుపమాకయనం బ్రసిద్ధినొందినయద్ది
వ్యపదంబున హరి యప్పర
మపదంబున నెట్టులటుల మసలునఁట కదే. 152

ఉ. ఆయుపమాకమంచు నిఖిలాశ్రితకోటి కభీష్టదాయకం
బై యరవిందమందిర యహర్నిశముం దరి నిల్వ నల్వయుం

1. పక్షిరాజుపేరు. 2. ధ్యానముచేయువారిపాపము.

గాయజవైరియుం గొలువఁగా నలవేంకటశైలభర్తనా
రాయణుఁ డప్రమేయుఁడు పరాత్పరుఁ డేల వసించె లీలతోన్.

కం. [1]నిగ్రహము ననుగ్రహము ను
దగ్రముగా నొదవ సదవనాప్తత నర్చా
విగ్రహము నిలిపి యచట స
మగ్రముగాఁ గలి నడంచెనఁట యటఁ గరుణన్. 154

కం. ఏలయచ్చోటను [2]గరు
డేలా భృన్మౌళి వొడమె నేలా తన్మూ
ర్ధాళిందమందుఁ గమలము
వాళివిమిళిందమన ముదితమతి హరి నిలచెన్. 155

కం. మానవలీలతో నస
మానవరాభోగభోగమతిఁ గలి నేఁచం
దానవరిపుఁ డం దేచం
దాన వసించెను వచింపఁదగు సుగుణనిధీ. 156

కం. బంధుర మనుకొలను జగ
ద్బంధురజనిరమణనయనుఁ బొటితభవదు
ర్బంధురమావిభు నంబుజ
బంధురమై తనుప నెటుల భాసిలె నచటన్. 157

1. కోపము. 2. గరుడాద్రి.

శా. ఆచార్యాగ్రణి యైన వ్యాసుని దరిన్ స్వాంతైక సంతుష్టిమై
నీచారిత్రము లెల్ల దెల్లముగ నీ వేరీతి నాలించితో
మాచిత్తంబులకు న్ముదంబు నిడవే మాధుర్యమాధుర్యహా
వాచాచాతురిచేత నాతతగతిన్ వాక్రుచ్చి యారీతిగాన్. 158

చ. అనవుడుఁ బల్కె [1]వల్కలులనారసి యార శిరఃఫరిస్ఫుర
ద్ఘనఘనజాలమై దృఢసుధాధవళాజిరచంద్రశాలమై
యనుతటధాతురాగపటలారుణితాఖిలసాలమై జనా
ర్దనుని వహించుతార్క్ష్యగతిఁ దన్నగ మెన్నఁగ మించు నం చొగిన్.

చ. వెరవునఁ బక్షిరాజు దనవెన్నున వెన్నునిఁ బూని విన్ననం
గరమును వింత యైన నడక ల్పచరించుచు మున్ను పోరులన్
హరికి హయంబు గింకరుఁడునై కొలువం గెలు పొంది తృప్తుఁడై
పరమకృపాప్తిచేత నొకపట్టున నానతి యిచ్చె నీగతిన్. 160

తే. గీ. ఓవిహగవర్య నీ సేయు నూడిగముల
కెంతయును సంతసించితి నేమి వరము
గావలయుఁ గోరికొను మన్న ఖగవరుండు
విన్నప మొనర్చె నీగతి వెన్నునకును. 161

సీ. దేవదేవర లసద్దివ్యమంగళవపు
స్స్పర్శనంబున ననుఁ బావనునిగఁ

1. బట్టలు.

జేయుతలంపుతో సేవకావళిలోనఁ
గారుణ్యపాత్రతగానిపింపఁ
సీ. [1]పల్యాణంబుపైఁ బదంబులఁ జాఁచి
యనువుగ మూఁపునం దధివసించి
మన్మూర్తి [2]తేజిభవన్మూర్తి [3]సాదిగా
వాహ్యాళులందరిప్రథన కేళు
తే. గీ. లందు విడువని పగిదినెల్లపుడు నాదు
పేఁపున వసించుటయె నా యభీష్ట మనిన
నీవు శైలాకృతివహింపు మేను మేను
సర్వ్యమొనరింతు నని మేనుఁ డానతిడిన. 162

కం. భగవల్లసదనుకంపన్
జగమెల్ల భజింపఁ దగిన సంపద చెలఁగన్
ఖగవల్లభుఁ [4]డగతల్లజ
ముగ నల్లసమూర్తి నిలిపె భువినబ్ధిదరిన్ 163

చ. అరయఁ గృతంబునందుఁ గనకాకృతి రాజిలు రాజతంబుగాఁ
బరఁగును ద్రేతయందు నలద్వాపరమందునఁ [5]దామ్రమూర్తి సుం
దరమగు రూప [6]మూపలముఁ దాల్చి కలిం జెలు వొందుచుండు నీ
గరుడధరాధరంబు త్రిజగన్నుతపావన భావభవ్యమై. 164

---

1. జీను. 2. గుఱ్ఱము. 3. సాహణి. 4. కొండలలో శ్రేష్ఠముగా.
5. రాగివలెనెఱ్ఱనిరూపము. 6. శిలారూపము.

సీ. ఆ వీటిచిఱుదాసరయ్యల నెయ్యంబు
గోరుచుందురు నిత్యసూరివర్యు
లా వీటిచటకాదు లైన పక్షులతోడ
వియ్యమందఁగఁ గోరువిహగభర్త
యా వీటికల్యాణయక్షపూరములదాస్య
వృత్తిఁ గొల్వఁగఁ గోరువిరజవారి
యా వీటిచిదుపలాలైన నాత్మాచార్య
బుద్ధి సాలగ్రామములు దలంచు

తే. గీ. మఱియు నా వీటిపొలము గుల్మములఁ దమకుఁ
గొలముసాములగా నెంచుఁ దులసివనము
లహహ యా వీటి నిత్య కల్యాణమహిమ
పరమపదమందు వలె నందు హరి వసింప. 165

ఉ. స్వామిరథోత్సవంబుఁ గనవచ్చిన దివ్యులు వేల్పుటేటి హెం
దామరపాకు పొట్లముల దాఁచిన కల్పతరూపదంశముల్
వేమఱు నంజికొంచచట వేళభుజింతురు [1]సౌరసౌరభే
యీమథితంబుతోడఁ దగఁ దృప్తి సుధామలశీతలాన్నముల్. 166

క. విధియైనను బహువర్షా
వధియైన నశక్తుఁ డనుచుఁ బలుకం బడ నే

1. కామధేనువుపాలమజ్జిగ.

విధి నేరుతు [1]శ్రేయస్సే
వధి నే నుపమాకమహిమ వర్ణించుటకున్. 167

క. ఐనను మద్గురుచరణ
ధ్యానముఁ గావించి మీఁదు దయ గలిగినచో
నా నేర్చుపగిదిఁ దెలిపెద
దీనియతి విన్దుండు మానితిలకములారా 168

సీ. మును ప్రపంచము సర్వమును సర్వకారణ
మును సర్వశక్తికమును బ్రధాన
మును నైన వ్యక్తియందున లీనమైన యా
ప్రకృతి విశ్వాత్మని భావమందు
డిందె నప్పుడు మహానందంబుతోఁ బరా
త్పరుఁడైనయట్టి శ్రీవాసుదేవుఁ
డొకఁడ యిందిరతోడ నుల్లసిల్లుచు నుండె
నమితయుగంబు లానంత దనుక

తే. గీ. నంతట జగత్సిసృక్షునిజాత్మఁ దగుల
నాహరి సృజించె హైమకటాహ మొకటి
యందు నేకార్ణవోదకమందు నెక
వర్ణములఁ దాను గ్రీడించె బాలులీల. 169

1. శుభములకు స్థానము.

## ఆశ్వాసాంతము.

కం. పారావారగభీరా
[1]భీరాహిత్యప్రచారవిజయాధారా
ధారాళకృపాసారా
సారామలవర్ణనీయ సద్వ్యాపారా. 170

శా. బ్రహ్మాదిస్తుతభవ్యదివ్యమహిమ ప్రాగ్భ్యాతపాదద్వయా
జిహ్మాణాకృతితాటకేయహననాక్షీణక్రియా సంతతా
బ్రహ్మణ్యోక్తిమహర్షి హర్షఘటనారంభప్రియా తారక
బ్రహ్మాకారనిజావతారశుభసంపర్కాంకితార్కాన్వయా. 171

మాలిని. అగణితగుణధుర్యాహార్యనీకాత్తకార్యా
జగదభినుతచర్యాజాగ్రదత్యుగ్రశౌర్యా
నగపరివృఢధైర్యా నామసంప్రీణితార్యా
సగరకులజవర్యా సమ్యగానందితార్యా. 172

## గద్యము.

ఇది శ్రీమద్రామనామపారాయణ పరాయణాభిధస్య కౌండిన్యగోత్ర పవిత్ర దేవులపల్లికులపయఃపయోనిధికళానిధిసీతారామశాస్త్రి పౌత్ర, వేంకట కృష్ణశాస్త్రి పుత్ర, తమ్మనాభిధానాంతర వేంకటకృష్ణ శాస్త్రి నామాగ్రజన్మ, త్రిలింగదేశాగ్రజన్మ సుధీ విధేయ సుబ్బరాయశాస్త్రి నామధేయప్రణీతం బైన మహేంద్రవిజయంబను ప్రబంధంబు నందు ప్రథమాశ్వాసము.

శ్రీ సీతారామార్పణమస్తు.

---

1. భయము లేనివాఁడు.

శ్రీరస్తు.

# శ్రీ మహేంద్రవిజయము



## ద్వితీయాశ్వాసము.

శ్రీపద్మబాంధవాన్వయ
దీపక గోపకజముఖ్యదివిషత్ప్రగిస
త్ప్రాపక భూపకలాపక
లాపక ధృతచాపశరకలాపక రామా. 1

గీ. అవధరింపుము శౌనకాద్యఖిలమౌని
జనులఁ దిలకించి రోమహర్షణసుతుండు
స్పష్టవాక్పుష్టి [1]నుక్తావశిష్టకథను
వక్ష్యమాణవిధంబుగఁ బలుకఁ దొడఁగె. 2

క. అటులుండఁగ దన్నాభీ
పుటమందు ఘటిల్లినట్టి [2]పొందామరఁ ద
త్పటుసంకల్పముననె యొ
క్కట నలుమోములనిసుంగుగలిగి యొసంగెన్. 3

---

1. మిగిలిన కథ. 2. బంగారు తామర.

క. ఎవ్వానివలనఁ బొడమితి
నెవ్వఁడ నే నాకుఁ జేయ నెద్ది యగు నటం
చవ్విధి వికలత మొఱలిడ
నవ్వేళను గగనవాణి యడలకు మనియెన్. 4

ఉ. శ్రీహరి యిట్లమూర్తిగ విరించి గురించి వచించె నప్పుడీ
మోహ మదేల నీకభయమ్మున్ శుభముం బ్రభవింపఁ గూర్తు నీ
దేహము నే సృజించితిఁ గదే జగదేకసిసృక్షువృత్తి ను
త్సాహము మీఱ నౌర [1]తనుజా విను జాగ్రదనుగ్రహంబునన్.

ఉ. నా విని యావినిద్రనలి నప్రభువుండు చతుర్ముఖుండు దే
వా! విను నాదు వాంఛను బ్రపన్నతఁ దెల్పెద సుప్రసన్నతం
దావకభావుకాకృతిఁ గనం గరుణించి కృతార్థుఁ జేయవే
కేవలపావనుండ నయికీర్తిఁ బ్రవర్తిలుచుందుఁ బొందుగాన్. 6

క. అన విని వనజోదరుఁ డ
య్యనఘుని బ్రమోల న్నటించె నాశ్చర్యము కాఁ
గను [2]సారంగము భంగినిఁ
గనుఁగొననై మహిమ పేర్మి క్షణమాత్రములోన్. 7

గీ. తనదు ఝూంకృతినోంకృతి స్వనము దెలుప
నదియ ప్రణవోపదేశ మానంచు నెంచి

1. కొమారుఁడు. 2. లేడి.

కొం చలవిరించనుండు వీక్షించుచుండ
నంత నంతర్హితుం డయ్యె నవ్విభుండు. 8

సీ. వేధ యప్పుడు తాను వేదంబులు భజించెఁ
దన్మూలకంబులై తనరునట్టి
వేదాంగములును సేవించె నంతట నతఁ
డిఁక నా కొనర్చెడు కృత్య మెద్ది
యొకో యంచుఁ జింతించుచుండఁగాఁ బొడసూపి
పుత్రకా నీ వెల్ల భువనములను
నిర్మింపు దిట మూని నే నెప్డు నీకుఁ దో
డౌదు న టంచు శ్రీహరి వచింపఁ

తే. గీ. బూర్వరీతిఁ జతుర్దశ భువనములను
గడఁగి సృజియించి సత్యలోకమున వీత
కలుషముని సేవ్యమానాంఘ్రికమలుఁ డగుచు
మించు వేడుకతోడ వసించియుండె. 9

క. తామరససూతి యొకతఱి
సోమరితన మూని యుండఁ జోరత నిగమ
స్తోమముఁ [1]దదంగములతో
సోమకనామకుఁడు రాక్షసుఁడు వడిఁగొనియెన్ 10

గీ. విధిని గికురించి యవ్విధివిధినిషేధ
బోధకం బగు నామ్నాయయూథకంబు

---

1. వేదాంగములు.

నధికధృతిఁ గొని మఱియు నవ్యథితుఁడై యు
దధిని మీనాకృతి నహించి యధివసించె. 11

క. తా మఱచి నిద్రవోల్పడీ
తా మఱచిన వినమి శ్రుతులు తలఁగి చనుటకై
తామరచూలి ముకుందు [1]న
తామరచూలీసమర్చితాంఘ్రిఁ దలఁచినన్. 12

గీ. ఇంచు కెంచక క్రించున క్తంచయందు
వంచన నకించనునిగా విరించనునిఁ ద
లంచి శ్రుతులు హరించి భూకాంచి నుంటఁ
గాంచి కాంచనపటుఁడు యోజించి యపుడు. 13

సీ. తపనీయవసనకాంతిపరంపరలు రమా
స్తన [2]హారిద్రాముద్రలను వచింప
మహనీయకౌస్తుభమణిఘృణిశ్రేణులు
లక్ష్మీప్రదాల క్తలక్ష్మ నుడువఁ
గమనీయవనమాలికా ప్రభాపూరము
ల్కమలాకటాక్షలీలలను బలుక
రమణీయలాంఛనోరశ్ఛవిచ్ఛట లింది
రా [3]కజ్జలాంకవిభ్రమముఁ దెలుప

1. నమస్కరించుచున్న దేవతాసమూహము. 2. పసుపు చిహ్నాలు.
3. కాటుక చిహ్నాలు.

తే. గీ. శంఖచక్రగదాఖడ్గశార్ఙ్గధరుఁడు
సజలజలదప్రభుఁడు జతుర్భుజుఁడు భుజగ
శయనుఁ డంబుజమిత్రేందునయనుఁ డండ
జాధిపాశ్వుండు శౌరి ప్రత్యక్షమయ్యె. 14

క. కాంచనపటు నిటు లెదుటం
గాంచి నమస్కృతు లొనర్చి కడునంచితరో
మాంచము మించ విరించి ప్ర
పంచితగతిఁ జంచదర్థఫణితి నుతించెన్. 15

క. దేవా తావకపదయుగ
సేవాహేవాకలబ్ధచిదచిద్విజ్ఞా
నావాసవాసితాత్ములు
[1]భావాతిగమూర్తి నిన్ను భావింతు రొగిన్. 16

శా. నీమాయాపరిమోహితాత్ములు నిను న్నిక్కంబు భావింపఁగా
సామర్థ్యం బొకయింతయుం గనక దుస్సంసారనిర్మగ్నులై
కామక్రోధముఖారివర్గజితులై కష్టైకతానస్థితిన్
సీమాతీతవిషాద మేదురగతిం జింతింతు రో యీశ్వరా. 17

గీ. నేనె నీతత్త్వ మెఱుఁగంగ లేననంగ
నితర సురు లెంతవారు మత్సృష్టమూర్తు

1. భావముల కతీతుఁడైనవాఁడు.

లార్తరక్షావిధానదీక్షాంతరంగ
కరధృతరథాంగ సద్విహంగమతురంగ. 18

గీ. ఆద్యుఁ డవ్యయుఁ డచ్యుతుఁ డక్షరుండు
నప్రతీకాశుఁ డనఘుఁడు నప్రమేయుఁ
డఖిలమయుఁడు ననంతుఁ డనామయుండు
ననుచు నామ్నాయములు నిన్ను నభినుతించు. 19

క. సర్గస్థితిలయహేతుని
సర్గగుణత్రయవికారసంజ్ఞాకారో
త్సర్గామలదివ్యజ్యో
తి ర్గురుమూర్తి వని నిన్నుఁ దెలుపు నిగమముల్. 20

క. కర్మజ్ఞానఫలాత్మక
ధర్మస్వర్గాపవర్గదాయక మగు నీ
నిర్మల నామస్మరణము
నర్మిలి మా కొసఁగి ప్రోవుమయ్యా మహాత్మా. 21

గీ. దిక్కు లెందాఁక నీ వ్యాప్తిఁ దెలియ లేవు
కాల మెంతకు నీ తుదిఁ గాంచ లేదు
కాన [1]దిక్కాలనిర్విశేషానవద్య
హృద్యతేజోమయాత్ముఁడ వీవ దేవ.

1 దిక్కాలములను మించిన తేజస్సుగలవాఁడు.

గీ. పొందలేనికతంబున నెందునుండి
మనసుతోఁ గూడి వాక్కులు మరలుచుండు
నట్టి వస్తువు నీ వంచు నాశ్రయింతు
నమిత కారుణ్యరసభావయాదిదేవ. 23

గీ. మశకహృన్మధ్యవర్తివై మఱి యనంత
భువనముల బొజ్జ నొకపజ్జఁ బూనుట నణు
వణువుకంటె మహత్తు మహత్తుకంటె
ననుచుఁ [1]ఆమ్నాయముదలు ని న్నభినుతించు. 24

క. సామీప్యంబున నీమెయి
సామీచీన్యం బెలర్పసామీ! యస్తో
కామితపరిపాటిగ నా
కామితము లొసంగఁ గానఁగా నైతివిగా. 25

క. అని వినుతించిన వనజా
సనుఁగనుఁగొని యప్పయోధిశయనుఁడు తనయా
ననుఁ దలఁచిన పని యేమొకో
వినిపింపు మనంగ హరికి విధి యిట్లనియెన్. 26

క. శ్రీవర! నీవరదయ నా
పై వఱలు టెఱుంగ కెవఁడొ ప్రామిన్కు లొగిం

1. వేదములు.

గానరమునఁ గొని చనుటం
గాన రహి న్నిన్నుఁ దలఁపగా వలసె హరీ. 27

మ. అనఘుం డా ఘనపుండరీక నయనుం డప్పద్మజుం గాంచి మిం
చిన కారుణ్యమున న్మనస్థ మగు [1]గస్తిం బాపఁగా నోపు లా
లనవాక్యంబులఁ దేల్చి పల్కె నిఁక వైక్లబ్యంబు నీ కేల ప్రా
మినుకుల్ ప్రుచ్చిలినట్టి యచ్చెనఁటి బల్మిం బట్టి నేఁ దెచ్చెదన్. 2

క. అద్దిర యెంత ప్రమాదపు
సుద్ది రహస్యముగ నొక్క [2]సోమకుఁడు వడిగా
ని ద్దురవస్థితిఁ దెచ్చెను
నిద్దుర నీ వొందలు మఱవ నిగమంబులకున్. 29

ఉ. ఉపదేశం బొనఁగూడకున్నఁ జదు వెందోఁ గాని శోభింప దే
వ్యపదేశంబున నైన విస్మృతికిఁ బ్రాపౌఁ గాన వేయేల ని
ష్కపటప్రక్రియ నొజ్జపజ్జ దృఢశిక్ష న్నేర్చి తా శిష్యునిం
గృపచే నేర్పి కృతార్థుఁ జేసినఁ గదా పృథ్విం బ్రసిద్ధిం గనున్. 30

సీ. విద్య లోకాచారవిజ్ఞానమును గూర్చు
విద్య యెల్లెడ గౌరవింపఁ జేయు
విద్య యమాత్మ్యన్యసీవృద్బంధువై పేర్చు
విద్య రూపవిశేషహృద్యఁ జేయు

1. కష్టము. 2. రాక్షసుఁడు.

విద్య లోకాలోక విఖ్యాతిని ఘటించు
విద్యయుక్తాయుక్తవిదుని జేయు
విద్య యానంద మావిర్భవింపఁగఁ జేయు
విద్య ప్రజావశ్యవిధ మొనర్చు.

తే. గీ. విద్య యెన్నని మేళ్లు గావించుఁ గాన
విద్య నరులకు ముఖ్యసంపాద్య మైన
ధనము దానికి ముఖ్యసాధనము నాదు
మంత్ర మొక్కటియే సుమీ మాన్యచరిత. 31

కం. విద్యోపదేశ గురుఁ డన
వద్యమతిసుబోధకత్వపద్ధతి వైశా
రద్యుఁడు జాతివయోమహి
మాద్యున్నతివందనీయుఁడై యొనర వలెన్. 32

చం. వినయవిధేయవర్తనుఁ డవిస్మృతిశాలి యసంశయాశయుం
డనితరసక్తమానసుఁ డపార్థవిదూరుఁ డధీతపాఠచిం
తనపరుఁడున్ సుఖగ్రహణధారణగణ్యుఁడు సూక్ష్మబుద్ధి సు
స్వనుఁడు గురుప్రియుండు నగు వానినె శిష్యునిఁగాఁ గొనం దగున్.

గీ. ఏను [1]స్వర్భానుభానుజ భానుభూమి
సూనులను సితభానుకృశానుబాణ
సానుమత్స్థానముల నుండఁగా నరసితిఁ
గాన నిష్టార్థపునరాప్తిఁ గలుగు నీకు. 34

1. రాహువు.

కం. సోమకుఁ డనియెడు సోఁకుం
డామున నిన్నుఁ గికురించి సాంగముగ శ్రుతి
స్తోమంబును ముచ్చిలి నీ
ర్వామిం జొఁఱ మేను పూని వసియించె నజా. 35

కం. కావునఁ బునరానయనం
బేవడువున నగు నటంచు నెన్నెద వెమో
యోవిధి విను విధివిహితం
బావిధిఁ దపమాచరించునపుడు లభించున్. 36

కం. ఆదిత్యపత్యముం గృత
వేదాపహృతి న్వధింతు విశ్రుతముగ నో
యాదిత్యపత్యభిష్టుత
వేదాఁపక దెల్పితిం దపింపకుము సుతా. 37

కం. తపనీయగర్భ! నిర్భర
తప మియ్యెడ నాచరింపుదానఁ దలంపుల్
విపులముగ నొదవు గానన్
విపులఁదపంబే సుమీ యభీష్టద మరయన్. 38

కం. తప మఘదుర్ధమకర్దమ
తప మవిరళతత మతమః ప్రతారణచండా
తప మని మహర్షులు పరం
తప మన్నించెదరు దానిఁ దరమె నుతింపన్. 39

గీ. దుస్తరంబు దురాపంబు దుర్గమంబు
దుష్కరంబునుసాధ్యమౌఁబుష్కలముగఁ
బుష్కరోద్భవతపముచే భువిఁ దపంబు
మాత్రమొకటియ దురతిక్రమంబు సుమ్మి 40

ఉ. ఇందిర నేనుఁ గూడి వసియింతుము తాపసమానసంబు లం
దిం దిర నంచు నిక్కముగ నెంచుచుఁ దామరసంబులందు [1]నిం
దిందిరయుగ్మకం బన నిందిత మా శిఖతోడ వహ్ని వే
దిం దిరమైనరీతిగ నతిప్రమదంబు మదిం గదించుచున్. 41

క. విను మస్మత్ప్రియము దపం
బనఘ తపోధనులు మత్ప్రియాత్మకు లటుకా
వున ననుఁ దలంచుచును దప
మొనరింపుము నిర్జితేంద్రియుఁడ వగుచు నజా. 42

క. రంగగు జలనిధి కోకప్ర
క్రం గన గరుడాద్రి యద్రిగతిరోధిలతా
లింగితమహీజసంగత
శృంగారోత్తుంగశృంగశృంగాటకమై. 43

గీ. అది మదిష్టపదంబు సౌఖ్యాస్పదంబు
పరమదివ్యతపః ఫలప్రదము దాని

1. తుమ్మెదలజంట.

కెలన బంధుర మన నొప్పు కొలను కొలను
మించు కొలను దొలంగ శాసించు మహిమ 44

గీ. తత్తటాకతటాకల్పతరులఁ దరులఁ
దద్ధరిత్రీధరేంద్రంబుదరుల నరులఁ
జెందు నాకల్పకృతతపస్సిద్ధిఫలము
స్వల్పకాలానకృన్మంత్రజల్పనమున. 45

శా. ఆ కాసారతటంబునం దయినఁ [1]దార్క్ష్యాహార్యమం దైన న
న్నేకాగ్రాత్మత నెవ్వఁ డేనియుఁ దపోవృత్తిం బ్రసేవించు వాఁ
డో కంజాతభవా! స్వవాంఛితఫలప్రోద్యన్మహాలాభల
క్ష్మీకల్యాణమహోత్సవంబు గను సుమ్మీ నెమ్మి వేగమ్మునన్

మ. మహిమోత్కృష్టతచే నొకా నొక మహామంత్రంబు రాజిల్లునో
ద్రుహిణా! నీ కుపదేశ మిప్పు డొనరింతున్ దాని నిష్ఠన్ముహు
ర్ముహురావర్తన మొప్పఁ జొప్పడుఁ దపోరూఢిన్ జపింప న్శుభా
వహమ్మై భావహమ్మై యభీప్సితలప్రాప్తిన్ ఘటించుం జుమీ. 47

గీ. దాని ఋషియును ఛందంబు దైవతంబు
బీజశక్తికీలకముల విశద మగుచు
వెలయు నంగకరన్యాసములును గవచ
జాలలును దెల్పి మఱియు నమ్మాధవుండు. 48

1. గరుడాది.

గీ. కంజసంజాత! షోడశాక్షరి యనంగఁ
దనరుఁ దన్మంత్రమున కధిదైవతంబు
జ్ఞాననిర్మలతరవిభానందమయము
సేవకాభీష్టదము హయగ్రీవమూర్తి. 49

క. కానఁ దపం బొనరింపం
గా నరుగుము గరుడగిరిశిఖం దగుసాలపో
కానకు నని సామాగమ
గానకుతూహలివచింపఁగా నజుఁ డెలమిన్ 50

చ. అరిగి సరోరుహప్రభవుఁ డంతఁ గనుంగొని యెం బయోధికిన్
సరసను గూటకోటికులఝాటలసత్కిసలారుణప్రభా
నిరతవిజృంభణాత్త తపనీయమయ ప్రథిమామరాపగాం
తరచరదచ్ఛపక్షిశకునచ్ఛదజాలముఁ దార్క్ష్యశైలమున్ 51

గీ. కాంచి [1]కాంచనగర్భుఁ డాగ్రావసీమ
నేమము దలిర్పఁ దపమందు నెఱపఁ దగి
నెలవు నెమకుచు నందంద నిలిచి నిలిచి
యరసె నా పాదశిఖరాంచలాద్భుతములు 52

గీ. ఆత్మసృష్టికి నది లోనిదయ్యు విధికి
వింత యొనరించె నొక్కొక్కవేళ నొదవు

1. బ్రహ్మ.

కవనలిపిశిల్పగానపాకములు గర్త
లెఱుఁగని తెఱుంగుమెఱుఁగుల నెసఁగుఁ గాదె. 53

క. కబరీజితవాలములై
శబరీజాలములఁ వెంటఁ జమరీగణముల్
నిబిరీసత నందు నవి
కబరీతిఁ జరించు జితుల గతు లటు కదే. 54

సీ. లీలాశయాన శార్దూలప్రదేశంబు
రత్నకంబళసంస్తరణతలంబు
దీర్ఘాహిఫణమణీదీప్తప్రదేశంబు
కర్పూరదీపికాంగణతలంబు
వనవారణకరాగ్రవమథుప్రదేశంబు
ధారాంబుయంత్ర శీతలతలంబు
హరికర్ణోద్యుక్తశరభప్రదేశంబు
చంచదష్టాంఘ్రిమంచకతలంబు
తే. గీ. కపికరాఘాతచలసరఘాప్రదేశ
మతివిచిత్రవితానసంవృతతలంబు
గాఁగఁదోఁచుట నగ్గిరిభాగసీమ
కమలసంభవునకు భీమకాంతమయ్యె. 55

క. సింగము లచ్చన లాడఁగ
డంగిన చెంచెతల కచ్చటం గాయలఁ గూ

ర్చుం గరిశిరములము త్తైము
లింగితము లెఱింగి కొలుచు గృహసేవకులై 56

సీ. సెలయేటియిసుకతిన్నెల గూఢమణికేళి
కల నిలింపాంగనల్గలసి యాడ
దీర్ఘికాబ్జముల నధిత్యకహంసమం
డలములు జతకూడి వెలయఁ జేయ
వృక్షశాఖల డాసి ఋక్షాళి దేజస్తి
మిరమేళ నాశ్చర్యగరిమఁ జూపఁ
గటక కూటములందుఁ గదిసి గంధర్వసం
ఘాతంబు సంగీత కలనఁ బెరయ

తే. గీ. నాకభూలోకములకు సంతతముగాఁగ
రాకపోకలు నెరపఁ బరస్పరంబు
దివిజమనుజులు కోర్కిసంధించుకొనిన
దండినిశ్రేణి యనఁగ నక్కొండ దనరు. 57

సీ. ఘనసారకదళికాకాండ మొక్కొకచోట
మఱియొక్కచోట [1]జాంబవచయంబు
సముదగ్ర[2]లాంగలీషండ మొక్కొకచోట
వేరొక్కచోట జంబీరతరులు

1. నేరేడు చెట్లు. 2. నారికేళములు.

ఫలసస్రముశాఖాస్రమవణము లొక్కొక చోట
నొండొక్కచో దాడి మోత్కరంబు
ఫలపూరకుజపూరవాట మొక్కొకచోట
నింక నొకచోట కంటకఫలద్రుమ

తే. గీ. లనురసుమరసకుల్యాతటాగ్రసీమ
పూగపూగానువేల్లిత నాగవల్లి
గణము లొక్కొకచోట నొకానొకయెడ
సందు మందారకుందకుంజాళిఁ గనుచు. 58

వ. మఱియు నగ్గిరివరం బురుతరసురుచిరసురవరశరాసనానుకారిభూరి
కీరశారికామయూరకాంతిసంతానంబుల నత్యంత కాంతలంబులై,
సంతతదంతురంబు లగు సంతమసంబుల నితాంతంబు నసూర్యం
పశ్యోదరంబు లగుటం దరంబు గదురఁ గృతమాలనక్తమాలత
మాలసాలరసాలాదిసాలజాలంబు లగువనషండంబులను ఘనమండ
లంబులకు శంపాలతలసంపదలసొంపు సంపాదించుచు నుద్ద్యోత
మానంబు లగు జ్యోతిరింగణజ్యోతిర్గణంబుల విస్ఫురణంబులు
దుఱంగలింప నిరంతరాసారధారాధారంబులగు మరందరస
పూరంబు లీరంబుల చేరువులం గాలువలై ప్రావృషేణ్య సమయ
సముజ్జృంభణంబు దలఁపించు తావులుం, దావులకుం దానలంబు
లగుచుఁ గుస్తరించి యందందఁ బ్రస్తరించికస్తూరికామృగస్తో

మంబులు [1]దీమంబులం దగిలి దిగులువడి చూచుచూపులకుం జాలివడి విడిపింపం జాలి వడిఁ బరతెంచి యెడలించు సిద్ధముని శుద్ధాంతసంఘాతంబులును, ఘాతంబులఁ దొఱఁగు సెలయేటి తీరంబులఁ దోరంబు లగు కరీరాంకూరంబుల మోరలం దెమలించి నమలఁ గమకించి కించిదాకుంచితపూర్వాంగంబు లగు గోలంబులఁ గోలలం గేలిమెయిం దోలి తూలించు గోలల నాలోకించు చెంచునాయకుల దేహచ్ఛాయలకు దాయాదంబులై దండల దండిగ మెండుగఁ దిరుగునన వేదండంబులతండంబు గండమండలంబుల నుండి పింపు గట్టి యెగయు గండు తేఁటులకూఁటువులతోఁ డికూటమిం బాటించులోవ త్రోవల క్రేవలఁ గేవలంబు సోవలంబంబులగు లతావితానంబులు వనదేవతాబాలికాపాలికాకేలికాందోలికల పోలికలఁ గ్రాలి కనుపట్టు విడిమట్టుల మట్టు మీఱియుట్టలంబులగు చిట్టకంబుల దట్టంబుగ రొట్ట బలిసిన తులసిచెట్టులు కట్టువలై చుట్టువలగాని చెలఁగ దిట్టంపు టాకట్టులం బడి జర్జలంబులగు బిందుబృందబులై యెగసి ముత్తెంబులమొత్తంబులపగిది నొగి దివ్యవృక్షవీక్షాసేచనంబులై వృక్షాసేచనంబు సేయ సనమకుసుమ సముదయకుశవిసరసమిత్సమిద్ధంబులును బ్రవృద్ధంబులునై బ్రచ్ఛాయతరుచ్ఛటాచ్ఛాదనశీతలచత్వరభూతలంబులై సవిధంబుల వివిధంబు లగు మల్లికావల్లికామతల్లికల నల్లికొన నుల్లసిల్లుచు

1. వేటకానిచే, పక్షులనుమృగములను పట్టుకొనుటకు పెంపబడిన పక్షి లేక మృగము.

నుల్లంబులకు నుల్లాసంబు పల్లవింప సింపు నింపు మంజులకుంజ పుంజంబుల రంజిల్లుచుం బరివేష్టితకుటజంబు లగు నుటజంబులం బొలిచి పావనంబు లగుతపోవనంబులం బరిస్ఫురించుచుండు. 59

శా. అందందం బరికించి యందొక వివిక్తావాస యోగ్యాశ్రమా
లిందంబం దరవిందనందనుఁడు హాళిన్నిర్మలాస్పందమై
డెందం బొప్పఁ దపంబొనర్చ్చకొనఁ బాటించుం గదా యంచు నా
నందం బొందుచు రూఢనిశ్చయమతిం దత్ప్రాంత సీమంబునన్.

చం. తనజనయిత్రియిమ్మ్మ దన తమ్మునియైదవ యైనయమ్మలుం
దన వగువారినమ్మలు సతమ్ము హితమ్ముగ వర్ధితమ్ములై
తనరఁగ నాత్మబంధురచిత్రప్రియమై ఖరిఁ బేర్చుబంధురం
బనుకొలఁకు న్విరించి గనె సత్పపరిశ్రమ మారఁ జేరువన్. 61

శా. సారం గార్భకము ల్విహారమతినుత్సంగంబులం జేరి యిం
పారం గ్రుమ్మరఁ బుండరీకనిచయం బచ్చాంతరంగాప్తిని
స్స్వైరప్రక్రియ నొప్ప సిద్ధమునిసేవ్యం బై నపుణ్యాశ్రమా
గారంబో యన సౌమ్యమై తనరు నక్కాసార మత్యంతముక్. 62

సీ. బంధుర కాసార బంధురోదకములం
దు నిరూఢనియతి మజ్జన మొనర్చి
సర్వతోముఖముల సర్వతోముఖముల
నాచమనంబుల నాచరించి

విహితకృత్యములఁ బావి హితకృత్యాసక్తి
గావించికొని లేచి కదలి వచ్చి
యతివివిక్తం బైన యలవివిక్తప్రదే
శము సొచ్చి యచ్చట శమదమంబు
తే. గీ. లమర సమధికనిష్ఠమై నధివసించి
భగవదుపదిష్టపద్ధతిఁ దగ జపింప
గాఁ గడంగెను సైంధవ కంధరాధి
దైవతకమైన దివ్యమంత్రము నజుండు. 63

క. అతనికి నొకపరి జపమునఁ
జతుర్గుణంబుగ ఫలంబు సమకుఱె సత్య
స్థితునకుఁ బెక్కు ముఖంబుల
జతనం బను గాదె యర్థ సంసిద్ధి యిలన్ 64

సీ. అతఁ డప్పుడు కమలజ ఖ్యాతుఁడగుట
ముదము గదుర మహాతపం బునవసించి
సారసత్వంబు బూనుట చనునుగానిఁ
యాత్మరాజసవృత్తిఁ బోనాడుటరిది. 65

—★ గ్రీష్మర్తు వర్ణనము

క. అట్టియెడ నెట్టికాలము
బెట్టిదముగఁ దోఁచె మన్ను బిట్టగసి చదల్

ముట్టగ నడి సుడిగాడ్పులు
నెట్టిన నెట్టుకొని ఠీవ నిఖిలావనిపై. 66

క. పాటలకుసుమపరీమళ
పాటచ్చరవృత్తి బయలుపడకుండఁ బవల్
మాటుగ నిశాంతముల నొక
పాటిగఁ జరియించు నపుడు పవమానంబుల్. 67

గీ. ఇనునిసత్కృపదినలక్ష్మి హెచ్చుటరసి
నిశలునానాఁటభృశకృశదశలఁ గాంచె
నొరులసిరులకుఁ జూపోపకున్నఁ దనదు
పెంపుదఱుఁగుటగా కన్యవృద్ధి సైచునె. 68

గీ. ఇచ్చు[1]ఘను లుండి రని [2]యప్పు లిచ్చవడసి
పొంగి పొరలిన [3]సరసుల పొలుపు దఱిగె
మున్నుగల కీర్తిసారముల్ పోవనప్పు
[2]డప్పులను జొప్పడినయొప్పు ముప్పు గాదె. 69

ఉ. గాలికిఁ గాలు నిల్పుకొనఁగాఁ దగు నూఱటపండు వాభుజం
గాలికి నక్తభోజనమహావ్రతపర్వదినంబు తాళవృం
తాళికి వన్నెవాసియు బయల్పడు యోగదశాగమంబునై
తాలిమి దూల నాఁ డొకవితాన జనం బెడపెక్కె దినంబులన్. 70

1. గొప్పవారు; మేఘములు; 2. ఋణము; నీళ్లు. 3. సరస్సులు; సరసత్వముగలవారు.

సీ. పూటకొక్కొక్కనూఁతినీటి దప్పి యడంచు
కొనెదవ్వుచని తెచ్చికొని జనంబు
వెలఁబెంచి పానీయవిక్రేత లింటిబా
వుల క్షారనీరముల్ గలపి దెచ్చి
రనుదినంబు మడుంగులను దెచ్చియిడుచాకి
నాలుగైదారేడునాళ్ల కొసఁగఁ
గ్రుంకులాడఁ గొలంకులింకఁ బాఱుట శ్రోత్రి
యులకు వేళలఁ దాన మొదవకుండఁ

తే. గీ. గరటచటకాదికంబైన గ్రామ్యపక్షి
జాల మిలు సొచ్చి బెదరక జనులసదుము
కుంభసంభృతజలములఁ గ్రోలఁ జొచ్చె
బుడమి నొదవిన [1]నీటియెద్దడికి నపుడు. 71

సీ. తొలుత వ్రాల్చినప్రక్కనులివచ్చెఁదనమెక్క
నొండొక్కప్రక్కకునొత్తిగిలుచు
వ్యజన సమాకర్షకజనంబు సెయిమార్చు
కొనినంత హుంకృతిఁగినుక వడచు
వారియంత్రపుసూక్ష్మధార లిట్టటుగాలిఁ
దెరలిన నఱచూడ్కిఁ దెఱచి కనుచు

1. నీరులేని కష్టము.

నిదురఁదోఁగె నటించు పదము లొత్తు భుజిష్యు
లారవిందిన సంఘ్రిలాఁపు కొనుచు

తే. గీ. వలపుఁ బన్నిద చిలికెనచలునవలున
సెజ్జ లాముజ్జకప్రతిసీర లెసఁగు
నిసుదగుమూర్ఛలచుట్టు పందిళ్లయిండ్లఁ
బవలు పొరలాడు సామంతనివహమపుడు. 72

ఉ. గొజ్జఁగినీటి చిన్ని చినుకుల్వలిపంబులు గంధసారమున్
మజ్జిగతేట మల్లెకుసుమంబులు వెన్నెలబట్టబైటిపూ
సెజ్జలు వీణపాటలును శీరవుపేనసలుక్ ఘటించు భూ
భృజ్జనకోటికెన్ని దురసించుక వేసవికేల వేసవక్. 73

సీ. ప్రపహింబహిః కుట్టిమాభ్యర్ణగాంభఃపూర్ణ
కలశాంబువులు గతిక్లమముఁ బాప
సవనారి క్షేళపర్ణకలింజకసితుల్
మార్గాతపోత్థశ్రమంబు నుడుప
జంబీరరసపూరసమ్మిశ్ర మగుతక్ర
సారంబు దృషను జల్లారఁ జేయ
నాఁడుతకాయమానాంతరసితతాళ
వృంతముల్ ఘర్మాంబువితతి నడఁప

తే. గీ. నిమరగదురంగ నపుడధ్వసీనజనము
నిషియు నొకొకక్క పుణ్యాత్ముఁ డిడినయట్టి

ప్రపనపారసుఖాప్తిమై బనుల మఱచి
పట్టపవలింటి నడసోఁకుదట్టకుండ.

సీ. వాతూలతూలతల్పముపొల్పు సవరించి
శౌరిఁ జొక్కించు దాసేరకుండు
ఘనఘటావళినీటఁ గర్షకుల్ దనియంగఁ
గలమాంకురము వెంచు పొలము కాఁపు
హరిపదంబునఁ గాఁపు దిరుగుకల్యాలదాయ
వంతుమార్చెడు దళవాయి పెద్ద
కడలియింటికి ఘనీకన్యలఁ గై సేసి
తొలిసారి యంపించుఁ గులగురుండు

తే. గీ. దోఁచె గ్రీష్మావసానముత్తుంగసౌధ
జాలబహిరంగణాప్రదోషప్రభాత
విచరదూష్మార్తదంపతీవిస్మృతాతి
దృఢపరీరంభపునరుపదేష్ట యగుచు. 75

గీ. బైటి తల్పములనులోన బైట లోని
తల్పముల వైచికొనుచు రాత్రుల జనంబు
పొక్కఁ జినుకులచే నప్పుడొక్కయింత
యైన నిదురింప నెడలేకయలఁతఁ జెందె.

క. ఘనులు కరకాంబువుల భూ
జనులం దనియించు సిరి లసచ్చిత్రరుచిం.

దనరెడు దవశిఖుల నెఱిం
గనుఁగొన గ్రీష్మంబు వర్షకాలముఁ బోలెన్. 77

గీ. కదిసి [1]కలకంఠములకు మూకవ్రతంబు
నెఱప నుపదేశ మొనరించి నీలకంఠ
తతికి సోత్కంఠముగ ద[2]దుద్యాపనంబుఁ
గడప గ్రీష్మర్తు వాచార్యకంబొనర్చె. 78

క. పంచజనపంచవక్త్రుఁ బ్ర
పంచగురు న్మదిహయాస్యు భావించి సదా
పంచాగ్నిమధ్యమున న
[3]ప్పంచాస్త్రజ్యేష్ఠుఁ డురుతపం బొనరించెన్. 79

క. వర్షర్తు వొదవె సంతతఁ
గర్షకహర్షకరవర్షకలితపయోదో
త్కర్షాభిశంసితాపా
కర్షి ఝరీస్రవణసన్నికర్షం బగుచున్. 80

. మండూకములు చర్మమాత్రశేషత వీడి
చెలఁగి మెలంగ సంజీవకరణి
బర్హిణంబులు వరస్వరభాస్వరముగ ఘో
షింప సారస్వతసిద్ధరసము

1. కోయిలలకు. 2. వ్రతసమాప్తి. 3. బ్రహ్మ.

బిసకంఠికలు చూలువెసఁ దాల్చి యెసఁగ స
ప్త పయోధిసంగయాత్రాఫలంబు
చాతకంబులు బిపాసను బాసివాసి భా
సిలఁ బ్రపారంభమంగళముహూర్త

తే. గీ. మగుచుఁ బొగడొందె నపుడులోకైకతాప
హరణకరణాభ్రనిత్యసంచరణసాంద్ర
తరుణతరుణాభ్రవిభ్రమస్ఫురణకరణ
మైన [1]ప్రావృడనేహస్సమాగమంబు. 81

గీ. స్వాతిమౌక్తికములఁ గాంచి స్వాతిశయముఁ
బూనె నని యార్ద్రి జగమార్ద్రముగఁ దలిర్పఁ
బద్మరాగంబులను గాంచిపరఁగె ననఁగ
నింద్రగోపంబు లెల్లెడ నెసఁగె నపుడు. 82

క. అకలంకద్యుతికలహం
సకులము స్వకుల మగు మానసమునకుఁ జనుపూ
నిక పోలుపుఁ దెలుపు ప్రాస్థా
నిక శుభదానకములై స్తనితములు మొరసెన్. 83

ఉ. గర్జితనిస్వనం బపుడుకర్ణకఠోరముగా ముహుర్ముహు
స్స్ఫూర్జిత మైన వీనుఁగవఁ జొన్పిన యంగుళు లొప్పఁ బ్రాజ్ఞులున్

1. వర్షకాలము.

సస్నాన్వర్ఘఘువిభ్రమభ్రమను జోక్కిరి నివ్వెఱపాటు దోఁపఁగా
[1]నర్జునముఖ్యనామదశకాసకృదుచ్చరదాత్మజిహ్వలై. 84

క. చిట చిట మని సొటసొట మని
ఫాట ఫాట మని ఝల్లు మనియు భోరని ధారా
స్ఫుటనియతి నపుడు జలధర
పటలము పటునియతిఁ గుంభవర్షము గురిసెన్

క. పెళ పెళ నుఱుములు నుఱుమఁగఁ
దళ తళ మెఱుపులును మెఱయ దళముగ జలదం
బులు గ్రమ్మి కాఱుకొని వి
చ్చలవిడి వర్షింపఁ దొడఁగె జడిగొని వడిగాన్.

శా. సారంగావళి మేఘలోలుపమనస్కం బౌట వెన్వెంట నే
తేరం బుష్కరశీకరంబులు ధరిత్రిం జింద మందంబుగా
నీరంధ్రస్థితిఁ గ్రమ్మరం దొడఁగె సుస్నిగ్ధాంజనశ్యామలా
కారంబు ల్పసరంగ రేణుతతినాఁ గాదంబినీ బృందముల్ 87

సీ. కలమాంకురాగోపకరశాలిపాలికా
శ్రీపాలికి సరస్వతీప్రసన్న
మాత్మశక్తితికృషిక్రియార్థవృద్ధనియుక్త
హాలికబాలుర కనధ్యయనపర్వ

1. అర్జునః, ఫల్గునః అని అర్జునుని పదిపేళ్ల ను పలుకువారు.

మనస్యసంవసథప్రయోగప్రయోజన
ప్రవణ ప్రజల కెల్ల గ్రహణశీల
యర్కసందర్శనానంతరాభ్యసనహః
శీలుర కేకాదశీవ్రతంబు.

తే. గీ. నిజనివాసగృహాన్యమందిరయియూసు
ఖగసమూహంబులకు నెల్లఁ జిగురుఁగండె
నిఖిల పశుయూథములకెల్ల నిగళబంధ
మెడ తెగని వాన జడిసప్పు దెసఁగె ముసురు.

చ. వెడ వెడఁ బ్రొద్దు గుంకు తఱి పీటి వీటు ల్సుమపీటి కాదు లె
క్కుడు తమిఁ గూర్చుచున్న గరి కొల్వగునంతకుఁ [1]బోసగత్రిమల్
దడయుటచే హజారమునఁ దాళి చెలుల్ సను దేర సజ్జడిక్
గొడుగులువట్టి చెట్టఁగొని గొబ్బునఁ దోడ్కొని పోదు రిండ్లకుక్.

సీ. వివిధప్రజలు గూడి శివసహస్రఘటాభి
షేకప్రయత్నముల్ సేయకుండ
బాహాటశయ్యచే వాచకుల్నియతి మిం
చ విరాటపర్వంబుఁ జదువకుండ
మాపుహవిష్యాన్న మాత్రభుక్తిని ద్విజుల్
వారుణజపదీక్షఁ బట్టకుండ

1. వంటకత్తెలు.

మృద్వీకారాకారు ఋష్యశృంగునిఁ బూని
విప్రు లుచ్చైస్స్తుతిఁ బిలువకుండ

తే. గీ. గ్రాంతిజాతరఁ బామరుల్ గోరకుండ
సంజప్రొద్దులఁ బోసిళ్లు చల్లకుండ
సూర్యచంద్రులపరిధులఁ జూడకుండ
ధరణినాసారవర్షంబు గురిసె నపుడు 90

సీ. ముసుగిడ్డ కుటుమూపు ముదుకదుప్పటి చెమ్మ
గిలకుండ నలఁతికోవెలలు చొచ్చి
హత్తించి తొడిగిన క్రొత్తచెప్పులజోళ్లు
దడియకుండఁగ వీథి బడులఁ జేరి
గుత్తంబుగాఁ జుట్టి కొనిన చుట్టల నిప్పు
లాఱకుండఁగఁ బంచటరుఁగు లెక్కి
పొన్నుఁ గఱ్ఱల యూఁతఁ గన్నుఁ గానక జాతి
పడకుండ రచ్చసావడుల నిఱికి

తే. గీ. చేల పనులందుఁ జొప్పడు చెలిమి సంజఁ
గాఁపుఁ గొమరులు పసుపు సుంకములఁ గొనిన
శాలిపాలికల కుటీరపాళిఁ జేరి
రెట్టకేలకు నజ్జడి నేకతముగ. 91

సీ. కేళీగృహాళింద పాళీసముజ్జ్వల
దీపద్యుతుల తెల్పు దెల్పుచున్న
దృఢతరాలింగన స్పృష్టముక్తాహార
ముల చల్లఁదనములు వలుకుచున్న
శశ్వత్పరస్పరాస్యగృహీత తాంబూల
రుచులవైకృత్యములు వాక్రుచ్చుచున్న
[1]వాతాయనాంత రాయాతవాతానీత
నూత్నాబ్జగంధముల్ నుడువుచున్నఁ

తే. గీ. ప్రొద్దువోడచెనేమో యను సుద్ది విడిచి
ఘనఘనంబులు గ్రమ్ము చీఁకట్లకతనఁ
దమ తమకములవలన నూతనపు దంప
తులు విడువకుండిరి రజ్జడిఁ దల్పములను. 92

క. ఆతతిఁ బ్రాతఃకాలం
బై తగు సంగవముఁ జూడ నటు సాయాహ్నం
బై తగు నపరాహ్ణము ఖ
ద్యోతుఁడు ఖద్యోతరీతి నొందిన కతనన్. 93

చ. ఘనుఁ డని పేరుఁ గైకొనియెఁ గాని సదా చపలాంతరంగుఁడై
పనిగొని యూరకే విమల పక్షచరద్విజపీడఁ జేయఁ దా

1. కిటికీ.

రోఁజి చెలఁరేఁగి యవ్విషధరుండు వెసం గడువిచ్చె నప్డు
జ్జనపితఘాపకారులకు శాశ్వతమౌ తమజీవనస్థితుల్ 94

క. పద్మాసనుఁడై జపము
ప్పద్మాసఖు నశ్వముఖుని భావించి మహా
పద్మావృత్తి నొనర్చెను
బద్మాసనుఁ డపుడు గిర్యుపరిభాగమునన్. 95

★ హేమంతఋతు వర్ణనము. ★

మ. అపు డేతెంచె హిమర్తువాసర మనంతానంతభాగాంతరా
త్మపరిస్ఫూర్తికశీతభూతపరిభూతత్వాసకృద్వేపథు
గ్లపిత ప్రాణ్యభయప్రదాగ్నిరవితూలస్థూల [1]కూర్పాసక
[2]ద్విపటీచక్రకటీపటు స్తనతటీ పీటీపటచ్ఛాయమై. 96

క. మృగమదవీటీభుగభుగ
లగుపం బొగలున్ [3]హసంతికాగ్నులసెగలుం
నొగరుం దుప్పటు లప్పటి
కొఁగి ముగియించెను హిమోద్యమోద్ధతి ప్రజకున్. 97

సీ. వైకుంఠమందిర ద్వారికవాటపుటంబు
లంచితంబుగ విప్పఁ గుంచెకోల

1. దుప్పటము. దుప్పటి. 3. కుంపటి.

యంజనాగర్భసౌఖ్యప్రసూతి ఘటింప
నందిప్రత్యావర్తనక్రమంబు
బలిరసాతలజగత్ ప్రస్థానసన్నాహ
సాఫల్యమొనరింప సన్మహూర్త
మంభోజినీబాంధ వాశ్రయాశులవెట్ట
సమగతిఁ జల్లార్పఁ జలువమందు

తే. గీ. వాహినీనదవాప్యవగాహనక్రి
యాదితత్పరజనులతీరావతరణ
విధికిఁ జొరకుండఁగా వెఱపింప ఘోర
మకర మెల్లడమించె హేమంతఋతువు. 98

సీ. కుచనిపీడనపీడ కచలవృత్తి వహించు
గాని తియ్యనిమోవియానఁ బెదరు
దృఢపరీరంభవృత్తికి లతాకృతిఁ దాల్చుఁ
గాని నీవీవిమోక్షమున కొదుఁగు
గండనఖాంక రేఖకుఁ బ్రసన్నతనూనుఁ
గాని గంధాలేపకలన కులుకు
హాలామదగ్లాని కామోదము వహించుఁ
గాని పన్నీటిసేకమ్మున కడలు

తే. గీ. స్త్రైణ మప్పుడు మిక్కిలి జాణతనము
గలిగియుండియు నాథులఁ గవయువేళ

విజహాదజహాత్త్రపావేశవిలసముల
వెలయు మధ్వాత్వసమయకేళులను బోలె. 99

సీ. పట్టుఁ బుట్టముఁ జుట్టినట్టి బోడిశిరంబు
పై నొప్పు నక్షయపాత్రి నొకటి
యిరుకక్షములలోని తిరునామముల పుస్త
కమునను దాళవృంతమున రెండు
క్షుద్రకుటీప్రాంత శునకభీతినిఁ గుడి
కేలఁ దాల్చిన తిరుకోల నొకటి
డాచేతి [1]దారుఖండపుఁ దాళయుగి రెండు
స్వప్రతీకంబులఁ బదియు రెండు

తే. గీ. రమణ నష్టాదశోర్ధ్వపుండ్రములు దమకు
నమర సత్యార్థవైష్ణవత్వము ఘటిల్ల
బికిర మెత్తంగ సాతానిపిండు దిఱుగుఁ
దగ ధనుర్మాసవాసరాంతముల నపుడు 100

సీ. నవశాలిసస్యకృంతనవిధానైకసం
భ్రమమునబర్బ్రిమదంఘ్రి భవకులంబు
వార్షికవ్రీహిసంపాదనాజస్రస
త్వరచరద్గ్రామసేవకజనంబుఁ

1. రెండు కొయ్య తాళములు.

ఫార్థివగ్రామ్యాషడ్భాగగ్రహణజాగ్ర
దుద్యోగిపురుషభటోత్కరంబుఁ
బ్రతిగేహపర్యట ద్వాద్యనాదసనాథ
కోణాంగిముఖ్యభిక్షువ్రజంబుఁ
తే. గీ. దనర నవ్వేళ నా ప్రభాతప్రదోష
మా ప్రదోషప్రభాతంబు నటుల యిటుల
తిరుగ నయ్యెయిసందడి తెలిపి లేమిఁ
జేల కూళ్లకు నొకవింత చెలువు దోఁచె. 101

క. ఆ సారసవాహుం డపు
డాసారసదృక్పదద్వయసదాధ్యానుం
డై సారతప మొనర్చె హి
మాసారములో గళద్వయస మగు నీటన్ 102

క. రాజీవనయనుఁ డాశ్రిత
రాజీవనచైత్రుఁ డపుడు ప్రాఁబల్కులకై
రాజీవనవాకృతితో
రా జీవనరాశిలోని రక్కసుఁ డెలమిన్. 103

మ. తిమిరూపంబున నేపుతోఁ గడఁగి వార్ధిం గ్రుమ్మరం గ్రుమ్మఱం
గమలాక్షుండు దిమింగిలాకృతిని రక్షశ్శిక్షణారంభసం
భ్రముఁడై పొంచి పరిభ్రమించి యరిఁ జేవన్మించి మేన్మించి యా
గమముల్ వేగమె యాక్రమించి విధికిఁ గాంక్షించి యుంచదతిన్.

సీ. సిద్దంపుటద్దంపు నిగనిగద్యుతులతో
నగవుమైచాయ వెన్నెలలు గాయ
చిందింపుఁ జందంబు చెందుమోరఁ దోరంగు
నుడువు జ్ఞానామృత స్ఫురణఁ దెలుపఁ
బలుసొంపు నులివింపుఁ దొలుకు హేషాధ్వనుల్
నెఱిఁగుల్కు తొలిబల్కు సొలపు నెఱవ
నిరు ప్రక్కలను జక్కఁ నెసఁగు చూపులకోపు
శితపక్షపాత సంగతి వచింపఁ

తే. గీ. [1]పంచశాఖచతుష్టయిఁ బాంచజన్య
మును సుదర్శనమును బొత్తము నుపదేశ
ముద్రయు నెసంగఁ గనుఁదా సముద్రుఁ డైన
హరి హయగ్రీవమూర్తిఁ బ్రత్యక్ష మయ్యె. 105

క. అప్పగిదిఁ బొడసూపిన
యప్పరమపదేశుఁ గని యహో యితఁడు మా
యప్ప యగు శౌరి యౌనని
యప్పరమేష్ఠియు సమగ్ర మగు హర్షమునన్. 106

క. ముమ్మాఱులు వలగొని మది
ముమ్మర మగు భక్తి సాఁగి మ్రొక్కుచు నటులే

1. (ఆయుధ వేష్టుగల) నాలుగు చేతులయందును.

క్రమ్మఱ బ్రేమిఁ బొంగఁ బులకలు
గ్రమ్మ రహిన్ నటలతటల గత్కారవుఁడై.

—: కందగీతి గర్భ చంపకమాల. :—

ఘనఘనవిగ్రహా! వరద! కాంచన చేల! కృపా విశాల! స
జ్జనవినుతా! హరీ! జలధిశాయి! పరాత్పర! చక్రహస్త! పా
వన! వనజేక్షణా! భువనపాలన ఖేలన! పుణ్యశీల! లా
లన నిరతాశయా! ప్రవిమల ద్యుతికౌస్తుభ రత్నభూషణా!

గర్భ కందము.

ఘనవిగ్రహా! వరద! కాం
చనచేల! కృపావిశాల! సజ్జనవినుతా!
వనజేక్షణా! భువనపా
లన ఖేలన పుణ్యశీల లాలననిరతా! 119

గర్భ గీతము.

వరద! కాంచనచేల! కృపావిశాల!
జలధిశాయి! పరాత్పర! చక్రహస్త
భువనపాలన ఖేలనపుణ్యశీల!
ప్రవిమలద్యుతికౌస్తుభరత్నభూష! 110

క. భక్తుల మత్ప్రముఖసుధా
భక్తుల [2]శుక్తులఁ బాపి పనిగొని కరుణా
యుక్తము లగు చూపుల సుఖ
యుక్తము లగునట్లు సేయుదో హయవదనా! 111

శా. జ్ఞానానంద మయా! స్ఫుటస్ఫటికభాస్వద్విగ్రహా! సర్వవి
ద్యానిత్యప్రతిభావిశేష ఘటనాధారా! బుధారాధితా
భానుప్రాకట తేజ! పుస్తకపుటీ వ్యాఖ్యాన ముద్రాబ్జచ
క్రానూనాయతశస్త్రహస్త! హయకంఠా! శ్రీవికుంఠాలయా!

మ. అని యెన్నేని విధంబుల న్వినుతిసేయంగాఁ దురంగాననుం
డనియెం బంకజసూతిఁ గాంచి విను మయ్యా! నీదు వేదంబులం
గొని సోమాసురనామకుండు సనఁ దత్కుక్షిన్ విభేదించి ప్రా
మినుకుల్ దెచ్చితి నీకొసంగ నివె పేర్మిం గూర్మి వాటిల్లఁగన్.

క. ఉపదేశ మ్మొందని చదు
వుపయోగముఁ జెంద దనుచు నోమ్మని యావే
లుపుఁ బెద్దకు హయవదనుం
డపు డుపదేశించె శ్రుతులు సాంగంబులుగన్. 114

చ. మఱియు మదీయమూర్తి మది మాటికి మాటికి మాటి మంత్ర మే
మఱక జపించు మానిసి సమగ్రకలావిభవాభిరాముఁడై

1. [illegible]

కొఱంత యొకింత లేని పలుకుంబడికిం గడితంపుటిక్కయై
నెఱతన మేర్పడం జెలఁగు నేర్పరులందుఁ బ్రధానగణ్యుఁడై

క. నా [1]మనుజపగరిమంబున
నామనుజపగరిమ సిరి మహామహిమంబుల్
భూమహితప్రఖ్యాతియు
భూమహితప్రసితసుతసమూహము నొదవున్ 116

ఉ. కావున నీవు నమ్మికఁ దగం ద్రిజగన్నుత మైన నిష్ఠ నన్
భావన చేయుచున్ మనుజపం బొనరింపుము దానఁ జేసి నా
నావిధభూతజాతభువనంబుల నంబుజగర్భ కౌశలం
బావహిలంగ నశ్రముఁడవై సృజియించెదు సొంపు పెంపునన్.

క. మహి నితరక్షేత్రంబుల
బహుకాలజపంబు వలనఁ బడయం దగు నా
త్మహితార్థసిద్ధి యిచ్చట
ముహూర్తజపమాత్రమున నమోఘముగ నగున్.

క. ఉపమా కాస్యక్షేత్ర
స్యపృథివ్యా మనుచు విబుధు లనుకొనుటఁ జుమీ
యుపమా కాభిధ నీది
వ్యపదంబు ప్రసిద్ధిఁ గాంచె నంభోజభవా. 119

1. మంత్రము జపించుట.

గీ. క్షోణిపై ఫాల్గునంబున శుక్లపక్ష
మందు నేకాదశిని మదీయావతార
మగుట నాఁ డిందు వేదపారాయణంబు
సేయఁ జేయింప విన ఘనశ్రేయ మొదవు

గీ. సింధుతీరగ మైనయీక్షేత్రసీమ
బంధురాహ్వయ మగు సరోవరము నందు
నాఁడు మజ్జన మాడు నెవ్వాఁడు వాఁడు
సంతరించినకర్మసస్యములువాఁడు.

క. ఈయశ్వగ్రీవాకృతి
చాయవతారములయందు నరుల కుపాస్యం
బై యఖిలశ్రీవిద్యా
దాయకమై యఖిలసుఖనిదానంబు నగున్. 122

క. అని యుపదేశపురస్కృతి
గను వేదము లొసఁగి [1]తురగకంధరుఁ డరుగన్
వనజజుఁ డానంద మొదం
దనరం దనరమ్య మగు పదంబున కరిగెన్. 123

—:★: ఆశ్వాసాంతము. :★:—

క. శ్రీరాఘవ! నతజన దు
ర్వారాఘవనప్రతానపావక! మునిరా

1. హయగ్రీవుఁడు.

ద్ధారాఘువనధరసమీ
రా! రాఘువ సటదమోఁబుర యువిశిఖౌఘా! 125

మ. మునిరాజక్రతురక్షణా! స్ఫుటసితాంభోజాతపత్రేక్షణా!
వినతాభీష్టకృతిక్షణా! పరమధీవిజ్ఞాన [1]సంధుక్షణా!
ఘనసంగ్రామవిచక్షణా! సురముహుఃకల్యాణకృల్లక్షణా!
వినుతశ్రీకృతలక్షణా! ఖలమరుద్విద్వేషిసంశిక్షణా!

పృథ్వి. పురందరమణీగణస్ఫుటనముజ్జ్వలాంగప్రభా!
ధురంధరదిగంతదంతురితదోర్యశస్సౌరభా!
నిరంతరదయాభినందితవనేచరాఘర్షభా!
మరందరసమంజువాఙ్మహితమైథిలీవల్లభా! 126

—:౦: గద్యము. :౦:—

ఇది శ్రీమద్రామనామపారాయణపరాయణాతిధన్య కౌండిన్యగోత్ర
పవిత్రదేవులపల్లికులపయఃపయోనిధికళానిధిసీతారామశాస్త్రి పౌత్ర
వేంకటకృష్ణశాస్త్రి పుత్ర తమ్మనాభిధానాంతర వేంకటకృష్ణ
శాస్త్రినామాగ్రజన్మ త్రిలింగదేశాగ్రజన్మ సుధీ
విధేయ సుబ్బరాయశాస్త్రి నామధేయ ప్రణీతం
బైన మహేంద్రవిజయం బను ప్రబంధంబు
నందు ద్వితీయాశ్వాసము.

శ్రీ సీతా రామార్పణ మస్తు.

1. వెలుగునటు చేసెడువాఁడు.

# శ్రీ మ హేం ద్ర వి జ య ము

## తృ తీ యా శ్వా స ము .

శ్రీవిద్వన్నుతకవితా
భావుకకౌండిన్యగోత్ర భావితవరధీ
దేవులపల్ల్యన్వయకుల
దైవత యజపౌత్ర దశరథప్రభుపుత్రా. 1

గీ. అవధరింపుము శౌనకాద్యఖిలమౌని
జాల మా [1]జాలపాదరాజన్యవాహ
నుని తపస్సిద్ధిపద్ధతి విని వచించె
దనివితీరనిమది సూతుఁ గని వినీతి. 2

ఉ. ఓ మహనీయబోధగరిమోజ్జ్వలధీసముపేత సూత వా
ణీమహిళామణీరమణు నిశ్చలభక్తితమస్సమాధియో
గామితనైష్ఠికస్థితి సమగ్రముగా నిటు వింటి మింక నిం
దేమను లేమి సిద్ధి గని కేర్పడ నేర్పడర న్వచింపవే. 3

1. హంస వాహనుఁడు బ్రహ్మ.

క. ఇందుఁగల మహిమల విధం
బిందుగల న్మధురసుధ రహిందగు నుడులన్
విందుము మా వీనుల కీ
విందు ముదంబునఁ గదింపవే కడు వేడ్కన్. 4

చ. అన విని సూతుఁ డిట్లనియె నమ్మునిముఖ్యుల నెల్లఁ జూచి యో
యనఘచరిత్రులార! వినరయ్య మదీయ గురుప్రభావమున్
ఘన మగు మీ కటాక్షమును గల్గుటచే వచియింతుఁ గానిచో
ననువుగఁ జెప్ప శక్య మగునా? [1]ఖగనాథగిరిప్రభావముల్. 5

క. అచ్చట మును తపముం బొరి
పొచ్చెము లే కదితికశ్యపు లొనర్చి హరిన్
ముచ్చట దీరఁగ సుతునిఁగ
నిచ్చఁ గనిరి దాని తెఱఁగు నెఱిఁగింతు నిటుల్. 6

సీ. దీక్షానిరూఢిజ్యోతిష్టోమకర్తలా
[2]యాయజూకుల కెద్ది తావలంబు
న్యాయ్యపరిపాలనాసక్తచిత్తు లా
ధరణీశ్వరుల కెద్ది తావలంబు
ధర్మవాణిజ్యతత్పరహృత్పరీతు లా
వణిగగ్రణుల కెద్ది వాసగృహము

1. గరుడాద్రి. 2. యజ్ఞములు చేయువారు

ద్విజసేవనాసక్త విఖ్యాతిధన్యులౌ
పాదజన్ముల కెద్ది పట్టుఁ గొమ్మ
తే. గీ. పరమశాంతతఁ బతిపాద భక్తియుక్త
హృదయలౌ సాధ్వులకు నెద్ది కుదుటఁ బట్టు
దాని వర్ణింపఁ దరమె సత్కర్మఫల సు
భోగసుకరంబు శ్రీస్వర్గపురవరంబు 7

క. ఆపుర మమరావతి యన
గోపుర మనఁ గనకరత్న గోపురశిఖర
శ్రీపరిచుంబిత పంకజ
భూపట్టనహట్టఘట్ట ముఖమై తనరున్. 8

ఉ. కోరినకోర్కు లిచ్చు నఁట గోవును జెట్టును తాయి మేలిబం
గా రఁట నేలయెల్లఁ ద్రిదిగంబుల నప్పుర మగ్రగణ్యమై
పేరిమి గాంచి మించు నఁట వేయి విధంబుల జాగరూకుఁడై
యారసి ప్రోచునాథుఁ డటఁ యచ్చటివారల భాగ్య మెట్టిదో. 9

ఉ. పాయనిజవ్వనంబు గల ప్రాయము సానలఁ దీర్చి యెవ్వరుం
జేయని వాఁడితూపులును జింగిరిమూంగిరిగాఁగ నెవ్వరు
న్నేయనివల్వ లప్పులను నిప్పుల వండని వంటకంబులున్
మాయనికన్ను లన్నగరి పోఁడుము లెంతయు వింతలై తగున్.

ఉ. అప్పురి చొప్పుఁ జెప్ప దరమా వివరింప నసాధ్యరీతియై
యెప్పుడుఁ దా నసాధ్యముగనే కనుపట్టు నభోగమూర్తియై

యెప్పుడుఁ దా సుభోగముగ నే కనుపట్టు విమానరమ్యమై
యెప్పుడుఁ దా సుమానముగ నే కనుపట్టు విచిత్రవైఖరిన్ 11

క. [1]వసువిసరప్రసితంబై
సుసిద్ధమహిమాఢ్యమై విశుంభత్సంతా
న సుమహితామోదంబై
యెసఁగెడి నచ్చోటి వార లే కద స్వస్థుల్ 12

ఉ. ఇచ్చటి బ్రహ్మచర్యనియమైకధురంధరవర్తనంబు లా
యచ్చరపూవుఁబోండ్లఁ గలయం దగునుంకువ లౌచు నెంతయున్
ముచ్చట దీర నందన సముద్భవభూరిఫలప్రదంబులై
మెచ్చగ నచ్చటం బరిణమించుచు మించు సమంచితంబుగన్.

సీ. అంశుమత్ఫలకు మధ్యంబు దధ్యముగ నే
తత్సామగాయ మో తరుణయజ్వ
సారంగివదనంబు సారంగలాంఛను
యద్దేవ సేయు నో యాయజూక
చంద్రమఃకళనాభి చంద మింద్రోపల
స్యసమాన మో హవిర్యాజివర్య
యష్టాపదగృహంబు నందె కదా యాత్రి
యామసుఖంచ మే యాహితాగ్ని

1. బంగారముతో కూడుకొనినది.

తే. గీ. యనుచు మందాకినీతీరమునను దాన
మున కుషఃకాలమునఁ గూడికొనినక్రొత్త
సోమయాజులు స్థాలికల్ ద్రోమికొనుచు
నాత్మపరిభాషభాషింతు రచట నెపుడు. 14

మ. తనకే మున్నుగ ద్రొక్కె నూర్వసి వధూత్తంసం బటం చొక్కఁడుం
దనకే కల్పఫలం బొసంగెఁ దొలుదొల్తన్ రంభ యం చొక్కఁడుం
దనకే మేనక మేన మున్నలఁదె గందంబంచు వే ఱొక్కఁడుం
దనియుం [1]గర్మసురాళిలో నచట ధన్యంమన్యభావంబునన్. 15

చ. ఎడనెడ వేల్పు సాను లెదు రేగి వరింపఁగఁ దద్గృహాంబులన్
నడిఁ జొరఁబాఱఁ గొంక రట వాకిట జందెము లుద్ధృతోరులై
యొడుపుచు నన్నలున్నను స్వరోన్నతి లోపల వేదపన్నముల్
నుడువుచుఁ దండ్రు లుండినను నూత్నసమాగతయజ్వ లచ్చటన్.

సీ. స్నానజపోపవాసశ్రమంబుల కోర్చి
తి మటంచు యజ్వలొద్దికను వేఁడ
సంభారసన్నాహ [2]సాహ్యం బొనర్చితి
మని కారయితలు మంతనముఁ బలుక
నూరకుండినవారిఁ బ్రేరణం బొనరించి
తి మటంచుఁ బ్రేరకుల్ దమినిఁ దెలుప

1. బ్రాహ్మణులు. 2. కలయిక.

నౌను గా దనక మే మంగీకరించితి
మని యనుమోదకుల్ మనవు లనుప
తే. గీ. ద్రవ్యమును బట్టి కద సుకృతంబు గాన
యాగభిక్షాప్రదాతల భాగ మేము
వలసినను మీకు బానిసల్గలరటంచుఁ
బరిహాసింతు రోకింత యచ్చరలు వారి. 17

సీ. స్వాశ్రితావనము సేయక యన్యులను బ్రోచు
భూవరు ల్సొరరాని భువన మెద్ది
యుపకారవిముఖులై యపకారము లొనర్చు
మూర్ఖులు సొరరాని భువన మెద్ది
పరగుణస్తుతికిఁ బాల్పడక నిందలు సేయు
ముష్కరుల్ సొరరాని భువన మెద్ది
స్వమతవిదూరులై పరమతాశ్రయులైన
యవగుణుల్ సొరరాని భువన మెద్ది
తే. గీ. త్యాగభోగంబులకుఁ గాక ధనముఁ గూర్చి
పొసఁగు లుబ్ధులు సొరరాని భువన మెద్ది
యద్ది దన కద్ది గనక నిత్యానపాయి
మోదభవనము శ్రీస్వర్గభువన మొప్పు. 18
మ. నిజమాతాపితృభక్తిశూన్యులు స్వపత్నీ త్యాగులున్ దేవతా
భజనాశక్తివిహీను లాత్మ విభు విశ్వాసానభిజ్ఞుల్ స్వకీ

యజనద్రోహులు మిత్రఘాతుకు లసత్యాలాపకు ల్సేరరా
ని జగంబాత్రిదివంబు దన్మహిమ వర్ణింపంగ సామాన్యమే. 19

సీ. విశ్వాసపరుల వీ వీథిసౌధంబులు
వీరిఁ గూరిమి జూచు వేల్పు ఱేఁడు
కన్యకాప్రదుల విక్కడి చంద్రశాలికల్
వీరి మన్నింతురు విబుధు లెల్ల
సంగరోద్ధతుల వీ చాయవిమానముల్
వీరి నచ్చరలు సేవింతు రెలమి
సత్యవాక్యరుల వీసరణిఁ బ్రాసాదముల్
వీరి గురుండు భావించు మైత్రి

తే. గీ. నన్నదాతల వీచక్కి హర్మ్యతతులు
వీరి నిందుఁడుఁ గడుఁ గారవింతు రనుచు
దినదినము వచ్చు నవకర్మదేవతలకుఁ
దెలుపు నచ్చోటి పరిపాటి దివిజకోటి. 20

ఉ. అప్పురి నొప్పు [1]నుప్పరిగ లందుల విందుల విందు లంచుఁ బొం
దుప్పతిలంగ నొక్కదిన మొక్కొకరింటఁగ వేల్పుఁ గన్నియల్
దప్పక యుండుచో దరిసుధాకరు గుజ్జెనగూటిగిండి దెం
డప్ప లిదే యటంచుఁ గదియం జని తే గమకింతు రెంతయున్.

1. పై మేడలు.

క. అమృతంబును మందాకిని
యమృతంబునుఁ గల్పతరుసుమాసవసారం
బమరగవిపయఃపూరం
బమరఁ జతుర్ముఖుఁడై యిట్టి వనియెన్నఁ దగున్. 22

సీ. గంధర్వకరతలాఘాతపుష్కరమృదం
గధిమింధిమిస్వన క్రమము లెసఁగఁ
గిన్నరీమధురసంగీతగాంధారనా
మగ్రామతానసంపద లెసంగ
విద్యాధరీపాణి వీణాకలక్వాణ
మూర్ఛనాగమకవిస్ఫూర్తు లెసఁగ
నప్సరస్సుకమలాస్యాలాస్యవిభ్రమ
భ్రమదంఘ్రినూపురారవము లెసఁగ

తే. గీ. నిత్యకైలాసవైకుంఠసత్యలోక
నియతగమనాగమనకృత్యనిరతసురవి
మానఘంటానినాదగుంభనము లెసగ
వీనులకువిందు గావించు వేల్పుఁ బ్రోలు.

మ. సరిగా నప్సరిఁ గానవచ్చు సిరిఁ గాంతిస్ఫూర్తిఁ గీర్తింపఁగా
నురగాధ్యక్షుఁడు దక్షుఁడౌనె [1]యమితాస్యుండయ్యు నేమన్నచో

1. అనేకముఖములు గలవాఁడు- వేయిముఖములు గలవాఁడు.

నిరవొందం గనెనే యతండు త్రిదివం బేయూరి కేత్రోఫ య
గ్గురుఁ డేకాననుఁ డయ్యు నచ్చట మెలంగుం గాన నష్టాండగుణ.

ఉ. ఆపుర మేలు నాత్మ గురునానతి దప్పఁడు సౌమనస్యముం
జూపును జేపు మాపు మనుచున్ బుధసంతతి నెంతయున్ సుధ
ర్మోపగతిం దగున్ సదయనోచితవర్తనకీర్తనీయుఁ డౌ
రా! పరికింపఁగా నితఁడె రాజన నింద్రుఁ డతంద్రవైఖరిన్ 25

ఉ. ఆతని భాగ్యభోగసముదగ్రతఁ దెల్పఁగ నేల సాటిగా
నాతఁడె సాటిగాఁ దెలుపనోఁ దదుపేతులకెల్ల ధైర్యశౌ
ర్యాతిశయంబు దెల్పవలె నా కులశైలమదాపనోదన
ఖ్యాతతరాపదానము శతాహావకర్తృత దెల్పుచుండగాన్. 26

చ. అతఁ డొకనాఁడు లీల చెలువారఁగ వారగజేంద్రగామినుల్
చతురత [1]దండలాస్యమును జక్కిణిఁ బేరణిఁ గుండలిన్ సమం
చితగతిఁ జూపఁగా నెలమిఁ జిత్రశిఖండిజవహ్ని ముఖ్యాది
క్షితితతితో రసైకవశ భావమునం దిలకించుచున్నెడన్. 27

నందనవనపవనము రా
నందనయము నలరుఁ దావి యపు డొక తీరై
నందన డెందము కుతుకము
నందనరఁగ నింద్రుఁ డటు చనం దలఁపొదవన్. 28

1. నాలుగువిధములైన నృత్యములు.

చ. కెలఁకుల నున్నవారిఁ బరికించి గురుం గని యేమి! సామి యిం
దలరువినోద మిప్పటికి నాఁవు దమే మన నందనంబు లో
పలిపవనం బపూర్వమగువాసన దోఁగుచు వీచెఁ గాన నం
దలి వనపాలదోహదవిధానచమత్కృతిఁ జూచి వత్తమే. 29

చ. ఇట నమరేంద్రుఁ డిట్లు వచియించుటకై గురువంకఁ జూచునం
తట నట [1]నాగవాసమున నాయికురా లొనరించు సన్న చేఁ
దటుకునఁ దాళశబ్దము మృదంగరవంబు నుపాంగనాదమ
స్ఫుటమయి తోఁప [2]మారజికు ముంగల నర్తకి నిల్చె నొద్దికన్.

సీ. పడసినబహుమానపాత్రంబుతోనె పా
ణులు మోడ్చి విభుపాదములకు మ్రొక్కి
శ్రుతికిఁ గూర్చిన వీణ జతనంబుగా బోటి
చే నుంచి యడుగులఁ జేరి మ్రొక్కి
తాళంపుఁ జిప్పలు గీలుగొల్పిన నీవి
తోనేగి నమ్రత దోఁప మ్రొక్కి
నాయికురాలి చెంతనె నిల్చి యొక్కింత
నానతోఁ బదపీఠ మాని మ్రొక్కి

తే. గీ. వెనుక నడకోల మార్దంగికుని పిఱింది
దనుక నెఱితన మొయ్యారమును హొరంగు

1. వేశ్యాగృహము. 2. మద్దెల వాయించు వాని.

మఱి పెఱును మీఱ నేఁగి యుపూర్ణపాత్ర
మందఱు గ్రహించి యచ్చర లరుగునంత. 31

గీ. వైజయంతీవికాసభాస్వరతఁ గనుట
శ్రీనివాసవిలాసంబుచేఁ జెలంగు
వైజయంతంబు వెడలివచ్చి యాజయంతుఁ
గలసి యింద్రుఁడు మొగసాలకడ వసింప.

మ. గరుడుల్ సాధ్యులు సిద్ధులున్ వసువులున్ గంధర్వులుం జారణుల్
దురగాస్యుల్ మొదలైనవ్యోమచరసందోహంబు సోత్సాహమై
పరివేష్టింపఁగఁ [1]పావకప్రముఖదిక్పాలావళుల్ దోడ రా
నరుగం జొచ్చె వియచ్చరేంద్రుఁ డటకై యైరావతారూఢుఁడై.

క. అరుగు నెడఁ దిరుగ నూతన
పరిమళపరిమిళితమైన పవనము వడిగా
నరుదెంచె నిదె యుపాయన
మరసి గ్రహింపుమని తెలుపునట్టు లతనికిన్.

అపుడు దేవర్షి బ్రహ్మర్షులభ్రగతులఁ
గలసి యభ్రమువల్లభగతుని నతని
బలసి ప్రాస్థానికస్వస్తివాదముఖర
ముఖరములతోడరాఁ జూచి మఱియు చరిగె

1. అగ్ని..

గీ. అటుల మందాకినీసరిత్తటముఁ దరిసి
యచట నొక్కింత యిచ్ఛావిహారకలన
వలన వలనగు సంతృప్తిఁ బడసి మరలఁ
దరలి యుద్యానవనిఁ జూడనరుగు వేళ.

సీ. సహజరోషానలజ్వాలాకలాపంబు
పగిది జటాకలాపంబు దనర
నియతభస్మీకరానిపుణత్వ మెఱిగించు
భాతి సర్వాంగీణ భస్మ మమర
స్వాభావికావిమర్శప్రకర్షముఁ జూపు
రీతి నిర్లక్ష్య దృక్పాత మొప్పఁ
బ్రకృతి సంలబ్ధశీఘ్రప్రసాదముఁ దెల్పు
మాడ్కిని స్ఫటికాక్షమాల గ్రాలఁ

తే. గీ. బరమమాహేశ్వరుండు దుర్వాసుఁ డప్పు
డెందునుండియొ యెచటికో యేగుచుండి
పిడుగు వడినట్టుగా నుట్టిపడియె నెదుట
నమరసమితికి నత్యాహితము ఘటిల్ల. 37

ఉ. వచ్చిన [1]పారికాంక్షి సురవల్లభుఁ డల్లనఁ జూడఁ డన్నచో
నచ్చపుభక్తి స్వాగతము నారయునే పరిచర్య సేయునే

1. ముని.

పొచ్చెపుఁ బంటపల్లెకుఁ బ్రభుత్వము గల్గునటన్న మాత్రనే
హెచ్చుమదంబు ముజ్జగము లేలెడి వానికిఁ జెప్ప నేటికిన్. 38

మ. ప్రకృతిక్రోధనుఁ డయ్యు నింతటికె రౌద్రస్ఫూర్తిఁ జూపింప నే
టి కటంచున్ ముని యెంచెనో? దివిజరాణ్ణిర్లక్ష్య భావంబుఁ జం
ద్రకళాశేఖరదివ్యమంగళవపుర్ధ్యానైకనిష్ఠాప్తి నిం
చుక యేనిం బరికింపఁడో కలటిసంస్థున్ వాసవున్ డగ్గఱెన్. 39

క. ఆసుత్రామున కటు దు
ర్వాసుం డతిశీఘ్రకోప రసపరవశతా
భ్యాసభవశాపఘటనా
వ్యాసవచఃక్రమవిలాసుఁ డాసన్నుండై 40

మ. ఒక విద్యాధరకన్యకామణి తపో యుక్తిం దుషారాద్రిపు
త్రిక మెప్పించుట నామె సత్కృపఁ బ్రసాదింపన్ సువర్ణాబ్జదా
మకముం దోయుటఁ బూని తెచ్చికొనుచో మార్గంబునం దాను డా
సి కుమారీ యిడు మాకు దీని నన నిచ్చెన్ శాపభీతాత్ముఁడై. 41

క. దానిఁ గొనివచ్చు పథమం
దానిర్జరనేత మాని కపు డెదురుపడం
దా నిడ శిరమునఁ బూనక
దాని శిరంబున సరం బతండును విడిచెన్, 42

. మది గాన నదియునుం దన
మదిఁ గానక కరము కరము మ సకసీమన్

గదియించి తివిచి కాలం
జిదిపెం బొందమ్మిసరముఁ జిద్రుపలు గాఁగన్. 43

శా. ఆనిర్లక్ష్యమదాంధభావగరిమో ద్యద్దుర్వినీతత్వముం
దానే కట్టెదుటం గనుంగొనుట నిత్యక్రోధుఁ డత్యాగ్రహా
నూనభ్రూకుటి దుర్నిరీక్ష్యవికటా స్యుండై హ తాచ్ఛ్రీత్కృతి
స్వానోన్మిశ్రముగా మునీంద్రుఁడు కర ద్వందంబుఁ దాటించుచున్

క. జ్వలదనలకణము లొలుకం
దిలకించెం గాని యింద్రు నియమ త్ర్యత్వాం
బలజడి వడ నీకుండఁగ
నలవడియు శరణ్యా మగుచు నయ్యాపదమున్. 45

శా. ఏరా! యోరి దురాత్మ చుమ్మెఱుఁగవో యీకావరం బేలరా!
గౌరీదివ్యపరప్రసాదమహిమాం కం బస్మదానీత మీ
నీ రేజాతసరంబు దీని నవమానింపంగ నెట్లొప్పెరా!
స్వారాజ్యప్రభుతామదంబునఁ గదా ప్రాపించె నీ కీ క్రియల్ 46

గీ. ఈదృగవలేపమున కెల్ల హేతు వైన
కలిమి శాత్రవులను జేరఁగాత మనుచుఁ
బుట్టుదిట్టుల దిట్ట యైనట్టితపసి
యుపశమింపనికినుక [1]లేఖపు శపించె. 47

---

1. ఇంద్రుని.

మ. అనుచున్ బిట్టుగఁ దిట్టఁగా మఘవుఁ డత్యంతంబు భీతిం గుభా
లునఁ జౌ[1]దంతిని డిగ్గి తచ్చరణము ల్మూర్ధంబు సోఁకంగ మ్రొ
క్కి నితాంతార్తి క్షమింపు మన్న నతఁడుం క్షిప్రప్రసాదుండుఁ గా
వున గోవిందుఁడె రక్షకుం డనుచు సేవ్యం దెల్పి స్వేచ్ఛం జనెన్

క. అటు లామునిపటలాగ్రణి
చటులాక్షరరూక్షఫణితి శాపాలాపా
ర్భటులాననమునఁ బెనఁగొన
జటు లాహాయనఁగఁ జనఁగ సంక్రందనుఁడున్. 49

క. శాపంబు నొంది పశ్చా
త్తాపంబునఁ గుంది నింది తము లగు నార్తా
లాపంబుల సపరాధక
లాపంబుల నిమ్మెయిం దలంపఁ దొడంగెన్. 50

వింతవలపున కంతగంభీరగుణము
విడిచి యరసికుగతి రక్తి వెల్లి గొలుపు
వేళఁ గొలు వట్లు చాలించి వెకలితనము
గలుగు టిబ్బంగిఁ గానుంటవలన నేమొ 51

పవనంబు వెడలుచోఁ బవమాన మెదురాట
దుర్నిమిత్తం బనితోఁప దయ్యె

1. ఐరావతము.

వాహనంబులు లేక బ్రహ్మర్షి ముఖ్యులు
దోడరాఁ దగదని దోఁప దయ్యె
మాహేశ్వరుండైనమాని పాదవ్పులఁ
దోఁప నమ్రతఁ జూఁప దోఁప దయ్యె
గౌరీప్రసాదరుక్మపయోజమాల కం
దోయి నద్దుకొనంగఁ దోఁప దయ్యె

తే. గీ. నేమి సేయుదు దివ్యపరీమళాఖ్య
బడిశమునఁ బడి శమగుణం బుడుగ వడిగఁ
జిత్తమీనంబు చిక్కులఁ జిక్కెనకట
దైవనిర్ణయ మెవ్వారు దాటువారు. 52

మ. మునిరాణ్ముఖ్యుని శక్తి మున్నెఱుఁగనో ముక్కంటి యీదంటయై
యనసూయాసతియందు నత్రికి సుతుం డౌ టెల్ల నాలింపనో
జననక్రోధనుఁ డీ తపోధనుఁడు దుస్సాధ్యప్రభావాఢ్యుఁ డం
చని విన్నాఁడను గానో నా తెలివి యేమై పోయెనో యక్కటా.

మ. అని చింతించుచు నింటికై శమితతూర్యస్వానుఁడై దీనుఁడై
చనుచో నేమిర! సామి! రక్షక! రమేశా! యంచు ఖేదంబుతో
వెను వెంటం జెఱగంటిదంటలును సోద్వేగంబుతో నేగి రా
క్కని మేషంబున నిట్టిపా ట్లనుచుఁ [1]గింకర్తవ్యతామూఢులై. 54

1. ఏమి చేయుటను దోచనివారై.

క. ఎచ్చటి యరదం బచ్చట
నెచ్చటి ద్విరదంబు నచట నెచ్చటి తురగం
బచ్చట మఱి యెచ్చటి సుర
లచ్చటగా విచ్చి చొచ్చి రాత్మాలయముల్. 55

శా. ఈరీతి న్నతమన్యుఁ డన్యముఖము ల్వీక్షింపఁ గాలేక స్వా
గారం బందున గారవం బుడుగ సిం గారంబులే కొక్కఁడున్
దారాపత్యనిజాంఘ్రిభృత్యులును జెంతం జేరఁ జింతాకులాం
ధీరస్వాంతముతోడ నూఁకొనక మందీభూతుఁడై యున్నెడన్.

చ. అణఁకువతోడ నెప్పటి యుదంతము నప్పుడె విన్నవింప ను
ల్బణతరనీతిశాలి యగు భార్గవు పంపున గూఢవృత్తిఁ ద
త్ప్రణిధులు నాకలోకముల వర్తిలు వా రటు లేగి రాక్షసా
గ్రణులు వినంగ నిట్లు బలిఁ గాంచి వచించిరి శుక్రు సన్నిధిన్

క. దేవా! దేవాధీశ్వరు
కావరమున కావరముని గణ్యుఁడు శైవాం
శావిర్భావుఁడు లసదను
భావుఁడు దుర్వాసుఁ డలిగి వడి శపియించెన్ 58

క. ఆ శాపవిధముఁ దెలిపెద
మాశాపతిసేవ్యతాభ వాతిశయమదా
వేశాపశదా యోదే
వేశా పరులను భజించు నిఁక నీదు సిరుల్. 59

చ. అని శపియింప [1]శక్రుఁడు పదానతుఁడై క్షమియింపు మన్నచో
విని విననట్టు శాపవిని వృత్తి యొనర్పఁగ లేదు గాని గో
బ్బున హరియే కలం డనుచుఁ బోయె నతం డెట కేనియో గృహం
బున కరిగె న్విషాదమున మున్గుచు నీతఁ డపేతమోదుఁడై. 60

క. అని చారు లివ్విధంబుగ
వినిపించిరో లేదో గాని వికవిక దోడ్తో
డనుమించెఁ గహకహార్భటి
యనుగతమై రాక్షసాట్టహాసము తోడన్. 61

శా. ఎట్టెట్టా మునిపంచకోడి కడక య్యాశాపరాకారుఁడై
తిట్టెన్ దిట్ట యనం బ్రసిద్ధుఁడగు నద్దివ్యర్షి వేంచేసెనే
కట్టా యాతని గారవింపఁడె త్రిలోకస్వామ్యగర్వాంధుఁడై
గుట్టల్గొట్టెడు వెట్టివాఁడు మునియుం గ్రోధోగ్రుఁడై తిట్టెనే.

ఉ. మేలు భళీ బలిం బలిమి మించినవారల వీరులం ద్రిలో
కీలసమానమానఘన కీర్తివిశాలుర దానశీలురం
బోలఁగఁ జూచినారమె ఋభుప్రభుసంపదఁ బెంప దక్షు లే
మూలఁగ రారు గల్గిన ఋభుక్షుని కాప్తులె గాక శత్రులే. 63

క. వారలకు మనము మనకున్
వారలుఁ బరుల మని యెల్ల వారికిఁ దెల్లం

1. 2. ఇంద్రుఁడు.

ఖారాజు వైభవము మన
యీరాజుం జేర నిర్ణయించెన్ విధియున్. 64

క. ఇదె విమతులపై కెత్తుట
కద నని కదననిపుణుఁ డగు భృగుజుఁడు దే
ల్పఁదగన్ బలిపీఠముపైఁ
గదలన్ గద లందికొనియెఁ గద తద్బలముల్. 65

శా. అంతం దంతుర మయ్యెఁ దేజమున నయ్యాస్థానగేహాజిరో
పాంతం బెంతయుఁ గుంతచాపపరిఘప్రాసాసిముఖ్యాయుధో
ద్భ్రాంతాత్యంతఘనస్ఫులింగరుచిసంతానంబుతోఁ దద్భ్రమా
క్రాంతానంతపరిభ్రమిద్యోగణామణీ కాంతు ల్విసాళింపఁగన్. 66

క. నగరి మొగసాల నపు డె
న్న గరిమ నిస్సాణనిక్వణంబు చెలంగె
న్నగరిపుఁడు వసించెడున
న్నగరి పయికి దాడి తత్క్షణ మని తెలుపుచున్ 67

శా. ఆసన్నాహమ్ముఁ జూచి యిబ్బలియు దృప్యత్సైన్యజయోధాళితో
నోసువ్యక్తబలాఢ్యులార! వినుఁడీ యుష్మద్భుజావిక్రమో
ల్లాసం బెల్ల నిగూఢవృత్తిగఁ బయ ల్భావింపలేకుండ వి
న్యాసం బొప్పఁగ నేఁగు టిప్పు డుచితోపాయంబుగాఁ జొప్పడున్.

గీ. అతఁడు శాపోపహతుఁ డయ్యె నతని శాప
మునకు నవసానమిదియని మునివచింపఁ

డయ్యో నీఁక నేమి మనకు జయంబు సిద్ధ
మంచు నెంచంగ వలదు తథ్యంబుగాఁగఁ 69

క. ఏమన నీమన సేనా
సామగ్రికి దేవసైన్య సామగ్రి సమం
బై మోహరింప కనదగు
నే మఱి భయమే మటంచు నేమఱి యున్నేఁ. 70

క. వానం దడియనివాఁ డౌ
మాని న్మెప్పించువాఁడు మన కెపు డేమో
గా నేరము సురపతిదనఁ
గా నేరము బుద్ధిపూర్వకమె యది హరికిన్. 71

క. దేవీప్రసాదలబ్ధం
బౌ వాచంయమియె తెచ్చెనో యెచ్చటిదో
పూవుం దండ తెలియం గా
దేవేంద్రుం డెఱుఁగఁ డతని దే యీ తప్పున్. 72

గీ. ఒదవు నల్పాపరాధున కొక్క వేళ
నధికదండంబు నొకవేళ నల్పదండ
మొదవు నధికాపరాధుని కదియు నిదియు
ననుభవముపట్ల నొదవుయథార్థముగ నె 73

గీ. కాన శాపఫలం బంతకట్టి కుడుప
దెంచ శాపవిముక్తి వచించె మునియె

హరియొకలఁడంచువజ్రికాహరియెప్రాప
కుండు గావునఁ దఱిఁ జేర్పకుండు టెట్లు 74

గీ. మఱియు నాతఁడు జిష్ణుఁ డమర్త్యకోటి
కెల్ల నాథుఁడు నోట బాహిరముగాఁగ
దాడివెడలంగఁ దగ దంచుఁ దలఁతు సురలు
పట్టిచేసేతలనె గెల్వఁబడెదు వారె 75

చ. అనవుడు శుక్రుఁ డిట్లనియె నా శరవల్లభ యెల్లభంగులన్
విను వినువీడు వీడి గిరి భేది దొలంగక నిల్చియుండఁ డ
మ్మునివరు శాప మెంతయు నమోఘము గావున నొక్కపూఁటయై
నను రిపుకల్మి బల్మిఁ గొనినం గద బీరము శూరమూర్తికిన్.

తే. గీ. కోరి కైవస మొనరించుకొనఁగఁదగిన
సిరి తనంత నె రా నుపేక్షింపఁ దగునె
మది వలసి వచ్చినను మేనమామకూఁతు
వావిగాదంచుఁ బలికిన వాని కరణి. 77

తే. గీ. బాహిరముగాఁగ సురలపై మోహరించి
జనఁగఁజనదనఁదగు రహస్యముగ నేగి
ముట్టడించి వెస నమ్మహీముట్టడించి 78
శక్రుపద మేలు పదమేలుసమయ మిదియె.

క. అని బోధించి పురందరు
నని సాధించి జయ మూన నభిమత మనుచున్.

దనుజాగ్రణి మది ముద మొం
దనుజాగ్రస్నీతి హేతిధరతతితోడన్. 79

ఉ. బీరము మీఱ మీ రమర వీరులు సారెకు భూరిసార మే
పారఁగఁ జొక్కమైన మెస పారఁగ ధీరగభీరధీర మో
దారతఁ దారతమ్యరహితారభటిం దగఁ దారసిల్ల లే
దో రహిఁదోరమై దనరు దోరహిఘోరతఁబోరితంబులన్ 80

క. ఒక వేళఁ జయము వారల
కొక వేళ జయంబు మీకు నొదవుట గల దిం
తకు మున్నిప్పుడగుం ద
ప్పక మీకు నతండు శాప భగ్నుం డగుటన్. 81

క. ఐన సమప్రతియోధుల
పై నెత్తెదుతటి నిగూఢ వర్తన మొప్పం
గాన నిశీధిని నటుఁ జనఁగానగు
నారు లెఱుఁగకుండఁగా నణఁకువతోన్. 82

మ. అని కావ్యోదిత మైనపద్యమన సుద్యత్ప్రాసవిన్యాసగుం
భనమ త్తేభరథోత్థితాశ్వగతి శుంభద్విక్రమస్థానగో
పనభంగీహృదయంగమం బగుచు దేవద్వేషిసైన్యం బొగిం
జనియె న్నాకపురీనిరోధనసము త్సాహస్ఫుటాహంకృతిన్. 83

తే. గీ. [1]నల్ల ద్రావుడుమూఁకలు నడిచి రేయి
నల్లనల్లన నటరహస్య మగు వృత్తి
నల్ల సుమనఃపురోపశల్యంబు నందు
నల్లరి యొకింత లేకుండ నరిగి విడిసె. 84

సీ. అభిసారికావృత్తి నరిగి వచ్చెడు వేల్పు
మించుఁబోఁడుల నడ్డగించి కదిసి
ప్రోషితాయాతదివ్యులవిమానము లూరు
సేరకుండఁగ లాగి చెఱలఁ ద్రోచి
యపుడె క్రొత్తగ మింటికై యేగు కర్మదే
వతల బిట్టుగ వెట్టిపనులఁ జొనిపి
యింద్రుఁ జూడఁగవచ్చు నితరలోకర్షుల
నట్టిట్టుఁ బోనీక పట్టి నిలిపి
తే. గీ. యొరులు సొరలేని గడితంపు పరిఖ యగుచు
వెలయు మిన్నేటి నీ రెల్ల వెలికిఁ బాఱఁ
గూల మందందగనుమలు గొట్టి కూల్చి
ముట్టడించిరి దితిజు లప్పట్టనంబు. 85

ఉ. ఆపురిచుట్టు గొంద అపు డావల నీవలఁ ద్రోవఁ బోవరాఁ
గుప్పలు గూడి రక్కసులు గొబ్బున నాత్మపటీకుటీతటిం

1. రక్తము ద్రాగువారు; రాక్షసులు.

జొప్పడుచప్పరంబులఁ బశుప్రకరంబుల జోయ లోయనం
దప్పక రాటకొక్కనిగఁ ద్రాటఁ బిగించిరి ఖేటకోటులన్ 86

మ. వరుసం దానవు లన్నిలింపవరు సంబంధంబుచే నొప్పన
మ్మరుదారామకుజంబులం దమరుదామక్షౌమభూషానులే
పరసాదుల్మణిగోహయద్విపరసా వాసాదులున్ వమ్మ చే
సిరి వీఁకన్ ఖలకోటి. కన్యసిరి వీక్షింపంగఁ జూపోపునే. 87

సీ. మీఁదిమేడలపై రమించునిర్జరలోక
 [1]పల్లవుల్ పైనుండి పైకిఁ బోవఁ
గ్రిందిమిద్దెలఁ బాన్పులందున్న రణహతా
 గతరాజు లాయుధప్రతతి వెదుకఁ
బెరటిపంచలలో జపించు సోమాసులు
 దిడ్డిగంతల ద్రోవఁ దెఱచి పోవ
లోనిసావళ్లఁ బొర్లుచు నున్న యితర పు
 ణ్యుల మూఁక లిఱుకు సందులను దూరఁ

తే. గీ. గహకహార్భటిఁ జెల రేఁగి గములుగట్టి
 తెగువ నింటింటికొక కొందఱుగఁ గడంగి
 రక్కసులకూటు వొక్కటనుక్కు మిగిలి
 సురనగరి వేశవాటంబు సొచ్చె నపుడు 88

1. విటులు.

మ. ఇది ఖత్థమ్మని యెంచు కేని మది నూహింపంగ రాకుండుటం
ద్రిదివౌకశ్ప్రకరంబు లేమి యెవరే రీ యేల యీ గోల య
ల్లదె యచ్చోనిదె యిందెపో యనుచు యాతాయాత వీతోత్తరీ
యుదశం బ్రాటిలఁ దలడిలె నగరం బాబాల గోపాలమున్. 89

శా. ఆకోలాహల మాలకించి దివిజాధ్యక్షుండు రక్షోగణో
ద్రేకం బౌనిది యంచు నెంచి యనలార్కిప్రఖ్యాది క్ష్మాపాలకా
నీకంబుం బిలిపించి యిప్పుడె సమున్నిస్సాణ ఘోషార్భటి
న్నాకానీకిను లెల్లఁ గూడుకొను సన్నాహంబు సేయుం డనన్. 90

సీ. సోఁకినఁచో లెల్ల సురసురఁ బెగ మాడ్చు
వహ్ని యుద్యత్ప్రతాపమున నెగడెఁ
సకలజీవుల నంతకవృత్తి భయదుఁ డౌ
యముఁడు మృత్యుసమేతుఁ డగుచు నడచెఁ
బచ్చిరక్తముఁ ద్రావు పలలాశ నుండైన
నైఋతుం డతిభీషణతఁ గడంగెఁ
దనవారి బలిమిచే తనె గుభాలున ముంచు
[1]పాశి వాహినుల వెంబడిగ నెదిరె

తే. గీ. జగము దూలింపఁగల ప్రభంజనుఁడు రేఁగె
భూరిసారంబు దనరు కుబేరుఁ డేగెఁ

1. యముఁడు.

గంటమంటలఁ జిలుకు ముక్కంటి గదిలె
వారి వెనుకొని గీర్వాణవర్యుఁ డరిగె. 91

క. అయ్యభియోగము గని తొలి
దయ్యపుజోదులును బాహుదర్ప మెలర్పం
జయ్యనఁ బిఱుతివియక గడి
కయ్యమునకుఁ గాలు ద్రవ్వికవిసిరి కడిమిన్. 92

గీ. వ్యోమచరు లొట దైవతయోధు లపుడు
చదలున నెయుండి పోరికి సంభ్రమింపఁ
గ్రామచరు లొట రాక్షసగ్రామణులును
బలసి యుండిరి మింట నేప్రతి ఘటించి. 93

శా. నేమి స్వానవిహీనమై బలయుగీ నిర్యద్రజశ్శూన్యమై
వ్యోమర్ధ్వప్రచరద్విమానరహితం బై నారదారబ్ధగా
నామోదభ్రమణాదివిభ్రమవిశేషాపేతమై వారిసం
గ్రామారంభము చూడఁ జొప్పడెఁ నపూర్వప్రక్రియానక్రమై. 94

మ. సరిగా నయ్యిరువాఁగు జోదులు యథేచ్ఛన్ డాసి పేఁకం బర
స్పరశస్త్రాస్త్రనిపాతనంబులను లేశంబైన లో గాసి చెం
దరు బింకంబులవాసి డిందరు ప్రసిద్ధప్రోద్ధతిం జేసి ప్రమ
దరు పొంకంబులఁ బాసి కుందరు రణోద్యత్సాహసోత్సాహులై.

ఉ. ఆసమరాంగణంబున జయాపజయంబులు రెంటిలోన దే
వాసుర లెద్ది యెవ్వరికి నౌనొ యెఱుంగఁగరాక యుండ నా

నాసలఁ జేసి గెల్చినవనై తగఁ బోర నదృశ్యరూపుఁడై
వాసవుఁ డున్న తావునకు వచ్చి గురుండు వచించె నిమ్మెయిన్. 96

శా. ఓ విబుధాగ్రణీ! యెఱుఁగవో! మునిశాప మమోఘ మాటచే
భావిజయంబుతో రిపుల పాలగు నీసిరి యంచు వేగమే
యావల శ్రీవధూవరుకటాక్షమునన్నినుఁ జేరునంచునుం
గావున సేన నిట్లువితగా వెతఁగాఱియవెట్ట నేటికిన్ 97

మ. పోరం బోర నమర్త్యసేనలకు గెల్పుం జావునున్ లేమిచే
రారా పాక్కటిమాత్ర దోఁచు నతిమాత్రక్రూరదుర్వారదు
ష్ప్రారంభు ల్దితిజు ల్మడంగియును వీరస్వర్గముం జెంది యా
త్మారాళిత్వము వారు రేమి ఫలమీ వ్యర్థప్రయాసంబునన్. 98

ఉ. కావున నిప్పు డెందయినఁ గన్పడకుండఁగఁ డాఁగి యుండి నీ
వేవిధినైనఁగాని విధునే భజియించుచు నుండు మాతఁడుం
దైత్యకోటిపై నెనయు దప్పఁడు తప్పడుగంటఁ ద్రోచు దై
త్యావళి భ్రమందఁ జేయు నని యంద ఱెఱింగిన చందమే కదా. 99

క. అని తనగురుఁ డుపదేశిం
చిన విని యనిమిషవరుండు శ్రీహరిఁ గొలువం
జనియెన్ మందరశిఖరికి
జనియించిన ధృతి స్వపక్షసంగతుఁ డగుచున్ 100

మ. అంతన్ దానవసైన్యనాయకులు ప్రత్యర్థు ల్పటాపంచలై
యంతర్ధానము నొంద నెం దరిగిరో యంచు న్నిరూపింపలే

కెంతే నే లిదె చాలదే విముఖులై యింద్రాదికుల్పాఱ ని
శ్చింతం దత్పురమాక్రమింపఁ గలిగెన్ శ్రీశంభుశుంభత్కృపన్.

చ. మన బలిరాజుకోల్తల కమర్త్యులె నిల్వక పాఱి రన్నచో
మనుజు లనంగ నెంతపని [1]మానుషభుక్తి నాతఁ డేలుఁ బే
ర్కొని గణుతింప నేటి కురగుల్పురగుల్గద వాని దృష్టికిం
బనివడి ముజ్జగంబు లిట్లపై నతఁ డొక్కఁడె ప్రోచుఁ జక్కఁగన్.

క. అని సంరంభవిజృంభణ
మున స్వర్గపురప్రవేశమునకు ముహూర్తం
బును శుక్రుం డిడి యెదుటం
గనుపట్టం బట్టనాట్ల గత్తులై రసురుల్. 103

సీ. పుట్టినది గోలె నసుర సమూహమునకు
నాత్మల సురాలయప్రవేశాభిలాష
కలదు గావున నది యబ్బెఁ గాని యప్పు
[2]డాసవామోద మింతైన నబ్బదయ్యె. 104
వేశవాటమందు నిడివడి పూర్వదే
వేశభటులు చటుల వృత్తితోఁ బ్ర
వేశ మొనరఁ జేసి వేల్పుసానుల మదా
వేశగరిమఁ బట్టె వెదకు నపుడు. 105

1. మనుష్యులను తినుట. 2. మద్యపానామోదము.

సీ. ముద్దుగుమ్మలు మేళమున కేగ నింటికా
వలి యుండు ముసలిపాపలును లేరు
[1]గోవాండ్రతో సందు గొందుల గుసగుసల్
సలిపెడి తాపి కత్తెలును లేరు
కన్నుసన్నలవీథి గడపల [2]లేబొజుం
గులనాస గొల్పు కన్నెలును లేరు
సవరింపఁదగు పనుల్సమకూర్చు నాడిగం
బులకుఁ జేరిన బానిసలును లేరు

తే. గీ. సాను లెట పోయిరో వాండ్రతోనె వీండ్రు
దరలి రని తోఁచుఁ దెఱచిన తలుపులెల్ల
దెఱచినట్లనె యుండె నద్దిర యటంచు
మిగుల విసివిరి రక్కసిమిండ లపుడు. 106

పిల్లి పొర్లించి త్రావినపాలకుండనా
నమృతకుండము శూన్యమై తనర్చె
నూనె చట్టుపు నేల నుయినాఁగ సురగవి
పొదుఁగు పయోహీనముగను దోఁచెఁ
జెలఁది గూండ్లిడిన మ్రాకులు వోలెఁ గల్పవృ
క్షములు నిష్ఫలములై కాననయ్యె
నుండు వేసవినాఁటి మడుఁగునా మన్నేటి
యిసు లెండి బీఁటలై యడుగుఁ జూపె.

1. ప్రాయపు వారు. 2. విటులు.

తే. గీ. నమర నమరావతీపట్టనమును విడిచి
సకల విబుధవ్రజంబుతో సత్పథమునఁ
బొదలు నలరాజు వలసలు పోవఁ దఱిమి
యసుర విసరంబు విడివడి యాక్రమింప. 107

సీ. నందనోద్యానంబు నందనోకహసమూ
హం బవకేశిభావంబుఁ గనుట
మందురామందిర మందు రాజిలు తేజు
లెంతేసి జవశూన్య వృత్తి గనుట
నాలానబద్ధశుం డాలానవద్యాసం
ఘాత ముద్వాంతవైఖరిని గనుటఁ
గామయానతమించు వ్యోమయానంబు లు
డ్డీనసామర్థ్యైక హానిఁ గనుటఁ

తే. గీ. నరసి నిరసించుకొని రాత్మలందు వట్టి
గొడ్డు తాకట్టువిడువఁ గైకొనఁగ వలదు
దొంగిలింపంగఁ బోయిన మంగలంబు
దొరకెనను మాడ్కినంచు దైత్యులువిరక్తి 108

చ. దితిసుతకోటు లిప్పగిది దివ్యులపట్టన మాక్రమించి య
ప్రతిహత రీతి ఖ్యాతిగల రాజగృహంబున రాజు నార్యస
మ్మత మగు మంత్రిగేహముల మంత్రులు జోదుల యిండ్ల జోదు లం
చితగతిఁ దత్తదర్హులు వసించిరి తత్తదగారసీమలన్. 109

మ. అసురస్తోమము సామదానరహితం బై భేదదండద్వయం
బెసఁగన్ వేల్పులపట్ల ధార్ష్ట్యమున నుజ్జృంభించి యభ్యంచితా
ప్తసమూహంబుగ నింద్రుమందిరమునం దత్రత్యసిద్ధప్రదే
శసమాలోకనకౌతుకం బడర సంచారంబుఁ గావించుచున్. 110

సీ. కట్టించుకొనినాఁడు కద వైజయంతంబు
తన కేమొ యిది శాశ్వతం బటంచుఁ
గావించెఁ గద [1]యోలగము సుధర్మాస్థాని
తన యధికారంబె తప్ప దనుచుఁ
బాలించెఁ గద స్వర్గపట్టనం బేపట్టు
నను దన కదియె కాణాచి యనుచుఁ
గొలిపించుకొనెఁ గదా నలపించి యప్సర
స్సతులచేఁ దన పెంపె సత మటంచు

గీ. నౌర యీ యింద్రుఁ డిప్పు డెందరిగె నోకొ
మనలఁ దోలి వేలుపులమాట మఱియు సవతి
తల్లికొమరుల మాటఁ దత్స్వర్గరాజ్య
మెల్లమన కనుభోజ్య మం చెఱుఁగఁడోకొ. 111

అనుచు నమరేశ్వరసమృద్ధిహరణరూప
కాభిమతసిద్ధిజనితధన్యత్వబుద్ధి

1. కొలువు కూటము.

శుద్ధమాత్సర్యగుణసమాబద్ధ మగుచు
నుద్ధతత్వంబుఁ బ్రకటించుచుండు నంత. 112

సీ. మునుమున్నె లేవయ్యె నెనసియుండిన హవి
ర్భాగముల్ సురలతోఁ బడయుఁ దమకు
సమకూర లేదయ్యె నమృత మింద్రునితోనె
యంతర్హితం బౌట నపుడు భుక్తి
యందుండి యెట కేని యరుగంగఁ బ్రతిబంధ
కం బయ్యె నాత్మీయకర్మపాశ
ఘోరమైన నచ్చోటనే యుండవలె నన్న
దుస్సహం బయ్యె దైత్యులకు బాధ

తే. గీ. యయ్యయో యిట్టి దశ గల్గె నయ్యయోగ్య
మైన యధికారమునఁ దప్పదయ్యె "స్వర్గ
మునకుఁ బోయిన నోఁడి యేమ" లను విశ్రాన
ననుచు వగఁ జెందెఁ గర్మదేవాళి యపుడు 113

ఉ. ఆమెయి నాకలోకవిభవాక్రమణం బొనరించి దానవ
గ్రామణి దానవత్ప్రథమగణ్యయశం బనిశంబునుం ద్రిలో
కీమహనీయమై వెలయఁ గేవల ధీవిలసత్ప్రభావుఁడై
స్వామిహితైకతంత్రులగు వారల మంత్రులు గాఁగఁ గైకొనెన్.

చ. స్వజనములోఁ బరస్పరము స్వప్నమునందున మత్సరత్వముం
బ్రజల కొకళ్లొకళ్లకును భావములం గలహప్రవృత్తియుం

బ్రజనితమైనచో విభుఁడె [1]బన్నము నొందు టెఱుంగుఁ గాన న
గ్గజిబిజి లేక యుండ నధికార మొనర్చె సమర్చితార్యుఁడై. 115

ఉ. ఎవ్వరి నెట్లు మన్పఁదగు నెవ్వరి నేక్రియ గారవింపనౌ
నెవ్వరి నేవి తానఁ దనియింపఁగ వచ్చును వారి నెల్లఁదా
నవ్విధి నాదరం బెసఁగ నారసి ప్రోచిన సుస్థిరంబుగా
నివ్వటిలు౯ విభుత్వమను నీతిఁ జరించు నతం డతంద్రుఁడై. 116

గీ. అతఁడు బలియును బుణ్యజనాగ్రగణ్యుఁ
డమితకర్బురసముపేతుఁ డగుటఁ జేసి
యరసి యాత్మీయులకు నెల్ల నభిమతార్థ
సిద్ధి గావించుచును బ్రోది చేయుచుండె. 117

క. ఇచ్చోట వియచ్చరపతి
లచ్చిమగని ప్రేమ గని తలంపునఁ గల యా
గ్రచ్చర లాదవించుకొనం
దచ్చరణశరణ్యవృత్తిఁ దగ వర్తిలుచు౯ 118

సీ. ఉరుతరమణికిరీటోత్తమాంగము వాఁడు
ఘనసన్నిభోత్తమాంగముల వాఁడు
బాహాంతరాళసంభరితత్పలము వాఁడు
వటదళాహ్వాబ్ధితల్పముల వాఁడు

1. భంగము.

కమనీయఘనకనత్కనక నేత్రము వాఁడు
ధవళాబ్జపత్ర నేత్రములు వాఁడు
పరిపాలితానేక భక్తచక్రము వాఁడు
ంచక్రముల వాఁడు

గీ. అంబుజప్రియకోటిధామంబు వాఁడు
మౌనిహృదయవికుంఠధామముల వాఁడు
విధికి నిగమంబు లొసఁగిన విభుఁగ నాదు
సిరుల నాకిడి యెపుడు రక్షించునొక్కొ. 119

ఉ. ఎవ్వఁడు విశ్వ మెల్ల సృజియించె విరించనరూపధారియై
యెవ్వఁడు ప్రోచుచుండుఁ గమలేక్షణుఁడై యుపసంహరించు వాఁ
డెవ్వఁడు రుద్రరూపమున నీభువనస్థితి నస్మదాదులం
దెవ్వఁడు నివ్వటించె నతఁడెప్పుడు నన్ గృపఁ బ్రోచుఁ గావుతన్

మ. తన కేకృత్యములం దొకింతయును స్వాతంత్ర్యంబు లే దీశ్వరుం
డును సర్వజ్ఞుఁడు సర్వసాక్షి భగవంతుం డైన యాశౌరి దే
వుని యెవ్వండు ప్రపన్నుఁడౌ నతని స్వీయత్వాభిమానంబుచేఁ
గని రక్షించు ముకుందుఁ డేల నను జుల్కం జూచు నప్పట్టునన్

క. అనపాయనియై సిరి యె
వ్వని పాయనికరుణఁ దోడుపడ లోకములన్
గని కరముఁ బ్రోచు నాతని
కనికర మింక నెపుడు పడయఁ గలుగు నో నాకున్. 122

మ. అని యీరీతి నమర్త్యనాథుఁడు ప్రపంచాతీతసామర్థ్యవ
ర్తనుఁడౌ శ్రీహరిదివ్యమంగళపవిత్రశ్రీచరిత్రంబు లె
ల్లను గీర్తించుచు నార్తి మీఱఁగ బునర్లక్ష్మీప్రసాదార్థియై
యనిశంబున్ మది నాదిదంపతుల నే ప్రార్థించు చున్నంతలోన్.

క. అరుదెంచి గురుం డప్పుడు
హరిహయుఁ డప్పగిది దీనుఁడై యుండిన క్రియ
యరుదెంచి భగవదిచ్ఛా
పరిణతికిం దిరుగు లేమి భావించి యనున్. 124

చ. పురుషుఁడు దానె కర్త నని పొంగుట యెంతయు బుద్ధిలోప మీ
శ్వరుఁ డఖిలప్రపంచపరిపాలకుఁడై నిఖిలాంతరంగముం
దిరుఁ డయి కర్మవృత్తులు జనింపగఁ జేసి స్వతంత్రశక్తి చే
సరవిగఁ దత్ఫలంబుల నొసంగుచు నొక్కఁ డెసంగు లీలచేన్. 125

ఉ. వచ్చును మేలొకప్పు డటు వచ్చును గీడు నొకప్పు డంచు నే
లిచ్చఁ దలంపకుండు నరుఁ డెవ్వఁడు గీడుఁ దలంచు వాఁ డెవం
డెచ్చును దగ్గు లేక ఫలియించు శుభాశుభకర్మసంచయం
బచ్చుపడంగఁ గర్మతతి యప్పరమేశ్వరులీలచే నగున్. 126

సీ. [1]గ్రావ సంఘంబులాఘవ మొందుఁ దూలము
ల్గౌరవ మొందునక్కజముగాఁగ

1. రాళు.

స్థలవిభాగములు కచ్ఛములై నరూపముల్
మరుభూములగును విస్మయముగాఁగ
నాఢ్యుఁ డకించనుం డగు నిర్ధనుండు మహా
ఢ్యత్వంబు నొందు న[illegible]ంబుగాఁగ
స్థాసియతతి యరణ్యానీత్వము వహించు
విపినముల్ పురములౌ వింతగాఁగ

తే. గీ. చిత్రచిత్రప్రభావైక పాత్రుఁ డైన
యీశ్వరుని శక్తిచేత నీ యింద్రజాల
మును గనుచునుండి పురుషుండు తనకెంత
శక్తిగలదని భ్రమయు నాశ్చర్యముగను. 127

క. పెట్టి మును పెద్ది యిపు డది
పుట్టుట తాఁ దాల్మిగానఁ బురుషుం డెదలోఁ
బెట్టకయుండిన యర్థము
పుట్టమి కైవగల మిగులఁ బొగులఁగ నేలా. 128

చ. ఒకఁ డుపకారముం జలిపె నోరువఁ జాలక కిన్కనంచు నే
రొకఁ డుపకారముం జలిపె నొప్పగు ప్రేమ దలిర్ప నంచు నా
రక పరులందుఁ బెట్టు నది ప్రాజ్ఞతయే తన చేసికొన్న చేఁ
తకు ఫల మప్పు డప్పు డగుఁ దప్ప కటంచు నెఱుంగ కక్కటా

క. ఎప్పు డెపు డెద్ది యొనర్చిన
నప్పు డపుడు ఫలించు నదియె యని యెంచినచో

నుపశాంతి నొంది మానస
మపరిమితానందమగ్నమై తనివిఁ గనున్ 130

క. కావున నో శ్రీవల్లభ
కావు ననుం గృప నటంచుఁ గని వేఁడినచో
నావంత మనములో నిఁక
[1]నావంత మనము వహింప మవ్విభు కరుణన్ 131

క. అరిదరకరుఁ డగుహరి యిపు
డరిదరకరుఁ డగుచు నీకు నభయం బిడునో
సురవరదానవరిపుభా
సురవరగారుణ్యగరిమ చొప్పెఱుఁగ వొక్కో 132

గీ. అపుడు పరిసరవర్తులైనట్టి సురలు
దివిజవిభుఁ గాంచి యొజ్జలు తెలిపి నటుల
భక్తవత్సలుఁ డగు పర వాసు
దర్శన మొనర్ప కిం దేల తడవు సేయ. 133

చ. అనవుడు దేవభర్త చతురాస్యునకైన నలభ్యమైన యా
ఘనునిపదాంబుజంబులను గన్గొను నంతటిభాగధేయమా
సనకసనందనాదు లగు సంయమివర్యులలో నొకండనో
యనవరతాత్మబోధభరితాత్ముఁడనో యెటు నాకుఁ జొప్పడున్.

1. ఆవగింజంత.

శా. ఆవైకుంఠ పురాధిరాజవిభవం బామూలచూడంబుగా
నే వేమాఱులు సన్మునీశ్వరులు వర్ణింపంగ భక్తిస్ఫుర
ద్ధీ వింటిం గనుఁగొంటి నొక్కతఱి వాగ్దేవాదు లేగంగ నే
నీవాచస్పతి మున్నుగాఁ జని దిశాధీశానుషక్తుండనై. 135

క. అప్పటి నాచొప్పెప్పుడుఁ
జెప్పఁగ లేదయ్యెఁ గాని చెప్పఁగ వలసెం
దప్పక యిప్పుడు మీతో
నప్పురి మాయూరుఁ బేరునడిగెన యొకఁడున్ 136

సీ. కడుపునఁ గన్నట్టి కొడుకైన బ్రహ్మకు
వెలుపలి పూఁదోట విడియఁ గలిగెఁ
బులహపులస్త్యాది మునిసంఘము వసించె
గరుడముఖ్యుల గృహాంగణములందుఁ
గథలఁ గాలక్షేపకరు డౌట మన యొజ్జ
లక్కడక్కడ నిత్యయాత్ర జరిపె
నేను విష్వక్సేను నింటిపంచటరంగు
నందు నిల్చితిఁ దదీయాజ్ఞ నడసి

తే. గీ. విప్పి దిక్పాలకులచొప్పుఁ జెప్పనేల
విరజదరులందునిరవొందు తరుల జాడ
నిలువనీడయ్యె వారి కన్య లగునట్టి
యమరులకు నందు. నామరూపములుఁ గలవె. 137

సీ. ఉపనిషద్విద్యార్థముపదేశ మొనరించు
రాజకీరము గిశోరములఁ గూర్చి
సామగానక్రియా సామర్థ్యమును దెల్పు
బుంస్కోకిలము శాబములను జేర్చి
హరినామకీర్తనం బభ్యసింపఁగఁ జేయు
శారికదారికా సమితిఁ గదిసి
ప్రణవనాదబ్రహ్మపరతత్త్వ మెఱిఁగించుఁ
బుష్పంధయముడింభములను డాసి

తే. గీ. యచట నుద్యానతరువుల నధివసించి
సంతతానందతుందిల స్వాంతవృత్తి
నిర్విచారప్రచారంబు నివ్వటిల్ల
శౌరికరుణాకటాక్షప్రసారమహిమ. 138

చ. గరుడుఁడు శేషునిం దరియఁగాఁ దన కోఱల దువ్వఁ జట్టుప
ల్గురుదనిలాంకురాన్న కబళంబులఁ దృప్తిగ వేయునోళ్ల నా
విరిఁ దగు నేర్మిఁ డాసి తిలకించు నతంపును నిచ్చలుం బర
స్పరకలహంబు కల్మిగల పట్టునఁ బుట్టునె మెట్టివేళలన్ 139

మ. ఘననీలాపఘనంబులున్ భుజగతల్పంబుల్ పయోజాతలో
చనముల్ గౌస్తుభభూషణంబులును భా స్వచ్ఛంఖచక్రంబులున్

వనమాలలఁ గనకాంబరంబులును శ్రీ వత్సంబులుం గల్గి వా
రును వీరంచును వేరులేదు [1]హరిసారూప్యాంశు లందందఱున్.

క. కలశీహృతవిరజామల
జలశీకరసేకరచిత సంస్థులతాంచ
ద్దలశీతలతులసీవన
తలసీమ మెలంగు ముక్తతతులం దెపుడున్. 141

సీ. కోమలతులసీసరామోచన శ్రీమ
హిమవిచారణవృత్తి నెసఁగు వారు
ధవళమృదూర్ధ్వపుండ్రవిశేషకవిశేష
ధారణగోష్ఠిచేఁ దనరు వారుఁ
గల్యాణగుణగణాఖండతరాను సం
ధానచింతనచేఁ దనర్చు వారు
నిత్యసూరిసమాజ నిర్ణీతహరితత్త్వ
సిద్ధాంతఘణితిఁ జర్చించు వారు

తె. గీ. నగుచు నెందెందుఁ బరికింప నందు నందు
నెగడు నిత్యవిభూతిఁ జెందిన యనేక
దాససంఘ మప్పరమపదంబునందు
నందడిగఁ గ్రందుకొని మహానందగరిమ. 142

1. విష్ణువుతో సమాన రూపముగలవారు.

గీ. అందు గోవిందదివ్యపాదారవింద
యుగళసందర్శనస్పృహా నిగళబద్ధ
దశ వసించితి నమితవత్సరము లేము
లేము లేమున్న నదీ నెడలేదు నటంచు. 143

గీ. అది యఖండతరప్రకాశాభిరామ
మగుచు నిది పవ లిది రే యటంచుఁ దలఁప
రాని సచ్ఛాటిఁ గాలనిర్ణయము సేయఁ
దగుము గాదయ్యె మన బుధగురున కైన. 144

క. అటులుండఁగ నా మనమున
ఘటయిల్లె నొకింత విసువు కటకట యిట్లీ
చ్చటు నిల్చి యెన్నినాళ్లో
యటమటగా నున్న దనుచు నవివేకమునన్. .45

క. పురిఁబౌర సమాజంబుల
దరిఁ గాలక్షేపమునకుఁ దరియం జన నె
వ్వరునైన నించుకైనను
బరికింప రటన్నఁ బలుక భావింతు రెటుల్. .46

గీ. ఒక్కతఱి నొక్కరుండఁ బురోపశల్య
వనులవనపాలురైన నానంకఁ జూచి
పలుకరించిన నుబుసుపోవచ్చు ననుచు
సంచరించుచు నిటు మది నెంచుకొంటి. 147

సీ. నిత్యకృత్యంబుగా భృత్యభృత్యులనైన
కార్యకారులటంచుఁ గాంచు కష్ట
మేపూఁట కాపూఁట కెక్కుడు గుమ్మంబు
దిగుడు గుమ్మంబుగాఁ దిరుగుశ్రమము
నెవ్వరైన స్వామికి నెఱిఁగింపరో కో యంచుఁ
బ్రతిహారుల భజింపఁ బడుశ్రమము
నేదారి [1]వాహ్యాళి కేతెంచు భగవంతుఁ
డని యిటునటుఁ ద్రోవలరయుక ని

తే. గీ. కటకటా యిట్టిదనుచుఁ జెప్పుటకుఁ దరమె
విసుపు పుట్టించు నాశ్రయవృత్తి యెట్టి
వారి కైనను బ్రాపింపవలదు కార్య
పరుల కెచ్చోట నిట్టివేఁబాము లనుచు 148

సీ. ఎవ్వరైన నడినడి నెదుటగా నేతేర
ననుఁ బిల్చుటకె వత్తు రని తలంతు
సఫలప్రయత్నులై చనువారి వార్తలు
విని నాకు నిటు లెప్పు డని తలంతు
నగరి మోసలకేవి నడయాడువారి నె
ల్లను స్వామివల్లభు లని తలంతు

1. విహారము.

సీ. ఒకటి రెండు జగంబు లొక్కండె వేఁడేలు
వాఁడె సంతను గర్వపడుచునుండు
నిట్టివి పదునాల్గు సృజియించిన విరించి
యేమూల నుండెనో యెఱుఁగ రెవర
మట్టి బ్రహ్మాండంబు లమితసంఖ్యలు సృజిం
పను బెంప నణఁగింపఁగను సమర్థుఁ
డైన శ్రీరమణుపాదాబ్జముల్ దిలకించు
స్పృహయను నిగళంబు చేత గట్టు
తే. గీ. పడియె నఁట దానుముక్తుఁ డే పడయఁ దగిన
ఫలము బద్ధున కేరీతిఁ గలుగు నొక్కొ
యని తలంపక తన కబ్బు నని తలంచు
నెంత మూర్ఖుండొ పీఁడించు నేనగించి. 153

క. హరిపదసందర్శన మఁట
దురహంకారాతిరేక దుర్గలితహృదం
తరుఁ డగు దన కఁట వెస నది
దొరకమి కొక్కింత వినుగు దోఁచెనఁట కటా 154

సీ. బహుజన్మవాసనాపరిపాకసంలబ్ధ
నిశ్చలాత్మజ్ఞాననియతిఁ జెంది
భగవదర్పణముగా భావించి సత్కర్మ
ముల నొనర్చుచు వినిర్మలమనీష

సకల భూతములందు సమత వర్తించుచు
శాంతుఁడై దాంతుఁడై సంతతమున
సర్వజ్ఞభావంబు సార్వత్రికత్వంబు
సర్వేశ్వరత్వ మీశ్వరుని దనుఁచుఁ
తే. గీ. తెలిసి సంతతసత్సంగ విలసనమున
సొరిది నిస్సంగుడై ద్వంద్వశూన్యవృత్తిఁ
బరమ భాగవతుం డైన వాఁడు కాని
శ్రీహరిపదంబు నందఱుఁ జెందఁగలరె. 155

శా. తా నెవ్వాఁ డట సేవకత్వమున నిత్యంబు న్నిజస్తోత్రవి
న్యాసం బొప్ప బుధవ్రజంబు దనకే హద్వారపార్శ్వంబునం
దీ సంక్రదను దర్శనం బెవుఁడు చేయించుం బ్రతీహారియం
వాసం జేసి వసింపఁ గోరు నఁట వీఁ డత్యంత గర్వాంధుఁడై.

క. అని యాడు కొనెడు మాటలు
విను నప్పుడు నేను మిగుల విస్మయలజ్జా
వనతాస్యుఁడనై వానికి
వినతాంగుఁడ నగుచు విన్నవించితి నిట్టుల్ 157

ఉ. శారికలారా! శారికడ సారెకుఁ జారుకథార్థముల్ మనో
హారికలారసస్ఫురణనద్భుతభంగి నెసంగు నట్లు గాఁ
గోరికలారఁ దెల్పుచును గూరిమి గాంచెదు మీర లీ జగ
ద్భూరికలారహస్యముల పోఁడిమి బుద్ధి నెఱుంగు టబ్రమే. 158

క. ష నెప్పుడు హరిపదసి
ధ్యానము గావింతు నొకొ యని మదిలో నెం
దే నెప్పుడును దదేక
ధ్యానమున నె యుంట మీ హృదయ మెఱుఁగ నొకో. 159

గీ. శౌరిపదదర్శనవ్యాప్తిఁ గోరి వచ్చి
యింతకాలంబు నిందుంటి మిందఱమును
మా యుదంతంబు నొక్కింత మాత్రమైన
స్వామి కెఱిఁగించు వార లెవ్వారు లేరు. 160

గీ. మాకు నద్యోపదముల కమ్మాధవుండె
ప్రోవఁ డనుచు నధికారముల నొసంగె
భక్తినే మమ్మహాత్మునియుక్తిఁ జేసి
పాదుకొనియుంటి మయ్యాయి పదములందు. 161

క. ఈవఙ్మపున నే మెల్లను
శ్రీవల్లభుదివ్యపదము సేవింప నదిగా
భావించి వచ్చి యిచ్చట
నేవిడియుట నచటి చంద మే మయ్యెనొకో. 162

చ. అన విని వానిలో నొక విహంగము నవ్వి యెంతమాట నీ
మనమునయందు నెప్పుడు రమారమణాంఘ్రిసరోజయుగ్మద
ర్శనకుతుకంబె కాని యితర స్పృహలేమియు లేమికి న్నిద
ర్శన మిదె చాలు నింటికడ చందము లందలి చింత యొప్పదే.

చ. పదపద నీకు జూడ భగవత్పదదర్శన మేడ బ్రహ్మల
హృదయములు పంచలం దిరిగిపోవుదు "కేనుఁగు తేటఁ గ్రుంకుచో
వదలక పాటి కే సడుగ వచ్చెను నక్క" యటన్న భంగి ను
న్నది కద నీదు చందము వినందగ వింకిట్ల మాకు నీ నుడుల్. 164

చ. అనుచుఁ దృణీకరించి తెగనాడిన రెండవయండజంబు న
న్గని వచియించె నీకిపుడు గల్గదు నీయభిలాషసిద్ధి యె
వ్వనికి లభించె మున్ను భగవత్పదదర్శన భాగ్య మెంతయున్
ఘన మగు ప్రాజ్యరాజ్యమద గర్వము సర్వము నీడు నంతకున్.

సీ. స్వామి సన్నిధిఁ దెలుప నెవ్వాడు లేర
టంచుఁ బల్కితి వింతయూ నోర శౌరి
యనఁగ సర్వజ్ఞుఁడతఁ దెలుంగ నివి గలవె
యింత యజ్ఞాని వేమిర యింద్ర నీవు. 166

గీ. అతఁడు ప్రాకృత నేతలగతిని మనవి
దెలుపఁ దగువాఁడె భక్తులు దలఁపఁ దోఁచు
నప్పు డిప్పుడు నందిందు నతని కతని
కనక యొప్పుడు నందంద నందకీను. 167

ఉ. మంతనమంచుఁ గొన్ని మటుమాయల మాటలఁ జెప్పి ప్రువ్వ్వు ట
య్యంతిపురంపుటూడిగపు టన్నులమిన్నల నాశ్రయించు ట
త్యంతముఁ గార్యసాధనములోఁ గలికాలపుఁ బ్రాకృతావనీ
కాంతులపట్ల నట్లనె జగత్పతియూ హరిపట్ల నెంచితో 168

చ. [1]ఉపచితిపాత్రుఁ డార్యుఁడు సమున్నతకీర్తి యుదాత్తమూర్తి వా
జ్ఞిపుణుఁడు ప్రత్యయాస్పదుఁడు నిర్మలచర్యుఁడు ధైర్యధుర్యుఁడా
త్మపరబలాబలజ్ఞుఁ డసమప్రతిభాంకుఁడు నైన నీ గురుం
డెపుడుఁ ద్వదీయకార్యఘటనైకరతిం దగు నీతిచాతురిన్ 169

క. నిరతంబుఁ దదనుమతికృతి
నిరతం బగు చిత్తవృత్తి నిరహంకృతివై
కరణీయంబుల భృత్యుని
కరణిం గావింతు వేని కరుణించు నినున్. 170

క. అని బుద్ధిఁ గఱపి పొమ్మన
మన పురికిం గురుదిగీశ మండలితోడం
జనుదెంచి యచటి వార్తలు
వినవిన స్మయ ముడిగె మదిని విస్మయ మొదవెన్. 171

ఉ. పౌరుల నెల్లరాఁ బిలిచి పచ్చితి మిచ్చటి కిన్నినాళ్లకే
మీరలు నందఱున్ సుఖులె యెప్పుడు నొప్పగ మా నియోగముల్
సారెకు నప్రమాదగతి సల్పుచు నుందురె క్రూరదైత్యులె
ద్వారను దాఁటి రారు గద వచ్చిన వారల నోర్తురే కదా? 172

సీ. వైజయంతము పొంత వర్తింతు రెవ్వార
లెవరు సుధర్మ చెంత వసియింతు

1. వృద్ధినొందువాఁడు.

రమృతకుండోపాంతమం దుండు రెవ్వరు
కామధేనువు దొడ్డిఁ గాతు రెవరు
సురమందిరమున నెవ్వరు కావలిగ నుండ్రు
చింతామణిని బరీక్షింతు రెవ్వ
రైరావతముఁ బ్రోదిసేయు వా రెవ్వార
లుచ్చైశ్శ్రవముఁ ద్రిప్పుచుండు రెవరు
తే. గీ. నందనవనమ్ముఁ బరికించు చుండు రెవ్వ
రెవరు మందాకినీతీర సవిధవివిధ
మణిఖచిత వేది సోపాన మంటపములు
శిథిలములుగాక యుండ వీక్షింతు రెపుడు. 173.

సీ. ఇచ్చోటి కెప్పుడైన విచ్చేయుచుండు నే
స్వైరసంచారుఁడౌ నారదుండు
మునితపోవిఘ్నార్థముగ నిల్పఁబడిన య
ప్సరలు వర్తింతు రే సఫలగతులఁ
బుణ్యకర్మఫలానుభూతి కై రా వ్యోమ
యానముల్ సుకృతుల కనుపఁ బడునె
దైత్యనాథుల రాజధానులఁ ద్రిమ్మరు
ప్రణిధులు వత్తురే వార్త లరసి
తే. గీ. యాశ్వినేయులకై పథ్యమమను మన్న
పుష్కలావర్తకకులాభ్రములు ధరిత్రి

సమయసముచితభంగివర్షములు గురియు
చున్నవిదె జన్నములఁ బిల్పు లొదవుచున్నె. 174

వ. అను నాపల్కుల నాలకించునపు డన్యోన్యంబు వక్త్రంబులం
గనుఁగొంచున్ భయవిస్మయంబులు పెనంగ న్వారు వేరొక్కచో
ప్పునఁ జూపట్టఁగఁ జెప్ప నేమిటికి మిమ్ముం జూడ నాడెందమం
దున నొండొక్కవితానఁ దోఁచు నన నన్నుం జూచి వారందఱున్

క. దేవా దేవరహృదయం
బీ వీఁకనుభ్రాంతి జెందె నీరలు మాత్రో
నావైకుంఠమునకుఁ జనఁ
గావలె నని పలికి చాల కాలం బయ్యెన్. 176

క. వేవేలయేండ్లక్రిందట
నీవడువున ననుట మాత్రమే కాని యదే
మో వైకుంఠపురంబున
కై విచ్చేయుటయె లేదు కద యిప్పటికిన్ 177

సీ. మొన్న గదా మీఁప పూజించి ముచ్చటిం
చితిరి నారదముని శ్రేష్ఠు తోడ
నిన్న గదా మీఁకు విన్నవించిరి దైత్య
పురులవార్తలు గూఢ చరులు వచ్చి
నేఁడేకదా మిమ్ముఁ జూడఁగా వచ్చి ర
చ్చర లుర్వి మునులనిష్ఠలను మాన్పి

ఇప్పుడే గద మీర లేతెంచు పుణ్యుల
కంపించితిరి వ్యోమ యానములను

తే. గీ. మఱియు నెల్లిగ దయ్యె యేమఱక మేము
మీరు గావింపుఁ డని నియమించినట్టి
కర్జముల నెల్ల జాగరూకతఁ గడంగి
కొలువు వేళకు సవరించుకొనఁగ వలయు. 178

క. ఈలో మహి కెన్నిపరుల్
హాళి న్నృపకన్యకా స్వయంవరకల్యా
ణాలోకనార్థ మీరెం
తేలలిశచి వెంట నరిగితిరి సురయుతులై. 179

మ. అనుచుండం బయినుండి తోఁచు నొకఘంటారావమాలించి వా
రును నేనుం దలలెత్తి మీఁదుఁ గను-చోఁ గ్రొమ్మించులన్మించుచున్
స్తనితోదంచిత మైన మేఘ మనఁగా [1]సైరిణంబు రాణ గాం
చిన చొక్కంబగు వ్యోమయాన మరుదెంచెన్ శంఖచక్రాంకమై.

క. క్రమశమిత వేగమై యా
విమానమసమానమైన విభవస్ఫురణం
బమరంగ నల్లనల్లన
మము డగ్గఱినిలిచెఁ జూచు మాత్రములోనన్ 181

1. స్త్రీజనంబుచే.

క. అందుండి యిందిరాకృతు
లం దగుగొందఱువెలందులం గూడి శచీ
సుందరి వెలువడిరా మా
యందఱిడెందముల యందు నబ్బుర మొదవెన్. 182

ఉ. ఎక్కడి కెప్పు డేగితి వి దేటి విచిత్రము ప్రాణనాయికా
యిక్కడ నిన్ను నిప్పుడు గదే కనుఁగొంటి నటంచుఁ బల్కఁగా
నక్కజ మంది యేమి యిటులానతి యిచ్చెద రిప్పుడే కదా
యిక్కమలావధూసఖులు నేనును డిగ్గితి మీ విమానమున్. 183

సీ. నాఁడు వైకుంఠంబునకు మీర లటు లేగు
నపుడె తోడనె వత్తుననఁగ నుడుగు
మని యింట నను నిల్పి యరిగిన మఱునాఁడె
వ్రేలియుంగర మానవా లొసంగి
శ్రీదేవి నినుఁ జూడఁగాఁ దోడి తెమ్మనె
నని యీ విమానంబు ననుప లేదె
పనిచిన నన్నందు వసియింపఁ జేసి యీ
పద్మావధూసఖుల్ పరమపదము

తే. గీ. నందు నామె వసించు శుద్ధాంతమందు
డింప నామెయుఁ బ్రేమ వాటిల్లఁ బిలిచి
యుండు మిచ్చోట నీ భర్తయుండునంత
కాల మని యానతిచ్చినన్నారవించె. 184

గీ. ఎన్నినాళ్లందు జరిగెనో యెఱుఁగఁ గాని
నాఁటిబోటులఁ నల విమానమునుగూర్చి
యిపుడిపుడె యాయితంబు సేయించి పలికె
నన్ను సానుగ్రహాలోకనములఁ జూచి 185

క. అమ్మా! నీ పతి నిజనగ
రమ్మనకుం జనియె నిపుడు గ్రక్కున నీవుం
బొమ్మా మేలగుఁ జక్కెర
బొమ్మా యని భద్రవస్తువుల నిడి పనుపన్ 186

క. వచ్చితి మీ యనుపదమున
నిచ్చటికై యిప్పు డిపుడె యింతకు మును మీ
రిచ్చటఁ గాంచితి మను మీ
ముచ్చట కెంతయును స్వాంతమున వింతయగున్ 187

గీ. అనుచు దన వ్రేలి నుండి ము న్నానవాలు
పనిచి నట్టిది యిదియె కైకొనుఁ డటంచు
నుంగర మొడల్చి నా చేతి కొసఁగు నపుడు
నాకరాంగుళిఁ జూడ శూన్యముగఁ దోఁచె 188

క. దొంతరవింతలచే నిటు
దంతుర మగు భ్రాంతి దోఁగి తల్లడపడఁ నా
స్వాంతంబుచెదర నచ్చటి
కంతట నారదమునీంద్రుఁ డరుదెంచె వడిన్. 189

ఉ. వచ్చిన మానిఁగాంచి తగువైఖరి మన్నన చేసి యేమి రా
యిచ్చటి కిప్పు డీయతివిశృంఖలుఁ డైన మహానుభావునిం
దెచ్చితి వీశ్వరా యని మదిం దిగులొందుచునున్న నా తలం
పిచ్చ నెఱింగి యా తపసి యిట్లనె నల్లన సస్మితాస్యుఁడై. 190

శా. ఓహో యేమిది విన్నఁబాటొదవ నేదో వింతయో చింతయో
మోహంబో మదిఁ దోఁగినట్టుల యథాపూర్వాననశ్రీసము
త్సాహాకారవిచేష్టితస్థితులచే స్పష్టంబుగా నాత్మలం
దూహింపం దగి యుండె దీసురశచీ యుక్తుండవై వాసవా. 191

గీ. అనిన నప్పటి నా స్థితి యంతవట్టుఁ
దెలుప నాలించి పలికె నద్దివ్యబోధ
మహితుఁ డిదియెల్ల నల్పసామ్రాజ్యమత్త
మతి వయిన నీదు దుర్మోహగతి నె కద్దె 192

గీ. ఇంత దుర్మోహమతివి గావేని నన్ను
నతివిశృంఖలుఁడైన మహానుభావుఁ
డని తలంతువె దేవర్షి నగుట నాకుఁ
ద్వైద్విచారంబు నుపపరావలసె నిపుడు. 193

మ. [1]నిగమాంతంబులు నిట్టివాఁడనుచు వర్ణింపంగ లేవన్నచో
జగదీశుం గనుఁగోఁ దరంబగునె దుస్సంసారమోహాంధులై

1. వేదాంతము.

తను విభ్రాంతహృదంతరంగులకు యత్నం బెంతఁ గావించినన్
భగవద్భక్తుల కట్లుగా కతఁడు చూపట్టుం గదా యంతటన్. 194

మ. తన భక్తుండను నేను గానొ నను వాత్సల్యాతిరేకంబునం
గని స్వీయం బగు దివ్యవిగ్రహము సాక్షాత్కారముం జేసి ధ
న్యునిఁ గావింపఁగ రాదొ యంచ నెదవేమో నీవు భక్తుండవై
న నతం డిట్లు లుపేక్ష సేయునె సురేంద్రా యేల యీదుర్భ్రమల్.

క. విను భక్తుల తెఱఁ గెఱిఁగిం
తును గోప్యము దృశ్య మగుచుఁ దోఁచిన యది యె
ల్లను వారలు శ్రీహరి భా
వనఁ జూతు రతఁడు జగన్నివాసుం డగుటన్. 196

క. హరి సర్వత్ర కలం డను
బరమార్థము నెవ్వఁ డెఱుఁగు భక్తుడు వాఁడే
హరియు న్వానికె యెల్లెడఁ
గరుణించుం దనదుమూర్తిఁ గనుభాగ్యంబున్ 197

గీ. తరలి వైకుంఠపురికి నీ వరిగి యందు
నెందు గోవిందుఁడుండునో యెపుడు నన్నుఁ
బిలువ నంపించునో యంచు దలఁచు చుంటి
గాని దృఢభక్తిఁ ధ్యానింపఁ గడగవైతి 198

మ. గురుభక్తిన్ గుఱినిల్ప నేర కలవైకుంఠంబుఁ బ్రోలంచు న
వ్విరజన్వాహినియంచు నత్తులసి నుర్వీజాత మంచున్ ఖగే

శ్వరశేషాదుల నిత్యసూరులనుచున్ భావించితే కాని య
ప్పరమేశప్రతిబింబబుద్ధి మదిసంభావింపవై తక్కటా. 199

క. ఎక్కడి శౌరీ జన్మం
బెక్కడి యితరాంతరంగ వృత్తిజ్ఞత్వం
బక్కడఁది యెఱుక దొరకను
టక్కడ హరియే చరాచరాకృతి నుంటన్. 200

క. హరిమాయ నెఱుఁగ నెవ్వరి
తరమా పరమాత్ముఁ డెటుల తలఁచిన నటులౌఁ
బెరమాట లేల భ్రమయుట
సురమాన్యరమాఢ్యమహిమ చొప్పున నె సుమీ. 201

క. నీ వెపుడు సపరివారుఁడ వై
వైకుంఠమున కఱిఁగి తప్పుడె యిచటన్
నీవిధమున నొకమాయా
దేవేంద్రుని సపరివారుఁ దివిరి సృజించెన్. 202

ఉ. అంతట నూరకుండక త్వదంగన యైనశచీవధూమణిన్
స్వాంతమునందు భ్రాంతి దొలఁకాడకయుండఁగ శీలరక్షణం
బెంతయుఁ బ్రేమఁ జేయ మది నెంచి రమాసతిచేత నామె [1]శు
ద్ధాంతమునందునుంచుటకు నై పిలిపింపఁగఁ జేసె వేల్మిడిన్. 203

1. అంతఃపురము.

గీ. అపుడు శచి కానవాలు నీనంపి తనిన
యుంగరము శౌరిమాయాసముద్భవంబె
యిపుడు నీచేత నది తిరోహితవిధంబు
గనుటయును శౌరిమాయాప్రకల్పితంబె 204

గీ. నీవు స్వర్గంబునందు లేనితఱి నచట
నెగుడుకర్జంబు లేరీతి నగునో యంచు
నీతలను భార మెల్లనుండెనను బుద్ధి
పుట్ట హరి నిన్ను సిలుగులఁబెట్టఁ దలఁచి. 205

గీ. శౌరికాదంభమున నిన్ను శౌరికాని
మాటల నహంక్రియాగర్వ మదము లణఁచి
కాదుకాలాంతరంబునఁగాని నేఁడు
హరిపదాలోకనంబు పొమ్మనుచుఁ బంచె. 206

క. గెంటనికృప నంటినమతి
వెంటనె శచినింటి కనుపవే యని సిరి వా
ల్గంటి కెఱిఁగించి హరి తెఱ
గంటిదొరా పనిచె నామె గ్రక్కున నిటకున్. 207

ఆ. వె. ఈశచీవధూటి యిపుడు చూపినయట్టి
మాయయుంగరంబు పోయె నపుడె
నీదు వ్రేలిదైన నిజమైనయుంగరం
బిప్పు డుండుఁ జూడుమిదె సురేంద్ర 208

క. అనునవుడు నాకరాంగుళిఁ
గనుఁగొనుచో నంగుళీయక సమేతంబై
కనుపట్టనచటి వారల
మనంబు లద్భుతరసైక మగ్నము లయ్యెన్. 209

గీ. మఱియు నవాత్మని యిట్లనె మఘవనీవు
గురుగురూపాయచాతురీ గురుతవలనఁ
గలుగు కాలాంతరంబునఁ గమలనాభు
దర్శనము క్షీరవారాశిఁ దప్పకనుచు. 210

గీ. ఇది యనఁగ నెంత వింత నీమది కొకింత
భ్రాంతిమాత్రంబె కలిగె నిప్పటికిముందు
నాటునస్వస్థతారి యంతట లభించు
నిష్టసంసిద్ధి యని తెలిపి స్వేచ్ఛ నరిగె. 211

గీ. ఇన్నివిధముల హరిశక్తి యిట్టి దనుచు
నెఱిఁగి యెఱిఁగియు నల్పసమృద్ధిగర్వ
పరవశుఁడ నౌచుఁ బడరానిపాట్లఁబడితిఁ
గాని యిడుమలవిడనాడఁ గలిగె నిపుడు. 212

క. ఆ సంయమి పలుకగునను
నాస న్నానసంశయంబు లడఁగె న్నుడు లే
లా సన్నము లయ్యె శ్రమము
లా సన్నము లయ్యె రమలు హరికృప నింకన్. 213

చ. సురనరులార సూరిపరి శుద్ధుఁ డుదారుఁడు దక్షుఁడైన యా
గురుఁడు గురుండు మంత్రియు సఖుండు నియంతయునై స్వనీతిచా
తురి నను నెల్లకర్జములఁ దోడ్పడి కావఁగ నావగ ల్నిరం
తరముగనుండు నే మది ముదంబు పదంపడి కూడకుండు నే 214

ఉ. ఈ మహనీయబుద్ధి బలమే కద నా కదనైనచో రిపు
స్తోమములన్ జయించు నెటి చూపును తేపును మాపు నోపి స
ర్వామరసామరస్యకల నైకదశన్ఘటియించు నేఁడు శ్రీ
స్వామికటాక్షముం బడయఁ జాలు నుపాయముఁ దెల్పకుండు నే.

క. అనవుం డాంగిరసుం డి
ట్లను నను నాత్మీయు నింత యగ్గించుట యొ
ప్పానె యిట్లగునని సుర
ముని వలుకఁడె యతని పల్కు మోఘము కాదే. 216

గీ. సాధనీయార్థమున కెందు సాధకుండు
గావలయునంచుఁ గోరుట గలదు గాని
సిద్ధ మగు నర్థములకుఁగాంక్షించు టెందుఁ
గలదు సాధకుఁ డొకఁడు గావలయునంచు. 217

క. శారీవ్యపదేశశ్రీ
శౌరీరిత మైన యర్థసందర్భము నే
నారదమునియుం దెలిపెఁ గ
దా దూషీగ దాని కన్య ధాత్వము గలదే 218

ఉ. ఇప్పుడె క్షీరవారిధి నహీనశయాను ఖగేశయాను బొం
దుప్పటిఁ బూను జానుజగితోఁ దగు మేను మెఱుంగు రంగు బా
గొప్ప కునఁ బొల్పగు శ్రీరమేశు నే
చొప్పునఁ జేరి కొల్చుటకుఁ జొప్పడు నట్లొనరింపఁగాఁ దగున్.

క. అన నందఱు నల మందర
మున నుండి పయోధితీరమును జేర గడం
గి నితాంతంబు నతాంతం
బు నుదాంతం బయిన స్వాంతమున వెడలి రొగిన్. 220

క. మిహిరకులకలశజలనిధి
మిహికాకిరణానమత్స మోహితకరణా
వహబహు సుగుణాభరణా
ముహురస్మద్వంశ పురుషపూజిత చరణా. 221

ఉ. కుంచితచిత్రకూటగిరికూటరటత్కరటకు పాటదృ
ష్ట్యంచలపాతపాటవస్ఫుటారభటీత్రుటితారికాటవా
పంచవటీతటీఘటితపర్ణకుటీనికటాటవీనట
త్కాంచనకృష్ణసారబలగర్వవిపాటనసద్విపాటనా. 2

తోటక. స్థిరగౌరవ మానసదృష్టజటా
యురభిఖ్య విహంగధృతోరుజటా
భరకృష్ణమృగాజినవల్కపటా
నిరవద్య కృపాకరనిష్కపటా. 223

## గద్యము.

ఇది శ్రీమద్రామనామపారాయణపరాయణాతిధన్య కౌండిన్యగోత్ర
పవిత్ర దేవులపల్లికులపయఃపయోనిధికళానిధిసీతారామశాస్త్రి పౌత్ర
వేంకట కృష్ణశాస్త్రిపుత్ర తమ్మనాభిధానాంతర వేంకట కృష్ణ
శాస్త్రినామాగ్రజన్మ త్రిలింగదేశాగ్రజన్మ సుధీ
విధేయ సుబ్బరాయశాస్త్రి నామధేయ ప్రణీతం
బైన మహేంద్రవిజయం బను ప్రబంధంబు
నందుఁ దృతీయాశ్వాసము.

శ్రీ సీ తా రా మా ర్ప ణ మ స్తు.



శ్రీ ర స్తు.

# శ్రీ మ హే ం ద్ర వి జ య ము

## చ తు ర్థా శ్వా స ము.

శ్రీహనుమత్కృతపదసం
వాహన సౌందర్యరచిత [1]వాచంయమి స
మ్మోహన రుచివిజిత [2]హరి
ద్వాహన రఘురామ సార్వభౌమలలామా. 1

గీ. అవధరింపుము శౌనకాద్యఖిలమౌని
మణుల కిట్లని రౌమహర్షణి వచించె
సుచిరపరిలబ్ధపుమపత్యసుఘచిరకల
మంజుసంజల్పమాధురీమహితపణితి. 2

మ. కని రాచార్యపురస్సరంబుగ సురల్ [3]గ్రావారితోఁ గూడి యుం
పునఁ బెంపౌ శరధిం బురారిశరధిం భూదేవికిం గట్టి వి
ప్పనిపుట్టంబును శేషశాయికి లసద్వారాభిరూప్యంబుచే
ఘనమై చొక్కఁగఁ జొక్కమైన శయనాగారం బదూరంబునన్. 3

1. మౌని. 2. సూర్యుఁడు. 3. ఇంద్రుఁడు.

మ. కనదుత్తుంగతరంగహస్తముల సైఁగం జేసి యాత్మీయ ని
స్వనసంరంభమునన్ ముకుందుఁ డిదె యస్మన్మధ్యమం దున్నవాఁ
డని యాహ్వాన మొనర్చుచుం బృషతపాద్యం బిచ్చి తమ్మాదరిం
చునదీనుం గని కార్యసిద్ధియగు నంచుం జాల సంతుష్టులై. 4

క. గురు నసమయోగవిద్యా
గురుఁ గని యుపయోగమై తగురుచిరతరవా
గురుఫణితి నచట నపు డజ
గురుఁ గనుయోగంబును నెఱుఁగురుచిన్ వేఁడన్. 5

క. శ్రీకారుణికు సదవనాం
గీకారుని నిత్యవిహితకిల్బిషచయుబం
దీకారుని హరి నిచ్చట
సాకారునిగాఁ గనంగసగు భక్తులకున్. 6

మ. ప్రణమద్వశ్యుఁడు పాపకోపదురభిప్రాయా[1]ద్యదృశ్యుండు కా
రుణికస్వాంతుఁ డనంతుఁ డెప్పుఁ డెవరే రూపంబునన్ భక్తి భూ
షణవీతేషణ భాషణంబులను నిష్పన్నార్తిఁ గీర్తింతురో
యణుమాత్రంబును వేఱు లేక తఁడు ప్రత్యక్షుంబగున్ వారికిన్. 7

క. నావుడు సురలందఱు నీ
వే వినుతింపఁదగు సద్వివేకివి గా కే

1. కనుపట్టనివాఁడు.

నేవిధి నుతిఁ జేయంగల
మావిశ్వజనీను మహిమ నన నతఁడు దగన్. 8

ఉ. [1]ప్రాఙ్ముఖుఁడై కరంబులు శిరంబున మోడ్చి నిరంతరంబులౌ
వాఙ్మనసప్రవృత్తు లెడ వట్టఁగ నిశ్చల రూఢనిష్ఠన
వ్యాఙ్మతియై యతీంద్రియచయస్థితివిస్మృతవిశ్వచేష్టచే
దృఙ్మిళదేక లక్ష్యనియతిం దగె నిర్గుణతత్త్వచింతచేన్. 9

గీ. కొంతవడి నిర్వికారనిర్గుణసమాధి
నంతరంగంబు నిస్తరంగాత్మబోధ
పరిణతానందరసమయత్వమునఁ బొదలి
యంత సగుణవిధోపాస్తి నధిగమించి. 10

సీ. నవనీరదేందీవరవనీతమాలప
ల్లవనీలమణిలీల నవధరించి
శతభానుమండలోదిత[2]భానుమండలాం
చితభానుభావశాలిత వహించి
విమలోరువిస్ఫురత్కమలోదరసమగ్ర
తమలోచనాంతవిభ్రమము గాంచి
యసమానచంద్రికా లసమానధాళధ
ళ్యసమానవద్యమహా పసరహించి

1. తూర్పు మొగముగానున్నవాఁడు. 2. కిరణముల సమూహము.

తే. గీ. మించుఘనకాయ [1]మొఱపుదీపించుఛాయ
చల్లనగు చూపు మందహాసంపుఁ గోపు
గలిగి రాణించు దివ్యమంగళమనోజ్ఞ
మైన తేజంబు ప్రోలెఁ బ్రత్యక్షమైన. 11

ఉ. పెన్నిధిఁ గన్న పేదవలె వేదనఁ బాసి [2]నవాసితాభ్రసం
పన్నిధియౌ తదాకృతి రమాపతి దంచుఁ దలంచి సేవకా
పన్నగభేదవజ్ర మగు పన్నగశాయి వెసం బ్రసన్నుఁడై
సన్నిధి చేసినాఁ డనుచు సంతసమందుచుఁ జూచుచున్నడన్ 12

మ. మృదులం బంబుజడంబరం బుపనిషన్మృగ్యంబు యోగిచ్ఛటా
హృదయాగారవిహారధీరము ముహుశ్శ్రీహస్తసంవాహనా
స్పద మాకాశధునీజనిర్గృహ మజత్వప్రఖ్యసర్వోత్తమా
భ్యుదయశ్రీదము శౌరిపాద మెదుటన్ మున్ముందు చూడం దగెన్.

ఉ. [3]క్షీరపయోధినుండి దరిఁ జేరి గజేంద్రునిపట్లఁ దండ్రి ని
ష్కారణదోషమున్ సలిపెఁ గాన మముం దదపత్యతాదురా
కారులఁ బ్రోవవే యనుచుఁ గాళ్లఁ బెనంగెడు నక్రపోతముల్
నా రహి మించు నవ్వనజనాభునిజంఘలఁ గాంచె నంతటన్. 14

గీ. ఊర్వసి కరిష్ఠ మను మాటయుండెఁ గాన
రంభ కేలయరిష్టమై క్రాలకుండ

1. చక్కఁదనము. 2. క్రొత్తదైన తెల్లనిమేఘము. 3. పాలకడలి.

ననఁగఁ దగు శౌరి యూరుద్వయంబునందుఁ
గొంతసేపు వసించె నగ్గురుని చూపు. 15

క. [1]పొందుప్పటికాసె బిగిం
బొం దుప్పతిలంగ నెల్లపుడు సజ్జనతా
నందకమ్మై యొప్పెడు నల
నందకమునఁ దనరు కటి గనం దగె సంతత్. 16

గీ. అఖిలమునకుఁ బితామహుఁ డావిరించి
యిది యతని కెన్న ప్రాతామహీయుగుఁ గానఁ
దన కొకించుక యందు బాంధవము గలద
టంచు హరినాభి సరసి సేవించె గురుఁడు. 17

సీ. ముగ్ధలీలావళీ స్నిగ్ధనీలావళీ
సరళసోపానాగ్ర సరణిఁ బోవఁ
గ్రైవశ్రీవత్సమన్ క్రీనీడపై జాడ
హరియురస్సీమగేహాజిరమున
శుంభద్భుజోన్నతస్తంభసంభృతవైజ
యంతికాగారుత్మతాశ్మశృంఖ
లామధ్యభాగప్రలంబమానానూన
కౌస్తుభమణిదీపకళికదీప్తి

1. బంగారు పచ్చడము.

తే. గీ. యిదిగొ కను నీ మనోరథాభ్యుదయ రేఖ
యనుచుఁ జూపింప నగ్గురుం డరసిమురిసె
సరసిజాసనముఖసురైశ్వర్యదాత్రి
భువనజనియిత్రి నందు సంభోధిపుత్రి. 18

క. తిలకించి యకించనుఁ డి
మ్ముల మించిన పెన్నిధానమును గాంచిన య
ట్టుల సంతరించి గీష్పతి
పులకించిన మేనితో సముతుకుఁ డగుచుఁన్. 19

క. తల్లీ [1]యోషిల్లోకమ
తల్లీ త్వల్లీలచేఁ గదా యవ్వాణీ
వల్లభముఖులెల్లను సం
పల్లాభోల్లసితులై ప్రవర్తిల్లు టొగిన్. 20

క. [2]ముక్తాహారులు నవిరళ
ముక్తాహారులును సుహిత భూరిరసోద్య
ద్భక్తులు నగుదురు గద త్వ
ద్భక్తులుగా గణుతిఁ గనిన వారలు తల్లీ. 21

సీ. కడుపేదలై డస్సి కడుసేద నిల్లిల్లు
దిరుగువాఁడైన నీ కరుణఁ గాంచి

1. స్త్రీజనములలో శ్రేష్ఠురాలు. 2. ఆహారము విడిచినవారు.

వలువంతయును లేక వలవంత దైన్యంబుఁ
జూపువాఁడైన నీ ప్రాపుఁ గాంచి
నిలువనీడగఁ జూడ నిలువ నీస్థలియయ్యె
యొనరువాఁడైన నీ నెనరుఁ గాంచి
మాఱుమానిసికి నేమాఱు మానసపుఁబెం
పుఁడుగువాఁడైన నీ యడుగుఁ గాంచి

తే. గీ. యసమశాల్యన్నములయుఁ జీనాంబరంబు
లయుసముత్సేధసౌధంబులయుఁ గుటుంబ
పరిజనంబులయును బెంపు పరిఢవిల్ల
భూరిసామ్రాజ్యుఁ డగుఁ గదే భువనజనని? 22

క. అని యెన్నెని విధంబుల
[1]ననిమిషగురుఁ డిందిరామహాదేవిని బే
ర్కొని యామె సుప్రసాదం
బునఁ దిరమగు సిరి నొసంగు పోఁడిమిఁ జూపన్ 23

క. మన కిఁక శాశ్వతసంపద
లొనగూడె నటంచు మోద మందుచు మఱియా
ఘనమూర్తి యితరలసదవ
ఘనసందర్శన మొనర్పఁగాఁ గడఁగుటయున్ 24

1. బృహస్పతి.

గీ. పొందుగా నంతఁ గటినద్ధ నందకేత
రాయుధచతుష్క మైన శ్రీహరిభుజాచ
తుష్టయమునందు నిలిచి సంతుష్టమయ్యె
ననిమిషస్వామిగురువిలోకనచయంబు. 25

చ. [1]కమలజసూతి ఫాలఫలకంబులఁ బుట్టువుచంద మేక కా
లమున లిఖింప దాసపటలంబున కొక్కటఁ జక్కఁగాఁ బుమ
ర్థముల నొసంగ నాలు గిటఁ దాల్చెనొకో యన నొప్పు శౌరిహ
స్తములకు మస్తకంబు వినతం బొనరించె గురుండు భక్తితోఁ

గీ. కంధరాభిఖ్యాభువన విఖ్యాతి గాంచి
గర్జితస్ఫూర్జితధ్వని గణుతిచేఁ ద
నర్చు వైకుంఠకంఠంబున కుపకంఠ
మున సముత్కంఠ గురుఁడు చూపులఁగదించె 27

క. మానసమున గురుఁ డాహరి
యాననరుచి నలువ గన్న యాననరుచిర
శ్రీనలరు దానిఁ గని యస
మానసముల్లాసభాస మానుండయ్యెఁ. 28

మ. దివిజామాత్యుఁడు స్వామికార్యఘటనాదీక్షైకదక్షుండు శ్లా
ఘ్యవివేకుండు పదాదిగాఁగ ముఖపర్యంతంబు నత్యంత భ

1. బ్రహ్మ.

క్తివిశేషంబున నంబుజోదరునిమూర్తిం గాంచి సాక్షాత్కారిం
చె విరించాదికదుర్లభుం డనుచు నక్షీణప్రమోదంబునన్. 29

క. బడి బడి సాష్టాంగముగాఁ
బడి వడిఁ బ్రొక్కులిడి లేచి పలునుడువులఁ బ్రా
నుడువుల నుడియుడిదవుదొర
నుడుగక కడుభక్తిఁ బొగడుచుండఁగ హరియున్. 30

గీ. గీష్పతినిఁ గాంచి నీవు [1]వాస్తోష్పతియును
సురలునను జూడ నిటకు వచ్చుట యెఱింగి
ధ్యానగమ్యుండఁ గానఁ బ్రత్యక్షమైతి
నీకు మాత్రంబె సురపాల నైకలోల. 31

క. మెచ్చితి నీసచ్చరితకు
వచ్చినపనిముచ్చటించి వర మడుగుము [2]వై
యచ్చరకులదేశిక యన
నచ్చతురుఁడు విన్నవించె హరి కిప్పగిదిన్. 32

గీ. ఏను వాస్తోష్పతియు సురలిటకు నిపుడు
వచ్చుట యెఱింగినట్టి సర్వజ్ఞమతికి
దేవరకు విన్నపము సేయఁగావలెనె మ
దీయ విజ్ఞాపనం బాదితేయవరద. 33

1. బ్రహ్మ. 2. దేవతాగురుఁడు.

ఉ. శ్రీవరదేవరం గనుటచేతను జేతను లాజవంజవ
ప్రావరణంబువాసి సతమైనభవత్పదసేవనంబునం
బావనులౌచు నిత్యవిభవంబును గాంచి సమంచితానుమో
దావహులై సదాసుఖితులౌదు రటంచు వచింత్రు కోవిదుల్ 34

గీ. అట్టిదేవరదర్శనం బైనపిదప
వెట్టివాఁడైనఁ గోరునే వేఱె వరము
నమృతవారాశిలోనోలలాడఁ గాంచి
గంజికై యాసపడెడి ముష్కరుని కరణి 35

క. దేవర పొడసూపుట కా
దే వర మన వేఱె యున్న దే వర[1]వరటా
దేవరథ సంయమీశ్వర
దేవరచితవినుతిపాత్ర దేవ రమేశా. 36

క. నీ వొనరించినజగములు
భావింపఁగ స్వర్గమర్త్యపాతాళంబుల్
దేవమనుష్యాసురులకుఁ
దావలములు తత్క్రమంబు దప్పనె యెపుడున్. 37

గీ. సంజ్ఞ త్రిదశాలయం బని స్వర్గమునకుఁ
దనరు బలిపద్మమనుచుఁ బాతాళమునకు

1. హంస వాహనుఁడు.

సమరు నది యిప్పు డేల వ్యత్యాస మొందు
సత్యనిర్మాణ నీకటాక్షంబు గలుగ. 38

గీ. మాది మాకిచ్చుటయె మది మాన్య మిదుట
యనుచుఁ [1]ప్రాకృతు కోరిన యటుల మిమ్ముఁ
గోర నేటికి మున్నె యెవ్వారి కెద్ది
యుచితమగు దాని నటు చేసి యుంటఁ జేసి. 39

క. బలి శుక్రుని ప్రేరణమున
బలభేదిని స్వర్గపురముఁ బాయఁగఁ జేయం
బలమఱి మీచరణంబులఁ
గొలువం జనుదెంచె నిటకు గోవింద హరీ. 40

సీ. దితితనూభవదండహేతులకు దశశతాం
బకు వీఁపు నల్లులమంచ మయ్యెఁ
బలలాశికట్టాకములకు వేఁడి వెలుంగు
కొమరుని తల సంతకుండ యయ్యె
దైత్య[2]కరాసిక్షతముల కంబుధినాథు
మే నూరిదరిబొడ్డుమేడి యయ్యె
దనుజాంగుళీప్రపీడనమున కర్థేశు
చెవిదోయి కిన్నెర చీల లయ్యెఁ

---

1. విద్యాసంస్కారము లేని వాఁడు. 2. కత్తి వేట్లకు.

తే. గీ. గొమ్మలేనుంగులే ధావన మ్మొనర్ప
నేమి చెప్పఁగవలయును దోమలగతి
ననినగతిఁగోణపులఁ బేరుకొనగఁ నేల
చెదరి యొక్కొక్కమూల వారొదిగి రపుడు 41

గీ. దీనజనతార్తిసంహారి దానవారి
శౌరి యనుఖ్యాతి నిల్పుకో సమయ మిదియె
శిష్టరక్షణ దుష్టసం శిక్షణములు
నీవు పూనిన పూన్కలు గావె దేవ. 42

మ. అని సాష్టాంగముగా నడిం ప్రణతుఁడై యా దేవదేవాంఘ్రులం
దన [1]మూర్ధంబున సోఁకుచుఁ శరణుదైత్య వ్రాతగర్వాపనో
దనదీక్షాపర ప్రోవవే మము సురేంద్రత్రాసనిర్వాపణా
యనుచున్ లేవక యున్న శౌరి కరుణా యత్తైకచిత్తంబునన్. 43

గీ. అఖిలసజ్జనలోకాభయప్రదంబు
లైన నాల్గుభుజంబుల నతనిఁ బొదివి
లేవఁగా నెత్తియిట్లను దేవమంత్రి
యీయుపేక్షకుఁ గారణంబెల్ల వినుము. 44

చ. కులబలసంపదాదులు దగుల్కొనహత్తిసమత్తవృత్తి యె
ట్టులు దొలఁగుం దదున్నతి కడుం దగుచుండినయంతవట్టుఁ ద

1. తలమీఁద.

ద్భల ముడివోయి నప్పుడు గదా యిది యిట్టి దటంచు నాత్మలం
దెలివి వినీతి నీతియు విధేయతయున్ సమకూరు నేరికిన్. 45

క. ఋభువిభుఁ డితఁడు త్రిలోకీ
ప్రభుతా ప్రభవప్రభూత పటువైభవ గ
ర్వభరంబునఁ దజ్జ్ఞత ద
ప్పి భవాని ప్రసాద మభిభ వించెం బెలుచన్. 46.

చ. ఒరుఁ గని యాదరింపమియె యొప్పదు తప్పగు విప్రుఁ జూచి స
త్కరణ మొనర్ప కున్కి కొఱ గాదు తపస్వుల నెందుఁ జుల్కఁగా
నరయుట శైవులందు వినయం బెనయింపమి కానిమాట వా
విరి మనయత్రినంద నుపేక్ష యొనర్చినఁ జెప్ప నేటికిన్. 47

శా. [1]శర్వాణీకరుణానులబ్ధమనియూసన్మాలికావృత్తము
న్నిర్వాణేశుఁ డెఱుంగఁజాలఁ డఁట పోనీ దాని కేమయ్యె నా
సర్వేశాంశమునన్ జనించిన మహాశైవుండు దుర్వారుఁ డీ
దుర్వాసుండని మున్నెఱుంగఁడో ప్రశస్తుండయ్యె వ్యర్థంబుగాన్

క. ఆవరమునిశాపచ్యుతి
గోవిందుఁడె కలఁ డటంచుఁ గొనకొని సదయుం
డై వాఁడువ్వక యూరక
యే వెడలినఁ గ్రమ్మఱింప నెవ్వరి తరమా. 49

---

1. పార్వతి.

క. ఐశ్వర్యదాత యప్పర
మేశ్వరుఁ డని మోక్షదాత నేనని శశ్వ
ద్విశ్వప్రఖ్యాతోక్తుల
విశ్వాసంబున్న సంభవించునే యిడుమల్. 50

క. ఏ నన నీశ్వరుఁ డన నిం
తైనను భేదంబు కలదె యది యెఱుఁగక [2]దు
ర్జ్ఞానులగొందఱు భేదము
గా నెంతురు వారికెట్లు గలుగును సుగతుల్. 51

క. నేనజుఁడనై సృజించెద
నేనేయై పెంచెదన్మహేశానుఁడనై
పోనడఁచెద వారలు ని
ల్లైనెరపెద రేది భేద మీమువ్వురకున్. 52

ఉ. మామకభక్తుఁ డెవ్వఁడో సమస్తము నాతడు మన్మయంబుగా
నే మదిలోఁ దలంచు నతఁ డెద్దియు భేదముగాఁ దలంపఁడే
మేమొ మదన్యమున్నదని యెంచినచో నిఖిలాత్మభావము
న్నేమి ఘటించు నా కపుడు లేదు కదా తగుదారి వానికిన్

క. ఈశ్వరభావనచే న
నైశ్వర్యంబునకుఁ గొలిచి యవ్వలి నిత్యా

1. చెడుబుద్ధి గలవారు.

[1]నశ్వరసుఖమునకై గరు
డాశ్వునిఁగఁ దలంచి కొలువ నగు వాంఛాప్తుల్. 54

గీ. ఈశ్వరానుగ్రహము లేని యెడ నొకండు
శాశ్వతైశ్వర్యముల నొందఁజాలఁ డెపుడు
నా యనుగ్రహమును గోరెనా తదీయ
విత్తము హరింతు నిది లోక విశ్రుతోక్తి. 55

మ. సిరి సంపూర్తిగ నున్న వేళ మదవచ్చేతోభిమానంబునం
బరమార్థ మ్మొక యింతయైన మదిలో భావింపఁగా లేక ము
ష్కరులై కొందఱు కన్నుఁగాన రదిహోఁ గాంక్షింతు రిం కెప్పుడె
వ్వరి మూలంబున వెండియుం గలుగు సంపల్లాభమంచార్తులై. 56

క. ఇంకేల పెక్కునుడువులు
శంక యొకింతయును లేక చనుఁ డిపుడు నిరా
తంకముగఁ బంపెదను మీ
సంకటములు దీఱ బలి రసాతలమునకుఁ. 57

క. నావుడు గురుఁ డిట్లను నో
దేవా దేవాధిపాదిదివిజావళికిఁ
భావత్కపాదదర్శన
భావుకము నొసంగవలయు భక్తార్తిహరా. 58

1. నాశనము లేని సౌఖ్యము.

క. ఓ దేవ వారికిని మీ
పాదాంబుజరసముఁ గ్రోలు భాగ్యము దొరకం
గాఁ దలఁతు నిపుడ యేక
స్స్వాదునభుంజీత యనెడు వాక్యము వినుటన్ 59

క. పలుమఱు శ్రీహరిగురునిం
దలఁపు తెలుపు మనిన నింద్రు నాకమునందు
న్నిలువు మని కోరె స్వార్థముఁ
దలఁపరు కద స్వామి కార్యతత్పరు లెందున్ 60

క. అన నవ్వుచు నటు కాని
మ్మని హరియు ననుగ్రహింప నాంగిరసుండుం
దన పిఱిఁది సురల కరిదిగఁ
గనుఁగొనుఁడని చూపి చెప్పఁగాఁగట్టెదుటన్. 61

మ. కని రింద్రాదిసురుల్ముకుందునిఁబయః కల్లోలమాలా[1]పృష
ద్ఘన[2]ముక్తాఫలచారుతోరణలసత్కాదంబినీ కాయమా
ననితాంతాంచదనంతమంటపగతానంతస్ఫుటానంతశో
భనశయ్యాంతరశాయి భక్తగణసంపద్దాయి నొక్కమ్మడిన్.

క. కనిసాష్టాంగప్రణమిత
తనులై భక్తిప్రశస్త తనులై [3]గతయా

1. నీటిబిందువులు. 2. ముత్యములు. 3. పోయిన బాధగలవారై.

తనులై సఫలచిరప్రయ
తనులై వినుతించి రివ్విధంబున వరుసన్ 63

క. నలువకు నిది యీదృశమని
పలికి నిరూపింప వలను పడ దెద్దియు యా
వెలుఁగుం గనుఁగొంటిమి యికఁ
గలుగదు కద దోసఁగుటిల్లుఁ గడలుకొనంగన్ 64

గీ. జలధిపాత్రపయస్స్నేహ, సర్పరాజ
వర్తిఫణామణిదీపాగ్ర వర్తికజ్జ
లప్రభుజనాండభాండజాల ప్రభునినుఁ
గంటిమోహాంధవృత్తిఁ బోఁగంటినధిప. 65

గీ. [1]కృష్ణవర్త్మాహ్వయంబు నాకింతవట్టు
మలిన మార్గుండ నగుటచేఁ గలిగెఁ గాని
కృష్ణు నినుఁ గాంచుదారి నే నిపుడు కనుట
నలరె నిర్దుష్టసాధ్వర్థమైముకుంద 66

గీ. దితిజగణభయరోగాధమత వహించు
టనుగదానే [2]గదాధరుండ నను పేర
నుంటినింతకుమును [3]గదాయుధ వహింతు
నిఁక గదాయుధధారినామకయశంబు. 67

1. అగ్నియను పేరు. 2. రోగముచే హీనుఁడను. 3. గద ఆయుధముగాగల విష్ణూ !

క. అజ "నేతిబీర" వలెఁ బు
ణ్యాజనుం డని నాదు పేరు వ్యర్థము సుమ్మా
ప్రజ లెఱుఁగ నింతదనుక
న్నిజమవిసంవాది యయ్యెనే డది నాకున్. 68

ఉ. కట్టడిఁ దొట్టి దానవనికాయము కాయమునందు హస్తము
ల్గట్టిగఁ బట్టి పాశములఁ గట్టుటఁ బట్టి జగం బెఱుంగ నే
బెట్టుగఁ[1] బాశహస్తసమభిఖ్య వహించితి నిన్నినాళ్లు నా
కట్టి నడి న్మఱి న్విడువనయ్యెఁ గదయ్య ముకుంద యియ్యెడన్.

ఉ. నాదు మహాబలుం డనెడు నామము మిక్కిలి [1] స్వత్వహీనుఁడ
న్వాదు ఘటించె దైత్యబల వర్గబలార్భటికాఁగ కేదిటం
బేది పలాయనప్రవణ వృత్తి భజించుట నింతకాలమో,
శ్రీదయితా భవత్కరుణ చే నివు డొందె బలాధికార్థమున్. 70

చ. దనుజులు బల్మిఁ గల్మిఁ గొని దర్పమునం బురమాక్రమింపఁగాఁ
గనుకని భీతిఁ బర్వ నలకావిభుఁడం చొరు లింతకాలము
న్నను నల కుత్సితప్రభుఁ డనం దగు నర్థముఁ దోఁపఁ బిల్వనుం
టిని గద యింక నీకరుణ నే నలకేశ్వరసంజ్ఞ నొందెదన్. 71

క. [2]కరికృత్తివసానత చేఁ
బరఁగితి ము న్నేనుఁ గృత్తివసనుఁడన న్నే

1. బలములేనివాఁడు. 2. ఏనుఁగుచర్మము కట్టుటచేత.

డరి హృత సర్వస్వతచే
ధరియించిన యశో్కఅంత తప్పెఁగద హరీ. 72

క. అని యింద్రాదిదిగీశులు
తన తన పడినట్టి కష్టదశ లిట్లెఱిఁగిం
చి నుతించి రేకముఖముగ
నెనసి పురస్థాయిఫణాధరేశ్వరశాయిన్. 73

దండకము—శ్రీమన్మహానర్ఘ రత్నచ్ఛటోదారకోటీరకోటీరవిజ్యోతిరాటీకనోద్దీప్రవ పశ్యద్ఘనధ్వాంత విభ్రాంతికృత్కుంతలాత్యంత కాంతాళికాంతాభిరామాననా యిందిరామానసాధీన నానాజగద్వల్లభాగల్లభాస్వన్మణీమండలాఖండలాలిత్యభాక్కుండలా కుండలీశానతల్పా యురస్థాయితల్పా సదానిర్వికల్పా కనత్కౌస్తుభాకల్పకా సత్యసంకల్పకా భక్తబృందాలయాళిందకల్పా యనల్పానుకల్పాకంపామతీభూరిశంపాతతిద్యోతమానాంబుదాడంబర శ్రీసమాలంబిజాంబూనదాచ్ఛాంబరాంగప్రభాసుప్రభావా శుభావాస వాసంతవేళా ప్రఫుల్లప్రసూనప్రతానోల్లసన్మల్లికావల్లికావల్లికాకార రేఖానఖీమయూఖ ప్రజాభంగగంగానుషంగాంఘ్రిపద్మద్వయా యద్వయా చిద్విలాసా కలానాదరా ఖేదరాహిత్యకృత్యాతిపాండిత్యనిత్యాదరా మేదురా మోదదా మోదరాపాదసేవైకహేవాకభావాకలంకస్థితింబొల్చులోకంబులోకంబుహస్తా నిరస్తాఖిలాంహస్తమస్తోమవృత్తిన్సమస్తప్రశస్తప్రకర్షోన్నపపత్తిం బ్రవర్తించి యంచ

ద్వివేకాతిరేకంబులై యంబుజప్రోద్భవాదు ల్నిరూపింపఁగా లేని విజ్ఞానసంపత్తికిం బాత్రభూతంబులై సర్వభూతప్రకృష్టానుభావం బుచే విశ్వభూతప్రభూ! తత్క్షణంబే సమ ద్రక్షణాక్షీణవై చక్షణీ లక్షితాత్ముద్రదాక్షిణ్య మా నీకటాక్షప్రసారంబునుం జెంది మానందముం బొందుచు న్ఘోరదుర్వారనిస్సారసంసారకూపార పారంబునుం జేరి నీదౌపరత్వస్వరూపంబుఁ బ్రాపింపఁగా నోపు నో పుండరీకాక్ష యీయక్షయాజాండభాండంబులం గుక్షినిక్షిప్త విక్షిప్తముల్సేసి రక్షించుదీక్ష ల్నిరీక్షించు నీ వేల నీ వేల నీ వేల నుద్వేల దుర్విక్రమాభీల విద్విట్కృతోద్వేగయోగార్తి ఘో షించు మమ్మేల రావందువంచుం గడు న్నమ్మి యుండం గృపా యత్తచిత్తంబునం దత్తఱం బంద నీకుండ నీప్రాహాలీలాసము త్సాహమాదివ్యదేహంబు దర్శించు భాగ్యంబు మాకుంబ్రసా దించితే నింతకు న్మున్నుగా నెన్నియో వైభవోదాత్తలీలావతా రంబులం బూర్ణ తిర్యక్స్వరూపంబుగా నర్ధతిర్యక్స్వరూపంబుగాఁ జూపి పాపిష్ఠరక్షఃకృతోపప్లవంబు న్నివారించి తీ వింక మాయం కిలిం దీర్పఁగా నిప్పు డొక్కింత యేదేనియుం బిన్ననై యున్ననుం బన్నుగాఁ జెన్నుగా వన్నెఁ గాన్పించి వర్ణింపఁగా వర్ణియాంసట్టి రూపంబుచే నేపు దీపింపఁగా నోపరంధామ యుద్దామసామర్ధ్యముం జూపవే పాపము ల్బాపవే యాపదుద్ధారకా కోపకాపట్యనిస్తారకా సచ్చిదానందకందా సదాస్పంద గోవింద మమ్ముం దరిం జేర్చి కాపా డవే దేవదేవా నమస్తే నమస్తే నమః. 74

మ. అని యాసర్వసుపర్వ లాత్మదశ లాత్మాభీష్టము ల్విన్నవిం
చిన భక్తాభయదానదక్షుఁ డగు లక్ష్మీశ్రవక్షుఁ డబ్జాక్షుఁ డి
ట్లనియె న్వారలఁ జూచి మీచిరతరాయాసంబు లిం కుండు నే
చనుఁడీ మీరలు మీయథాగతముగాసంత్యక్తసంత్రాసులై. 75

క. అన విని యాగీష్పతి యి
ట్లనియె న్నీ వానతిచ్చినది వరమే యై
నను సైరింపఁగవలె నొక
మనవి నొనర్చెద[1]మరుత్సమాజశరణ్యా. 76

క. దేవరసంకల్పంబ క
దేవిశ్వోత్పత్తిసంస్థితిలయంబులనం
గేవల మఘటనఘటనా
ప్రావీణ్యాత్మున కొకింతపనియే యిదియున్. 77

క. చనుఁడిఁక శ్రమముండు నె మీ
కనినంత నె వెఱవు దొలఁగునటె యిది యన్నం
బనినం దీరు నె యాఁకలి
తిని తనియక యున్నచో [2]క్షుధితునకు నెందున్. 78

ఉ. నేరము నేరు పెంచకుము నేరము నీకడఁ గోర్కెఁ దెల్ప నీ
వారముగాన నిట్లు బహువారము దెల్పఁగఁ జెల్లె మాకు నీ

---

1. దేవతా సమూహము. 2. ఆఁకలి గలవాఁనికి.

సారముఁ దొల్లి చూపితి విసారముఖోత్తమదివ్యమంగళా
కారము లూని యిప్పు డుపకారము నే తను వూని సేసెదో. 79

క. ఎప్పటి కెప్పగిదిని మ
మ్మెప్పటి వలెఁ బాదు కొల్పె దెఱిఁగింపుము మా
యప్పా దార్ఢ్యస్థితికై
యిప్పాటనభీతమతుల కెఱుఁగఁగ వలసెఁ. 80

గీ. ఏను జీవుఁడ ననియు నీ వీశ్వరుండ
వనియు రూఢార్థసంజ్ఞ విఖ్యాత మగుట
[1]మృద్ఘటస్వర్ణభూషోపమేయ మగుచు
మనకుఁ దనరారుఁగాదె సంబంధ మీశ 81

చ. అన విని జీవుఁ గాంచి పరమాత్ముఁడు వల్కె దయాత్ముఁడై స్మితా
ననమున సంజ్ఞ రూఢమయిన న్మఱి యౌగిక మైన నేమి న
న్ననుఁ గద వాఁడు భేద మని కాని యభేద మంటచుఁ గాని యె
వ్వనిమతి జీవుఁ డీశ్వరునిభాస మటంచు దృఢత్వ మొందునో. 82

గీ. ఏలకామ్యార్థులైన మీ కిపుడు మోక్ష
సరణి యిట్టిది యని దెల్పఁజాలదొక్కొ
యింతమాత్రంబె యీ తెల్వి దృఢముగాఁగ
మదిఁగుదురుకొన్న నో బుధమాన్యచరిత 83

1. మట్టి బంగారు నగలు.

గీ. క్షణికమదమాత్రమున నిట్లు సంభవించె
నధిగతసుధర్మఁడైన బుధాధిపతికె
నిత్యమదమత్తులకు నెట్లు నిల్చియుండు
ననిశముగ స్వర్గభోగ మయ్యసురులకును 84

క. అని యింద్రువంక మొగమై
వనజాక్షుం డాన తిచ్చె వాంఛాలాభం
బొనగూడునె తపమునఁ గా
కనఘుం బది సకలవాంఛితార్థము లొసగుఁ. 85

మ. స్థిరపై నొప్పుక లింగమండలమునన్ దివ్యస్థలం బస్మదా
దరణీయం బఖిలేష్టదాయకము సిద్ధక్షేత్రమై [1]తార్క్ష్యభూ
ధర మష్టాక్షరిమంత్రరాజము సముద్యన్నిష్ఠ నచ్చోఁ బురం
దరభక్తిన్ జపియించు నాతనికిఁ జేతం జిక్కు నిష్టార్థముల్. 86

క. నీవచ్చో మిత కాలం
బావిర్భూతప్రపత్తినమ్మంత్రజపం
బావర్తించిన మదిలో
భావించిన వాంఛితార్థ ఫలము లభించున్. 87

ఆ. వె. అని యనుజ్ఞ నొసఁగి యాంగిరసుని గాంచి
వనజనాభుఁ డిట్టు లనుచు నాన

1. గరుడాద్రి.

తిచ్చె నేము నిశ్చయించినకర్జంబు
లెల్ల నొకట నిర్వహింపవలయు. 88

సీ. వచ్చినదారిగా వరుసదైత్యుల నెల్లఁ
బాతాళమును జొరఁబనుచు టొకటి
మీ మీ పదంబుల మిమ్ము యథాపూర్వ
ముగ సంప్రతిష్ఠించు పూన్కి యొకటి
నను సుతుఁగనఁ దపంబును బొనర్చెడున య్య
దితి కశ్యపులకోర్కి దీర్చు టొకటి
తార్క్ష్యశైలాఖ్యసిద్ధక్షేత్రమహిమంబు
స్థిరముగా వెల్లడి చేయు టొకటి
తే. గీ. యిన్నియును మాదు వైదగ్ధ్య మెఱుక వడఁగ
నొక్కట రచింప నవతార మొందువార
మేము మీ కోరినట్టుల యిపుడ పిన్న
యనఁగ వర్ణియనంగ మీరరుగుఁ డనిన. 89

ఉ. దేవ మహాప్రసాద మని ధీరమతిం దగ సాఁగి మ్రొక్కుచో
నావనమాలి కన్మొఱఁగె నంత సురల్దలి దండ్రులందముం
గావరె యంచు నయ్యదితి కశ్యపులం గని తెల్ప గారుడ
గ్రావముఁ జేరి బంధుర సరస్తటసీమ వసించి రందఱున్. 90

ఉ. అచ్చట నొక్కకూటతటమం దుటజంబున నంబుజోదరుం
బొచ్చెము లేని ముచ్చటల ముద్దులపట్టిగఁ గాంచు[1]నిచ్చల

1. కోరికలతో.

[1]న్నిచ్చలు [2]నిచ్చలంబయిన నిష్ఠఁ దపం బదితిద్వితీయుఁడై
యచ్ఛపుఁబూన్కి గశ్యప మహర్షి యొనర్ప వసించి హర్షియై.

క. అరుణోదయంబునకు ము
న్నరుణోపముఁ డతఁడు లేచి హరిఁ బొగడుచు బం
ధురగతిఁ సతితోఁ రా బం
ధురసరసిఁ[3]గృతావగాహనుండై యంతన్. 92

గీ. వాస రారంభవిధు లెల్ల వరుస నందు
నెరపికొని లేచి ధర్మపత్నియును దానుఁ
బర్ణశాలకు నరిగి తత్ప్రాంతసీమ
వెలయు నశ్వత్థతరుమూల వేదిఁ దరిసి. 93

సీ. అనతిదూరమున దర్భాసనంబునకుఁ బా
ర్శ్వమునందు నలఁతి పావలను విడచి
సప్తకచ్ఛములతో సరిమడిమలు దాఁక
నునుఁబట్టుపరిధానమును ధరించి
దళముగా ముఖముఖస్థలముల గోపిచం
దనమున నూర్ధ్వపుండ్రములు వెట్టి
పద్మాసనస్థుఁడై పైనిండ ముసుగుగా
నావికప్రావార మలవరించి

1. ఎల్లప్పుడు. 2. చలములేకుండ. 3. స్నానము చేసిన వాఁడై.

తే. గీ. వ్రేలదామ్రమయామలస్థాలికయును
గేలఁ జిఱుతప్రవాళాక్ష మాలికయును
గ్రాలఁ బ్రాఙ్ముఖుఁడై యర్ధమీలితాక్షుఁ
డగుచు మునిద్వాదశాక్షరి దగ జపించు

ఉ. ప్రొద్దున లేచి బంధురసరోవరమందునఁ దీర్థమాడి పే
రొద్దికతో సమిత్కుశఫలోదకపుష్పము లంది యిచ్చుచుం
దద్దయు భక్తిమీఱ నిజనాథుఁడు చూడఁగ నీడగా సదా
యొద్ద మెలంగునయ్యదితియున్ క్షణమైనను బాయ కర్మిలిన్. 95

సీ. వెలిపట్టురైకపై వీఁపు నిండఁగ బైఁట
మలఁచినమడికచ్చవలువతోడఁ
దడిపి దళంబుగాఁదగనలందినచాయ
పసుపునిగ్గుల వక్త్రపదముతోడ
నలికభాగమునందు నడ్డుగాఁ బెట్టిన
పొడికుంకుమపుబొట్టుపొందు తోడ
తెప్పలపై పాటుకప్పు దేరగఁ నిడ్డ
గాటంపుఁ గాటుక కనులతోడ

తే. గీ. సామిపలితసమాయతాశ్యానమృద్వ
రాళపశ్చాద్ఘటితకచగ్రంథితోడ
నెదుట నర్ఘ్యంబు గూర్చి యయ్యదితి సేవ
సేయుచుండును బతితపస్సిద్ధి వోలె. 96

క. మునిపతి యీగతిగఁ దపం
బొనరిచి దీక్షావసానమున నొక్కఫలం
బును బ్రేమోలఁ బడసి తా సగ
మును గొని సాఁబాల్కశత్రమునకు నొసంగన్. 97

ఉ. ఆమె మహాప్రసాద మని యంజలిపట్టి గ్రహించి భక్తితో
వేమఱుఁ గంటనద్దికొని వేడ్కభుజించె మహాపతివ్రతల్
సామి భుజించు వెన్క విఘసం బమృతాధిక మంచు నెంత్రు స
ద్భామల కంతకంటెను సుధాక్రతుశేషములా విశేషముల్. 98

క. పతిభుక్తశేషభక్షణ
మతివల కిష్టార్థసిద్ధి నాయుష్యంబుఁ
సతతము సౌభాగ్యము సం
తతివృద్ధి శుభంబు సిరి ముదంబు నొసంగున్. 99

గీ. ఏరి కేనియు ధర నొరులిడక యుండఁ
గా నయాచితముగఁ బ్రాప్తమైన ఫలము
భావినిజవాంఛితార్థలాభంబుఁ దెలుపు
గాన నది తెల్పె వారిసంకల్పసిద్ధి. 100

క. సంపూర్ణసమాప్తతప
స్సంపత్ఫలతత్ఫలైక చర్వణమహిమం
బెంపగుసొంపున నమ్మని
జంపతులకుఁ బొడమెనిందు జవ్వన మంతన్. 101

సీ. ఉలుపాగ లావణ్యమలవరించిన [1]భస్త్రి
కయసంగఁ దనుపు బింకము వహించె
ననలఁ దా లిడఁ బ్రాయ మరవ్రాల్చి క్రమ్మఱ
నిల్పుదల్పు లనఁగ నెప్ప లెగసె
విడిసినజర పీడవృక్షపక్షిన్యాయ
గతి నంగకంబుల కంప ముడిగె
మునుముట్టు డించినముదిమిసైన్యం బనాఁ
బలిత మెల్లను బటాపంచలయ్యె
తే. గీ. వార్ధకపుదాడిఁ గాంచి యౌవనవిభుండు
వలసఁ బోనెంచి శృంగార వాహినీశు
తోడుఁ గని దంపతీదేహ దుర్గసీమఁ
జలన మొందక పురికొని నిలిచె నపుడు. 102

క. అపు డా దంపతులకె కా
దుపత్యకాధిత్యకాంతరుర్వీధరభా
గ్విపినమ్ములకును మాధవు
కృపయౌవన మంకురించి యిగురొత్తె రహిన్. 103

ఉ. అట్టివసంతవేళ విపినాంతర మందు మునీంద్రుఁ డింతితో
నట్టిటు సంచరించుచు వియచ్చరమంత్రినియుక్తిఁ గేలుగే

---

1. గాలితిత్తి.

ల్వటి [1]నికుంజగర్భములఁ బల్లవయుక్తిగ నంత నంతఁ జూ
పట్టినయప్సరస్సతుల వైఖరు లారసి కామవిద్ధుఁడై. 104

శా. ఆయాపుష్పనికుంజపుంజములలోనా యాకుటీరంబులం
దాయానిర్ఝరవారిపూరముల నాయాకూటఝూటంబులం
దాయాకందరమందిరావళుల నాయాసానుదేశంబులం
దాయావింతలఁ గాంచుచుం దిరిగి రత్యంతంబుఁ దద్దంపతుల్. 105

చ. అటులు పవల్ముని ప్రవరుఁ డాత్మసతీసముపేతుఁడై [2]కుభృ
త్కటకదరీఝరీవిపినకౌతుకము ల్గనుఁగొంచు శేల న
య్యుటజముఁ జొచ్చి యచ్చట సముత్సుకలీల నోలిఁ గేల లం
పటమతియై సుఖానుభవ భవ్యత నుండఁగఁ గొన్ని నాళ్లకున్. 106

క. అప్పుడఁతులమిన్నకు నెల
దప్పెం దోడ్తోసురవ్రతానముముప్పాల్
దప్పెం దైత్యులయొప్పుం
దప్పె న్మునియెడ మనోజు దర్పముఁ దప్పెన్ 107

సీ. పొడము దట్టపుఁజిట్టుముల కుమియఁగ నెంచ
కోకిలింతల కంతయొల్లఁ బోక
నడల మాంద్యము గ్రమ్మనడియాడుటుడుగక
నిద్దుర గదురఁగ నెప్పవ్రాల్ప

1. పొదరిండ్లు. 2. కొండ చఱియ.

కావులింతల కోర్కింత్రైనఁ గ్లాంతి వహింప
కరుచి పెల్లైన భోజ్యముల విడక
బడలిక ల్దఱుచైనఁ బనిపాట లేమఱి
కూర్పులు మెండైన నుసురు రనక
తే. గీ. పెక్కుగాన్పులు గాంచి పెంపెక్కినట్టి
యదితి యవ్వేళ నొదవుచూలాలితనము
నందుఁ దొలుతటి నవదోహదాభ్యుదయము
నాఁటివలెఁ గాక దృఢపరిపాటి నుండె. 108

చ. నడుము మిది పేద చంద్రకలనం బచలోన్నతి మావిధంబునం
బడసెనె యంచుఁ దన్ను నగువక్త్రముఁ జన్గవ వెల్లబాఱ న
ల్పడరెడు మోములం దనర నయ్యెడ నందఱు వేడ్కఁ జూడఁ జా
లెడునభివృద్ధిఁ గాంచె నిలలేములు కాపురముల్ఘటించునే. 109

శా. మింటం ద్రిమ్మరువారిఁ బ్రోచుటకు లక్ష్మీశజాని గర్భస్థుఁడై
యుంటం బంటవెలందితోడ భవదీయుల్గూడ రక్షార్థ్వా లీ
దంటం గాఁవగ వేఁడుకొమ్మనుచు నాత్మక్రోడముం జేర్చె నా
మంటిం దింటకునై కడంగె మునిభామారత్న మవ్వేఁకటిన్. 110

ఉ. ఆ దరి నున్న తాపసకులాశ్రమసీమల నుండి పెద్దము
త్తైదువరాండ్రు కొంద ఱపు డామెను జూడఁగ నేగుదెంచి స
మ్మోదపుగోష్ఠిచే నుబుసు పుత్తురు వింత తెఱంగు కందమూ
లాదుల సంతరించుకొని యుర్మిలి నూడిదఁ దెచ్చి యిచ్చుచున్.

సీ. నివరిప్రాల్వోసి వండినబష్కయిణిపాల
పరమాన్న మొకమానిపత్ని యిచ్చెఁ
దనప్రోవుఁ గాంచి క్రొత్తగ ఫలించిన వింత
చెట్లపండ్లొకమునిస్త్రీ యొసంగె
నిజగృహాశాభిమంత్రితసిద్ధమహిమాక్ష
తల నొక్కమునివధూతిలకముని చె
యనమయష్టికపిష్టనవఘృతపక్వఖా
ద్యము లొక్కతబిసియిల్లాలు దెచ్చెఁ
తే. గీ. దాను బూజించు దేవిపాదముల మీఁది
గొనబు నిర్మాల్య మొక తపోధనపురంధ్రి
యిడియె సీమంతశుభశోభ నెసఁగుకశ్య
పమునిసామంతసీమంతవతికి నచట. 112

సీ. చరణము ల్నిడుపుగా సాఁచి కేలొక్కటి
పుడమిపై నూఁతగా నిడి వసించుఁ
గూర్చున్నతఱి నాయకుండు రాదపుడవ్వ
నను గాంచి కడు ప్రయత్నమున లేచు
ద్విత్ర్యంఘ్రివిన్యాసమాత్రాన దరితరు
స్కంధాదులవలంబకముగ నడచు
నొకకొంత లేనియోపికఁ దెచ్చికొని భర్త
నుపచార మొనరింప నుద్యమించు.

తే. గీ. నలసదృష్టులవలయువస్తులను దెలుపు
నలఁతి యెలుఁగునఁ బరిమితోక్తులనుబలుకు
గలికి నీర్కావివలిపెంపు వలువఁ దాల్చు
నెలలు నిండినకోలఁది న వ్వేలఁది మిన్న 113

క. ప్రొద్దులు కడచినకోలఁది
న్నుద్దియ కచ్చోట వేలుపుంజేడెలు తా
రొద్దఁజరించుచుఁ దద్దయు
నొద్దిక నొనరించుచుండి రుపచారములన్. 114

క. వైజనన మిదియె యని బరు
వై జననము నొంద నున్న యాగర్భపుసా
రాజనని బడలికలతీ
రాజననిచయమున కెఱుఁగు నట్లొనరించెన్. 115

సీ. శ్రవణగమ్యము నారణ్యకోపనిషత్తుఁ
బారాయణముఁ జేయ వలయు నేమొ
బలమొలర్పఁగ మహేశ్వరుని ముంగిటి నందిఁ
బట్టి యిట్టటు ద్రిప్ప వలయు నేమొ
గుక్క లొక్కటిరెండుఁ గ్రోలఁగా స్వధితిచే
జలము మంత్రించి యీ వలయు నేమొ
కచమునం దిడుకొనంగాఁ బత్రపుటముపై
విలిఖించి యంత్ర మీ వలయు నేమొ

తే. గీ. యనుచు[1]శీఘ్రప్రసూత్యుపాయజ్ఞులెల్ల
నుటజబహిరంగణంబున నుండి రపుడు
జరఠమానికుటుంబినీజననియుక్తి
నొక్కటఁ దదీయబాలకాహూతు లగుచు. 116

గీ. అపుడు పురిటింటిదరినున్న యాండ్రలోన
నొకతె శీర్షోదయమనునర్థోక్తితోన
పలికె మగవాఁడె యనుచు సంభ్రమ మెలర్ప
నీవలను వేళఁ బరికించు ఋషులు వినఁగ. 117

ఉ. అంత [2]నభస్యమాసమున నాదిమపక్షమునందు యామినీ
కాంతుఁడు [3]శ్రోణయందు రవి కన్యకయందున నుండ ద్వాదశిం
[4]గంతుగురుండు లోకములఁ గాచుటకై యుదయించె వాసరా
భ్యంతరవేళ న[5]య్యభిజి దాహ్వయలగ్నమునం గృపామతిన్.

ఉ. అప్పుడు విప్పుఁగంటిదొర లందఱు నం దరుణాబ్జనేత్రముల్
కప్పు మెఱుంగుగాత్రమును గల్గిన యమ్మనిపట్టి పొట్టిగా
పొప్పఁగఁ బుట్టినట్టి పురుషోత్తముఁగాఁగఁ దలంచి సన్నుతుల్
చొప్పడఁ దొంటి డెప్పరపుఁ జొప్పడ గెం దమకంచుఁ బ్రీతులై 119

క. ఆనతి యొసఁగిన గతి మన
పై నతికృప నవతరించె భగవంతుఁ డటం

---

1. వేగము పురుడు వచ్చునట్టి యుపాయములు. 2. భాద్రపద. 3. శ్రవణ.
4. విష్ణువు, 5. సూర్యుఁడున్న రాశికి 4-వ లగ్నము.

చానతిపూర్వకముగఁ బెం
పై నతిరోధానశక్తి నరసిరి భక్తిన్ 120

క. [1]సుమనఃకాండంబుంగ నల
[2]సుమనఃకాండగురుఁ డదితి సూనుం డగుటన్.
[3]సుమనఃకాండంబులు మహీ
[4]సుమనఃకాండములవృష్టిశోభిలఁ జేసెన్. 121

గీ. జాతకర్మాఖ్యసంస్కార జాతకర్మ
శాలిఁ గావించె సుతు మునీ శాలిమాళి
వీత విచికిత్స యజ్ఞోపవీత మొసఁగి
నాభి కృంతనవిధివిధా నాభికాంతు. 122

క. అధిగతమనోరథుం డా
బుధమాన్యుఁడు శిశుకుశలమునకై రక్షో
వ్యధఁదొలఁగఁగఁ బదిప్రొద్దులు
విధిగ ఫలీకరణహోమ విధియొనరించెన్. 123

సీ. ఉల్లిపొట్టావాలు సుముక రాఁజెడుపొగ
ల్గడపల పొదిగిళ్లఁ గ్రమ్ముకొనఁగ
గుమ్మంపుఁ బైవంకఁ గ్రుచ్చినపచ్చిభూ
తులసి మాబీరతోఁ గలసి వ్రేలఁ

---

1. మంచిమనస్సులు. 2. దేవతాగురుఁడు.
3. దేవతలు. 4. పుష్పవృష్టి.

బార్శ్వద్వయమునందు వ్రాసినగోమయ
ప్రతిమ లస్పష్టాంగ భంగిఁ దోఁప
నింగువ పొంగింపు లెసఁగింపఁ బొసఁగిన
కటుగంధ మెల్లెడఁ గడలు కొనఁగఁ

తే. గీ. జమురు ముంచివెలింగించి సంజనిడిన
దృష్టిదీపాల వెలిమిడి తెట్టె లలరఁ
గాఁపు గూర్చినతత్సూతికాగృహంబు
నాగ్రహంబున నేగ్రహం బావహించు. 124

మ. పదిరేలుం బదిలంబుగాఁ గడపి యా బ్రహ్మణ్యుఁ డాబ్రహ్మఁగ
న్నదారం బుత్రునిగాఁగఁ గంటి ననునానందంబు డెందంబునం
బొదల న్వామన సంజ్ఞ నామకరణంబుం జేసి యచ్చో సభా
సదు లాశీర్వచనంబు లొక్కట సమంచద్రీతిఁ గావింపఁగన్.

ఉ. [1]ఆసతిమౌళియందుఁ బసు పద్దినయక్షత లీక్షితంబులై
భాసిలె భాసమానగతి వార్షికవారిదమండలాంతరా
వాసములై కరం బచిర భావినవాంకుర రేఖఁ దాల్చి యెం
తే సొబ గొందు నమ్మెఱుఁగుఁ దీఁగెలదుంపలనంగ నయ్యెడన్.

సీ. నడికట్టు బిగియించిన చెఱంగు సరిక్రొత్త
చీరలో సందిట శిశువుఁ బొదివి

---

1. స్త్రీలలో శ్రేష్ఠురాలు.

యాపాదమస్తకంబైన కొంబసుపుని
గ్గుల పచ్చిమేను సంకోచ పఱిచి
యులసాంఘ్రి విన్యాసముల పెద్దలున్నచ
క్కటి కెల్లనల్లన గడచినడచి
మనుమని మీ చిన్ని మనుమని దీవింపుఁ
డని వారలకు నాత్మ తనయుఁ జూపి

తే. గీ. భర్తయనుపదమాసాధ్వి బాలసారెఁ
బందిటఁ జరింప మునులు దేవతల తతులు
వెత లడఁగెనింకననుచుసమ్మతుల నతుల
గతుల మన్నించి రామెసన్నతులనుతుల. 127

క. అందలి విప్రుల మునిసం
క్రందనుఁ డందఱను విందుకై పిలిచి తగన్
మందిరమున నాప్రొద్దెల
మిం దనియఁగఁ జేసె నిష్టమృష్టాన్నములన్. 128

మ. నెలలో నొక్క సువాసరంబునఁ బురంధ్రీశ్రేణి సంప్రీతి పా
టిలఁ బిల్పించి కడంకమై నదితి పట్టిం దొట్లలోఁ బెట్టి జో
లలఁ బాడించి యుదంచనగ్రహణలీలాకౌతుకాచారము
ల్వెలయం గప్పకు మ్రొక్కి వాయనము లిప్పించె న్సమంచద్గతిన్

క. విప్రమణి నందనున క
న్నప్రాశన కేశఖండనముఖసుసంస్కా

రప్రక్రియలను గ్రమముగ
నప్రతిహతవిధి నొనర్చియలరుచు నుండెన్. 130

చ. [1]ఉపనయనక్రియోచితవయోయుతుఁడై సుతుఁ డొప్పఁటన్ ద్విజ
త్వపుసిరి సంఘటింపఁ దన పట్టి కిదే తగు ప్రాయ మంచుఁ గ
శ్యపుఁ డపు డాత్మ నెంచి ప్రణయానపాయయా సహధర్మచారిణిం
దపసులనుం గనుంగొని మనంబునఁ గల్గుతలంపుఁ దెల్పినన్. 131

క. వారందఱుఁ దనతో నను
వారం దలఁచుగ మనః ప్రియం బని యంగీ
కారము నెఱిఁగించిన నధి
కారమున ముహూర్తనిశ్చయం బొనరించెన్ 132

సీ. ద్రాఘిమాత్రోత్తంభి తస్నిగ్ధసరళపూ
గప్రకాండోచ్చప్రకాండజాల
మాశుతంతన్యమానాయతలాంగలీ
పత్రపరిచ్ఛదోపచితలంబు
సహసాగ్రథితచూత సాలజాతాచ్ఛిద్ర
చారుపల్లవజాత తోరణంబు
ఝడితిసంఘటితచంచద్దలాంచత్ఫల
స్తబకరంభాప్రతి స్తంభమూల

---

1. వడుగుచేయుట.

తే. గీ. మగుచు నజ్జన్నిగట్టున్న యట్టి నట్టు
సుట్టు దట్టంబుగాఁ గను పట్టె వేగ
మానిమాణవకాకల్ప్య మానమైన
[1]కాయమానంబు శుభసూచకముగ నపుడు. 133

సీ. తత్రత్యఘనతపో ధనజనాకారణా
కారణవ్యగ్ర సంచారపరులు
జలసమిత్కుశఫలాక్షత వేదిపీఠాది
కద్రవ్యసంధాన కరణపరులు
శాకాజ్యదధిపయ శ్శర్కరాముఖ[2]మహా
నసయోగ్యవస్తుసన్నహనపరులు
ప్రాంతాశ్రమాగత బ్రాహ్మణౌఘస్వాగ
తప్రశ్నముఖ్యసత్కరణపరులు

తే. గీ. నగుచు నమ్ముని రాజశిష్యప్రశిష్యు
లఖిలనిర్వాహకులుఁ దారలై చరించి
రపుడు గురుకుల మరయ విద్యార్థికోటి
కాత్మగృహనిర్విశేషభావ్యంబు గాదె. 134

సీ. శిర సంటె నొకసువాసిని నెన్నుదుట శోభ
నంపుబొట్టిడి దీవనల నొసంగి

1. పాక ; పందిరి. 2. వంటయింటికి యోగ్యమైన.

నలుఁ గిడె నొకవధూతిలకంబు గంధాము
లకముత్తోఁ బసుపు మేళన మొనర్చి
చిక్క వాఱక యుండ నొక్కసీమంతిని
యటకలివెట్టెఁ బాయలుగ దువ్వి
జలకంబు లాడించెఁ గలశంబులను ముంచి
యొక్కపురంధ్రి [1]కవోష్ణవారి

తే. గీ. నొకకుటుంబిని ప్రాంశుపీఠికను నిల్పి
వలిపె నీర్కావి మడుఁగు దోవతి చెఱఁగు
చమిరి మైతడి యొత్తి [2]కైశ్యంబుఁ దుడిచి
కొన ముడిఘటించె నమ్మునితనయమణికి 135

చ. తిలకముఁ దిద్దె నెన్నుదుటఁ దీరిచెఁ గాటుక లోచనంబులన్
లలి నిడెఁ జుక్కఁ జెక్కిటను లాక్షఁ బదంబులయందుఁ బూసె మైఁ
గలప మలందెఁ బూసరులఁ గంధర వైచెను బచ్చగోఁచియున్
మొలఁ గదియించె నొక్కసతి పొందుగ నమ్మునిపట్టి కంతటన్. 136

ఉ. ఆ ముని దంపతు ల్దగ [3]నహర్ముఖమందుఁ గృతాభిషేకులై
[4]క్షౌమవసానులై ప్రవిల సత్తిలకాళికులై సుగంధచ
ర్చామహితాంగులై సుతుకరమ్ములఁ దమ్ములము న్ఫలంబులు
న్నెమ మెల్పరఁగా నునిచి నిల్పిరి పందిట వేది ముందటన్. 137

1. వెచ్చని నీరు. 2. కొప్పు.
3. ప్రొద్దున. 4. తెల్లనిపట్టు బట్టలు కట్టుకొన్నవారై.

సీ. సఫలతాంబూలహస్తద్వయంబుగ సభా
యై నమ యంచు సభ్యానుమతిని
బ్రార్థింపఁగా వారయంముహూర్తస్నము
హూర్తోస్తటంచుఁ బీఠోపవేశ
మున కియ్యకొనఁగఁదాంబూలఫలములు [1]బు
రోధచే నుంచి పుత్రుఁడును బత్ని
వరుస సవ్యంబుగా వసియింపఁ గూర్చుండి
యాచమనత్రయం బాచరించి

తే. గీ. యతఁడు విఘ్నేశపూజపుణ్యాహవాచ
నములఁ గావించి యుపనయనక్రియార్థ
మంతసంకల్ప మొనరించియాత్మజునకుఁ
బసుపుఁ బ్రాల్నించి యుంపించెఁ బంచశిఖలు 138

గీ. ఆతఁడు పునశ్శుభోదకస్నాతుఁ డైన
సుతుని దగ సంభృతబ్రహ్మ సూత్రుఁ జేసి
యంకురార్పణ మొనరించి యటుల సకల
నాందిముఖకృత్యసంవిధానములఁ దీర్చి 139

గీ. బ్రహ్మచారులఁ బూజించి స్వసుతువారి
పంక్తి గూర్చుండఁబెట్టి యవ్వారతపస్వి

1. పురోహితుఁడు.

యర్థ[1]నిర్వర్తితాభ్యవహారుఁడైన
వాని లేవంగ నెత్తె సత్వరముగాఁగ. 140

మ. ఉచితాచారముగాఁ బురోధయును దా[2]నుచ్చావచాశీర్వచో
రచనాసంభ్రములై సదస్యులగు సర్వబ్రాహ్మణగ్రామణుల్
ప్రచురప్రక్రియనానతీసుతునకున్ బ్రహ్మోపదేశంబు మా
నిచయాధీశుఁ డొనర్చెఁ [3]దజ్జ్ఞ సుమనో నిర్ణీత లగ్నంబునన్. 141

గీ. అంత నాతఁడు మౌంజికృష్ణాజినంబు
పసుపుగోఁచియు దండంబుఁ బంచశిఖలుఁ
దనర జనయిత్రియొద్దఁ బ్రాథమికభిక్ష
గొని పిదపఁ గైకొనియె భిక్ష జనకునొద్ద. 143

క. మహాదాశీర్వచనధ్వని
ముహురుక్తతథాస్తువాదముగ ముగియు మహా
మహులగు నార్యులకు ద్విజో
ద్వహుఁ డతఁ డప్పుడు ఫలప్రదానములొసగెన్

ఉ. మున్నుగఁ దామె కైకొన సముత్సుకులయ్యును వారిలోన వా
ర్మున్నగ మీరు కొండు మఱి మున్నుగ మీరలె కైకొనుండటం
చు న్నిజము న్వలెం బ్రియముఁ జూపుచు సభ్యులొకింతవంతు పో
కున్న నొసంగి రన్యముని కొక్కని కగ్రఫలప్రదానమున్. 144

1. భోజనాదికము చేసినవాఁడై. 2. వివిధములయిన. 3. తెలిసినజ్యోతిశ్శాస్త్రపండితులు.

సీ. స్నాతాగతోప విష్టస్వస్తి వాచనో
త్సుకబుభుక్షుద్విజస్తోమపంక్తి
యాస్తీర్యమాణాతివిస్తీర్ణ సాగ్రాంశు
మత్ఫలాతరుద[1]ళామత్రే వటువు
పాత్రాభిఘారాది పరివేషణనియుక్త
సాత్త్వికాచార విచ్ఛాత్రగణము
తారతమ్యగృహీత తాంబూల దక్షిణా
ప్రతినివృత్తోత్తమ బ్రాహ్మణంబు
తే. గీ. నగుచుఁగనుపట్టె మధ్యాహ్న మందు మాని
భోజనావాసకాయమానాజిరంబు
బాంధవాతిథివి ప్రసంబాధకలన
వలన మిక్కిలి గన్నులపండు వగుచు. 145

సీ. పుచ్చుకొన్నవితోడిబుడుతల కిడి వెండి
యును దమ కంచుఁగైకొనెడు వారు
బాల్యంబునుండి యభ్యాసంబు లేదంచుఁ
గాని వేఱొకనిచేత నునుచు వారుఁ
గడులేఁత వివి యంచు విడిచి పళ్లెరమందు
ముదురు ప్రక్కలకునై వెదకు వారుఁ
గసటు వోవంగఁ బోఁకలు నున్నముడికింప
నెసటఁబోసి రటంచు నెంచు వారు

1. అమత్రము=కంచుపాత్రము.

తే. గీ. నై [1]యనాహూతజానపదాతిపూత
నైష్ఠికశ్రోత్రియబ్రాహ్మణప్రవరులు
పీటికాదాతల కొకింత విసువుఁ జేసి
రంత నొకకొంతవడిఁ జత్వరాంతరమున 146

క. తద్వాసరాంతమున స
ద్విద్వత్కులశేఖరుండు విశ్రుత శాస్త్రో
ద్యద్విధిసంధ్యావందన
సద్విధము నుపక్రమించె స్వతనూజునకున్. 147

చ. ఘనమతి నాతఁ డాభ్యుదయికంబుఁగ మూఁడవనాఁడు కూర్మినం
దనునకుఁ గల్మిమీఱఁగ సదస్యులనెల్లర గారవించి దీ
వన లొనరింపఁ జేసి మణివస్త్రసువర్ణవిభూషణాదులం
దనిపెఁ దపోధను ల్దలఁచినం గొదయే వివిధార్థసిద్ధికిన్. 148

క. ఘనమతి నాలవనాఁ డ
మ్ముని పతి తన తనయునకును మునుకొని మేధా
జననం బొనరిచి బంధుల
నని పెఁ దగ బహూకరించి యనుపమ గరిమన్. 149

క. ఈవడువున నమ్మునిపతి
యావడుగు ద్విజత్వ మొందియభివృద్ధిఁ గనం
గా విధిగ నుపాకర్మము
గావించెం [2]గోవిదప్రకాండ యుతుండై. 150

---

1. పిలువకుండ వచ్చువారు. 2. తెలిసిన వారు.

క. ఆవెంట వటువు మదిసం
భావించి గురూపదేశమాత్రసవినయుం
డై వేదశాస్త్రముఖనా
నావిద్యాగ్రహణధారణప్రౌఢిఁ గనెన్. 151

సీ. గురుజనంబులకంటె గుటిగాఁగఁ బూర్వప్ర
బోధుఁడై తత్పదంబులకు మ్రొక్కి
కల్యకాలోచితకరణీయములఁ దీర్చి
కొని పూర్వపాఠచింతన మొనర్చి
పఠనీయపాఠార్థపద్ధతి యోజించు
కొని సహాధ్యాయులఁగూడి యేగి
ఫలసమిత్కుశజలంబులు దెచ్చి యర్పించి
జపదేవపూజావసరములందుఁ
తే. గీ. దటి నిరీక్షించి యుండి తత్పరిసమాప్తిఁ
గ్రమము మీఱంగఁ బూర్వపాఠములఁ జదివి
నియతి భుజియించి తగుగోష్ఠి నెఱపి పవలు
రేయి గురువులపిదప నిద్రించు నతఁడు. 152

క. [1]కలశభవప్రతిపాదిత
కలంబకార్ముకనిషంగకరవాలకరా
ఖలదూషణ ఖరముఖదు
ర్లలితగుణాకరనిశాచరప్రశమకరా. 153

---

1. అగస్త్యుఁడు.

శా. [1]ఛత్రగ్రాహిక దూర్మిళారమణ చంచచ్చామరగ్రాహిక
చ్ఛత్రుధ్వంసక కైకయీతనుభవాద్యాసౌవిదల్లప్రజి
త్పాత్రా సభ్యదగాటభల్లుకమణీపౌరాణికత్ప్రావనీ
మిత్రాద్దాశకులేశ రాజ్యపదలక్ష్మీభూర్వహాత్పాదుకా. 154

స్రగ్విణి. శ్రీవిదేహక్షమాభృత్కుమారీధవా
పావమానిప్రశస్తస్వనామ స్తవా
రావణైశ్వర్యనిర్వాపణప్రాభవా
భావనాతీతదివ్యప్రభా గౌరవా. 155

—*:: గద్యము. ::*—

ఇది శ్రీమద్రామనామపారాయణపరాయణాభిధస్య కౌండిన్యగోత్ర
పవిత్రదేవులపల్లికులపయఃపయోనిధికళానిధిసీతారామశాస్త్రిపౌత్ర
వేంకటకృష్ణశాస్త్రిపుత్ర తమ్మనాభిధానాంతర వేంకటకృష్ణ
శాస్త్రినామాగ్రజన్మ త్రిలింగదేశాగ్రజన్మ సుధీ
విధేయ సుబ్బరాయశాస్త్రి నామధేయ ప్రణీతం
బైన మహేంద్రవిజయం బను ప్రబంధంబు
నందుఁ జతుర్థాశ్వాసము.

శ్రీ సీ తా రా మా ర్ప ణ మ స్తు.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ

---

1. గొడుగు పట్టువాఁడు.

శ్రీ రామ.

# శ్రీ మహేంద్రవిజయము

## పంచమాశ్వాసము.

శ్రీరమ్యవిక్రమక్రమ
కారుణ్యాగభీరతాదికల్యాణగుణా
ధార సుధారసధారో
దారవ్యాహార [1]దశరతాంగకుమారా. 1

గీ. అవధరింపుము శౌనకాద్యఖిలమౌని
మణులఁ దిలకించి రోమహర్షణసుతుండు
రహివచింపఁ దొడంగెను రాజభవన
చత్వరస్వనదానక స్వానపటిమ. 2

క. అత్తఱి బలి [2]పలభుక్కుల
సత్తముఁ డుత్తమయశుండు స్వారాజ్యశ్రీ
మత్తతను కెడయకుండ న
మత్తత నొకక్రతువుఁ జేయు మతి నతినియతిన్. 3

1. దశరథుని. 2. రాక్షసుల.

మ. ధరణీమండలి కేగుదెంచి ఖగనాథక్ష్మాధరప్రాంతమం
దరయ న్యోజనయుగ్మదూరమున వింధ్యాద్రిస్రవత్క్రోడరా
ట్సరిదభ్యర్ణమున న్జగత్త్రితయపూజ్యం బైనబ్రహ్మేశ్వర
స్ఫురితక్షేత్రము చెంత సంతతసువస్తుశ్లాఘ్యదేశంబునన్. 4

క. వాటముగా నాతఁడు క్రతు
వాటముఁ గావింపఁ జేసెఁ బ్రాగ్వంశగయూ
పాటీకనవేదీపరి
పాటీకనదనఘగర్భపదశాలముగాన్. 5

క. ఆతఁడు క్రతువం దీశ
ప్రీతిగ భువనైకవినుత రీతిగ విలస
ద్భూతిగ సకలేష్టదవి
ఖ్యాతిగఁ జేయంగఁ బూని యారంభమునన్. 6

గీ. సన్నిధికిఁ బిల్చి సేవితోశనుల సర్వ
మునిసముత్కరదుర్ధ [1]శాశనుల విప్ర
సాధుసజ్జనతాశిరోశనుల బంధు
సచివ భటముఖ్య మానుషాశనులఁ జూచి. 7

గీ. సాత్వికత మీఱ లోకైకసమ్మతముగఁ
జేయుజన్నంబునకు ఫలసిద్ధి గలుగుఁ

1. వజ్రాయుధములు.

గానమీరెల్లరను సహకారు లగుట
వలయుఁ గావున నాపల్కుపల్కు వినుఁడు. 8

క. దనుజులు మీరయ్యును [1]భవ
దనుజులు మనుజు లని సత్ప్రియంబునఁ జూడుం
డనిశముఁ దాలిమి గూడుం
డనిశముదాళిమిళితాత్ములగుచున్నటియుఙ్. 9

చ. మనుజుల గారవింపుఁడు సమర్చ లొనర్పుఁడు విప్రకోటికిఙ్
మునులకు భక్తియుక్తిఁ దగుపూజలుఁ జేయుఁ డభీష్టవస్తువు
ల్దనియఁగ యాచకావళి కుదారతమీఱఁగ నిండు నిండుమ
న్నన లొనరింపుఁ డింపు మదినాటఁగ నాటగఁ జూడ కర్మలిఙ్.

చ. అని నియమించి మించిన ప్రయత్నమునం గ్రతుయోగ్యవస్తువుల్
ఘనముగఁ గూర్చి ఋత్విజులఁగావ్యనియుక్తుల భక్తియుక్తిచే
ననుమతుఁడై వరించి యొక యుర్వముహూర్తమునందు దీక్షఁ బూ
ని నియతి మీఱఁగాఁ గడఁగి సిశ్చలనిష్ఠఁ బ్రవిష్టశాలుఁడై. 11

గీ. నిలిపెఁబూర్వోత్త [2]రారణులలవరించి
నిర్మథితవహ్ని యగుచు సన్నియతియుక్తిఁ
గని పరిస్తీర్ణ మగు వేది గార్హపత్య
దక్షిణాహవనీయము ల్దగ నతండు. 12

1. నీ తమ్ములు. 2. అగ్నిని పుట్టించు కాష్ఠము.

సీ. బ్రహ్మసమ్యగ్రీతి వహ్నులఁ బ్రణవింపఁ
జేసి క్రియ ల్పరీక్షించుచుండ
నధ్వర్యుఁ డొక్కట నర్హత న్మంత్రప్ర
యోగసామీచీన్య యుక్తిఁ దనర
నుద్గాత సామగానోద్యత్ప్రగల్భ తా
విస్ఫూర్తి నీశ్వర ప్రీతిఁ జేయ
హోత సద్వ్యాహృతి ఖ్యాతవైశారద్య
లీలఁ దత్తత్క్రియ ల్దెలుపుచుండ

తే. గీ. మఱియుఁ దక్కినవార లేమఱక తాము
నెఱపుకృత్యంబు లత్యంత నియతి సలుప
సొరిది వింధ్యావళీదేవి సోమిదమ్మ
గొలువ బలి యజ్ఞదీక్షఁ గైకొని చెలంగె. 13

ఉ. అప్పుడు సర్వదేశసముపాగతులైన మును ల్సదస్యులై
యొప్పుగ నెప్పు డేక్రియ ప్రయోగ మొనర్పఁగ నర్హమప్పుడా
చొప్పున నవ్విధు ల్నడపుచు న్యజమానుని బ్రత్యవాయము
ల్చొప్పడకుండఁగా నరయుచు న్నెఱవేర్చిరి జన్న మెంతయున్. 14

ఉ. వచ్చినవారి నెల్లను గృపం దనివారఁగఁ దానవారిగా
నిచ్చను దానవారి కడు హెచ్చఁగ నిచ్చలు మెచ్చి యిచ్చు న

మ్ముచ్చట లచ్చ టచ్చట గుబులొక్కైన బలొక్కైనియాటమీఱఁగా
[1]దచ్చికడ ల్గడలొక్కైనియె దాతలచేఁతలు ఖ్యాతము ల్గదా. 15

క. ఆవార్త కశ్యపర్షిత
పోవన [2]నేదిష్ఠదేశమున వ్యాపింపం
గా విని యా మునితనయుం
డావామనమూర్తి యిట్టు లాత్మఁ దలంచెన్ 16

—: వామనమూర్తి బలియజ్ఞశాలకుఁ బోవుట :—

గీ. దానవారి కడు న్మెచ్చఁ దానవారి
గాఁగ మెచ్చుచు నిచ్చున న్గణనగన్న
క్షితిజనశ్రుతి నా కుపశ్రుతిగఁ దోఁచెఁ
గాన నిపుడే నచటి కేగ నౌనటంచు 17

ఉ. అచ్చపుబూదిరేకలు మృగాజిన మక్షసరంబు మౌంజియుం
బచ్చనిగోఁచియుం గొడుగుఁ బావలు జందెము గిండి దండము
న్మెచ్చికచూపులుం జనువు మాటలు గాటపుఁ దేజు నొప్పఁగా
నెచ్చట యజ్ఞవాట మట కేగె జను ల్గడువింతఁ జూడఁగన్. 18

క. దౌదవ్వుల నాతనిఁ గని
యాదిత్యుండ యగు నీతఁ డని తత్రత్యుల్
సాదర మేదుర మోదర
సోదయహృదయులయి చూచుచుండఁగ నటకున్. 19

1. ఎనిమిది దిక్కులు. 2. సమీప మందున్న.

గీ. అరిగి యెఱింగినవారి నెట్టట్టులచటి
వారి నందఱ నందంద వావివరుస
లొనర నొగిఁ బల్కరించుచుఁ గుసుమ నడలు
గుజ్జుతనపు నొడ ల్ముద్దుగులుక నతఁడు 20

క. తగ బ్రహ్మఁ గాంచెఁ దొలుతొలు
తఁ గనుంగొనె నంత సముచితగతిగ నుద్గా
తఁ గడున్భక్తి నరసె హో
తఁ గనియె నంతసవిధేయతగ నధ్వర్యున్. 21

సీ. చతురత బ్రాహ్మణాచ్ఛంసిఁ బ్రశంసించి
ప్రస్తోతఁ బ్రస్తుతిఁ గుస్తరించి
మైత్రావరుణుని సన్మైత్రిఁ బేర్కొని ప్రతి
స్థాతను వినుతించి పోతఁ బొగడి
ప్రతిహర్తఁ గీర్తించి ప్రౌఢిసచ్ఛావాకు
గణుతించి నేష్టను గారవించి
యాగ్నీధ్రుఁ జెల్మిఁ గొండాడి సుబ్రహ్మణ్యు
మెచ్చి గ్రావస్తును హెచ్చరించి

తే. గీ. యెలమినున్నేత మన్నించి యింపుసొంపుఁ
జనువుననువును దగసభాసదులఁ గలసి
తనదుదర్శన మెపుడెప్పుడని మనంబు
నందు యజమానుఁ డభిలాష మొందమెలఁగ. 22

క. శ్రౌతవిధి సంప్రదాయము
నీతనికడఁ దెలియవలయు నెల్లర, మనుచున్
బ్రీతిగ నచటి [1]సభాస
ద్వ్రాతము హర్షింప నతఁడు వర్తించు నెడన్. 23

క. చనవరులు పుణ్యజనవరుఁ
గని యిట్లని తెలిపి రిటకు ఘనుఁడొకఁ డేతెం
చెను వానిఁ జూడఁగాఁ దగు
ననఘా యబ్బురము లౌర యాతని చెయ్వుల్. 24

గీ. వామన యనఁజూచు [2]వామనయనఁ జూడఁ
డేమి నియతియొక్కొ యామిటారి
వడుగుకడుఁగుయు స్త్రీ నడుగుయు స్త్రీలసభ
జుడుగుజుడుగునడుచునుడుగుననుడు. 25

ఉ. యాగము బాగుగా నెఱపి యాజకరాజి కతండు దక్షిణా
భాగములన్ యథార్హముగఁ బంచి యొసంగి యొసంగు పేర్మి న
భ్యాగతసభ్యరాజుల నుదారతఁ దన్పఁ గడంగి మున్నుగా
నీగి కితండె పాత్ర మని యెంచి వటుం దిలకించు వేడుకన్. 26

క. అబ్బలి యబ్బలికరుఁడై
యబ్బలి కెదు రరిగి యెఱఁగి యాస్ఫురణకు లో

---

1. సభలోనున్న జనులు. 2. స్త్రీ.

సబ్బుర మంది తదర్చ్చల
సబ్బుర మందిరమునం దహర్నిశము సిరుల్. 27

గీ. అనుచుభావించి యమ్మహాత్మునివసించు
దేశనామంబు బితృనామధేయములును
నతనినామంబుఁ దెలియంగ మతిఁ దలంచి
వినయమొనయంగ నిట్లని విన్నవించె. 28

క. ఎవ్వసుధ నుండువా ర్మీ
రెవ్వరు మీ తల్లిదండ్రు లెయ్యదినామం
బ[1]వ్వామదేవుఁడవో గా
కవ్వారిజభవుఁడవో మహాత్మ! తెలుపవే. 29

క. అన విని యెలన వ్వొలయఁగ
నను నను నీవడిగినట్టి యర్థమునకు నే
మని చెప్పుదు నుత్తర మై
నను విను కలయర్థము న్విన న్వలతేసిన్. 30

గీ. ఇన్ని వసుధలు గలవె యీయున్నవసుధ
యెల్ల నాయదిగాదె నా తల్లిదండ్రు
లెవ్వరంటివి వినుము దేవేంద్రముఖుల
కెల్లరకు నెవ్వరో నాకు నెన్నవారె. 31

1. ఈశ్వరుఁడు.

గీ. ఆత్మ దేహాదులసమష్టియాకృతియగు
నామమనఁగల్పితమగు సంజ్ఞ కద దాని
కెవ్వ రేకతమున నెట్టు లేర్పరించు
కొనిన నారీతి విఖ్యాతిఁ దనరుఁ బేరు. 32

చ. అనవుడుఁ దాంటికంటె వినయం బెనయంగఁ దనంతఁ దానె యి
ట్లనియె మదీయయజ్ఞఫల మంతయు నెంతయు నీవ యాదు వ
చ్చినపని యానతిమ్ము కృపచే [1]సుపచేళిమ మాను దాన నా
ఘనతరభాగధేయము జగద్వినుతప్రతిభాతిభాసురా. 33

ఉ. నావిని నావినిశ్చయము నమ్మి నిజమ్ముగ నీదుపట్ల లో
కావళి కానలేం గెడపు నట్టిఁడ వంచు నిజేష్టదేవతా
భావన భావనప్రమత సపర్యల నార్యుల కెల్ల నెల్లెడ
న్నీవిల నీవి లక్ష్యము గణింప కొనర్చెద వంచునుం జుమీ. 34

క. నావచ్చినపనిఁ దెలియఁగ
భావించితి దాత కడకుఁ బ్రత్యర్థులు [2]తృ
ష్ణావశులై భువి నెందుల
కై వత్తురొ యెఱుఁగవే యుదారవిచారా. 35

క. నీవృత్తి యప్రతిగ్రహ
భావము సూచించుఁ బలుకు వాక్కులను వినం

---

1. చక్కగాపరిపక్వముపొందినది. 2. కోరికలుగలవారు.

గా వాంఛఁ దెలుపు మనదే
మో విను వివరింతుఁ గర్జమును దెల్లముగాన్.

క. ఎన్నేనిదానములు కల
వన్నిట దాతకు ఫలంబు లబ్బును గొనువా
రన్నింట మేలు వడయుదు
రొన్నియు గల వం దుభయులకును శుభదంబుల్. 37

క. బహువిధదానములు ప్రతి
గ్రహమున కర్హములు గదవె కన్యావిద్యా
మహిదానము లను నివిమూఁ
డిహపరసాధనములుం [1]ద్రయీసమ్మతముల్. 38

క. అమ్మూఁటిలోనఁ దొలుతటి
దిమ్మేనికి నొదవ దెమ్మెయి న్రెండవదా
నమ్ముఁగృపనొసఁగి రొజ్జలు
నెమ్మిన్మూఁడవదియొదవు నీవలన నిఁకన్. 39

గీ. ఉన్నచోటనె కదలకయున్న నొప్పుఁ
గాని విశ్రాంతికిటునటుఁ గదలుటకును
బుద్ధిపొడమిన నొక్కింతభూమియాత్మ
వశమునం దుండవలదె యెవ్వానికైన. 40

1. వేదసమ్మతములు.

చ. మది నటు లూహ చేసి తగు మాత్రము ధాత్రిని నిన్ను వేఁడ ని
చ్చెద ననునిచ్చ నిచ్చటికిఁ జెచ్చెర వచ్చితి దానశూర! నా
కదియును జాలు మూఁడడుగు లంతియె హెచ్చుకొలంది కోర్కె లే
దొదవిన సంతసం బొదవకున్న నొకింతయుఁ జింతిలం జుమీ. 41

క. ఉన్నయది చెడిన వగ లే
కున్నది రా ముదము రాక యున్నను వగ పే
మున్నది వితరణగుణసం
పన్నా! యెన్నఁగ నయక్రమం బిది కదవే. 42

చ. అన బలి యోసుయోగ్యమహిమా! మహిమానుష వేషధారివై
కన నగు నెద్దియో యొక జగద్వినుతంబగు దివ్య తేజమా
దని తలఁతు న్నినున్ సఫల మయ్యెఁ గదయ్య మదీయ జన్మ మె
వ్వనికిలభించు నీచరణ వారి శిరంబునఁ దాల్చు భాగ్యముల్. 43

గీ. అని సవినయోపచార వాక్యములఁ దెలిపి
యేనొసఁగువాఁడఁ గొనువాఁడ వీవు యజ్ఞ
వాట మిది తఱి యవభృథావసర ముర్వి
దేయ మిటు గూడుకొనవలదే యటంచు. 44

క. శృంగారపు మణిపీఠియు
రంగారు మెఱుంగుపళ్లెరము నుదకముతో

బంగారపు [1]భృంగారువు
నుం గొనిరా నంగనం గనుంగొని పనుపన్. 45

బలి శుక్ర సంవాదము.

ఉ. ఆరసి భార్గవుండు దనుజాధిపుతో నను నోబలీంద్ర యా
రా! రసికుండ వౌదు తగునా యిటు చేయఁ [2]బ్రతిశ్రుతంబు నె
వ్వారికి నెద్ది యెట్లడుగఁ బట్టుఁ డటంచు నిడంగఁ జూతువే
కారణ మేమి యీతఁ డడుగం గడుకొంచెపు నేల నిన్నిటుల్. 46

సీ. ఎవ్వసుధ వసింతు నీవంచు నడిగిన
నదియిదియని తెల్పఁ డయ్యె నిజము
తలిదండ్రు లెవ్వారో తెలుపుమం చడిగిన
వీరువారని నిరూపింపఁడయ్యె
నెయ్యది నీనామ మెఱిఁగింపవే యన్న
నాకృతియే తెల్పుననుచుఁ బల్కె
నుపచారపద్ధతి సోముఁడవా బ్రహ్మ
వా యన్న నిర్వార నగుదు ననియెఁ

తే. గీ. గపటవేషంబుగాఁదోఁచుఁ గాని నాకు
నిక్కమునకు నితండు [3]వనీపకుండు

1. జారీచెంబు. 2. వాగ్దానము. 3. భిక్షకుఁడు.

గాఁడనుచుఁ దోఁచెఁ బరికింపఁ గారణంబు
లిన్ని యేకావు మఱియు నెన్నేనిఁ గలవు. 47

క, దేవతలకుఁ బ్రాపుకదా
గోవిందుం డతఁడు మాయకు న్మ్రెఖ్యుంబా
తాపుకదా ముని శాపముఁ
బో వేఁడిన వజ్రి కతనిముని తెలిపెఁ గదా. 48

క. ఈ వటునకు దానత్రయ
మే వర మంట యందు విద్య నిడి రంట యొజ్జల్
గావలె నంట భూదాన మ
హా వల దంట [1]దారసంగ్రహక్రియ తనకున్. 49

క. అమ్మహియుఁ బదత్రయమా
త్ర మ్మంట కావలయుఁ దనకు దానివలనఁ గ
ర్జమ్మేమున్నదొ యామా
త్రమ్మునకును స్వత్వ మెల్లరకుఁ గలదు కదే. 50

ఉ. వంచకు లిట్టివారలె ప్రపంచమునం దమ దైనకర్జ మె
క్కించుకయైనఁ బైకి వెలియింపక నిస్పృహ వృత్తిఁ జూపుచుం
బొంచి స్వకార్యసిద్ధి తుదముట్టెడు నంతకు నెంతయైన న
మ్మించి భ్రమింపఁ జూతురు సుమీ యడియాసపుటాస గొల్పుచున్.

1. పెండ్లియాడుట.

ఉ. ఎమ్మెయి విశ్వసింపఁ దగ దీతని బ్రాహ్మణు లన్న మాని వ
ర్ణమ్మన బ్రహ్మచారులనఁగా విను దేవహితార్థ లాట వీ
రిమ్ముగ నిమ్మఁ జేరి మన కెగ్గుఁ దలంపక లగ్గుఁ గూర్తు రే
నమ్మఁగ రాదుగా రిపుజనమ్ముల పక్షములోని వారలన్. 52

గీ. [1]త్రిదివమును బాసినది మొదల్దివిజులెల్ల
మందరాద్రిని గొన్నాళ్లు మసలిజలధి
తీరమునందునఁ గొన్నాళ్లు దిరిగి గారు
డాద్రిఁ గొన్నాళ్లు చరియించి రనుచు వింటి. 53

గీ. అం దదితితోడ నపుడ కశ్యపుఁడు తపముఁ
జేసెనఁట యామె దేవతా శ్రేణికెల్ల
దల్లిగద యంత నొక యువ దంపతులకుఁ
బుట్టెనఁట యొక్క మగవాఁడు పొట్టివాఁడు 54

క. అని మనగూఢచరు ల్గూ
డి నను గని చెప్పినప్పటికి నేఁటికి నీ
తని కింతవయసు రాఁదగుఁ
గనుఁగొన నీతం డతండుగా నూహింతున్. 55

క. [2]ప్రణిధుల వెస రంధ్రాన్వే
షణమున కనిచితినిగాని శక్యముగాలే

1. స్వర్గము. 2. చారులు.

ఉ. ఎమ్మెయి విశ్వసింపఁ దగ దీతని బ్రాహ్మణు లన్న మాని వ
ర్గమ్మన బ్రహ్మచారులనఁగా విను దేవహితార్థు లౌట నీ
రిమ్ముగ నిమ్ముఁ జేరి మన కెగ్గుఁ దలంపక లగ్గుఁ గూర్తు రే
నమ్మఁగ రాదుగా రిపుజనమ్ముల పక్షములోని వారలన్. 52

గీ. [1]త్రిదివమును బాసినది మొదల్దివిజులెల్ల
మందరాద్రిని గొన్నాళ్లు మసలిజలధి
తీరమునందునఁ గొన్నాళ్లు దిరిగి గారు
డాద్రిఁ గొన్నాళ్లు చరియించి రనుచు వింటి. 53

గీ. అం దదితితోడ నపుడ కశ్యపుఁడు తపముఁ
జేసెనఁట యామె దేవతా శ్రేణికెల్ల
దల్లిగద యంత నొక యువ దంపతులకుఁ
బుట్టెనఁట యొక్క మగవాఁడు పొట్టివాఁడు 54

క. అని మనగూఢచరు ల్గూ
డి నను గని చెప్పినప్పటికి నేఁటికి నీ
తని కింతవయసు రాఁదగుఁ
గనుఁగొన నీతం డతండుగా నూహింతున్. 55

క. [2]ప్రణిధుల వెస రంధ్రాన్వే
షణమున కనిచితినిగాని శక్యముగాలే

---

1. స్వర్గము. 2. చారులు.

దణుమాత్రమైన నమ్మని
మణిరక్షోఘ్నాది మంత్రమహిమమువలనన్ 56

గీ. ఆత్మ మాతాపితృసమాహ్వాయముల నడుగ
నెల్ల వేల్పుల తలిదండ్రు లెవరో వారె
తనకుఁ దలిదండ్రులనుట తథ్యముగ నీతఁ
డదితికశ్యపులకు సుతుం డనుచుఁ దోఁచు 57

గీ. ధరణియున్నదియంతయుఁద నెదెతాను
వామదేవుండ వారిజభవుఁడ నగుదు
నావినంగను వారిజనాభుఁ డితఁడు
మువ్వురకభేద మనికదా మునిమతంబు 58

క. మందరగిరిబృందారకు
లందఱు మంతన మొనర్చి యంబుధితీరం
బందున గోవిందుని శర
ణొందఁగఁ గ్రందుకొని రంచు నూహింపఁదగున్. 59

క. అందున గోవిందుఁడు కృప
కందళితముగాఁగ నదితికశ్యపులకుఁ దా
నందనుఁడై గరుడాచల
మం దుదయము నొందియుండు నని తలఁపనగున్. 60

క. యువదంపతులనుటకు హే
తువు వారు పురాణదంపతులయ్యెన మనో[1]
భవగురుఁ డుదరగుఁ డగుటకు
నవయౌవనలీలఁ దాల్చినందాల్పనగున్. 61

మ. అనినన్ దానవ చక్రవర్తి నిజవంశాచార్యు నీక్షించి యి
ట్లను నో దైత్యకులావనప్రవణశీలా! మేలు నీప్రజ్ఞ యెం
తని వర్ణింతును నాదు నిశ్చయము నశ్లాఁజుమ్ము నే నివ్వటుం
గనినంత న్హరు నంతవాఁ డనుచు వేడ్కం జెందె నాడెందమున్.

క. హరునంతవాఁడు హరియగు
హరియంతటివాఁడు హరుఁడు హరిహరతుల్యుం
డరవిందభవుం డీము
గ్గు రభిన్నులో సములో తెలిసికొన నాతరమే. 63

మ. నరమాత్రుండును నన్ను వేఁడినది యున్నం గ్రన్నన న్మన్ననం
బరితోషించుచు లేదనా కిఁకుటకై బాల్యంబునందుండి పూ
న్కి రహిం దాల్చిన నాకు నియ్యెడను లక్ష్మీజానియైనట్టి శ్రీ
హరి యాతం డగునేని నాదయినభాగ్యం బెన్న నింతంతయో. 64

క. పరమాద్భుతగరిమ న్మ
న్నురుకరుణ న్మత్పితామహునిఁ బ్రోచిన శ్రీ

---

1. విష్ణువు.

నరహరియుఁ సుహరి నరుఁడై
యరుదెంచుటకంటె భాగ్య మన్యముకలదే. 65

మ. వరయోగీంద్రహృదంతపర్యటనలబ్ధశ్రాంతి శాంతింప శ్రీ
కరసంవాహనసేవఁ గైకొనిన లోకస్వామియౌ శౌరిశ్రీ
చరణంబు ల్గలశోదకంబులను సంక్షాళింపఁగాఁ గంటి నె
వ్వరికైనం బరికింప నీదృశమహా భాగ్యంబు ప్రాపించునే. 66

క. జలనిధికిఁ గలిగె మును నేఁ
డలవడియె న్నాకు శౌరియంఘ్రులఁ గడుగం
గలభాగ్యము సిరి నిడ నది
యిల నిడ నిది హరికిఁ గాంత లిర్వురునగుటన్. 67

క. అన శుక్రుఁడు నివ్వెఱపడి
తన శిష్యునిచేయి పట్టి తగదు సుమీ యి
ప్పని నీకుం జెప్పిన విన
వనఘా యిది యేమి పుణ్యమయ్యె బలీంద్రా. 68

క. కొలమునకు వేరు విత్తని
తెలిసియు హరి కిట్టు మొసఁగఁ దివిరెద వయ్యో
తెలిసినవాఁడవో యేమియుఁ
దెలియనివాఁడవో యెఱుంగ దితిజ కులేంద్రా. 69

క. తనమేలు నొరుని మేలుం
దనకీడుం బరునికీడుఁ దలఁపని నినుఁ బో

లినవాని సిరులు సౌందా
మిని మిసమిస లగుఁ జుమీ యమేయచరిత్రా. 70

క. డెందమునం దింపొందఁగ
[1]నిందుకిరీటునిఁగఁ దలఁచి హితకామునకా
సందము ముందుగఁ గూరిచి
యెందఱికేమిడినఁ బిదప నిడఁదగుఁ బతికిన్. 71

క. శ్రితుని విడనాడి యభ్యా
గతునకు ముని కిడిన ఫలము గలదే వలదే
శ్రితహితభుజిష్యజనతా
మతిమద్భటబంధుతాభిమానము పతికిన్. 72

ఉ. వచ్చినవాఁడుఁ ఫుచ్చికొని వచ్చినదారినె పోవఁ జూచుఁగా
కిచ్చటి హాని వృద్ధులకు నిచ్చుఁ గలంగునె లోఁ జెలంగునే
యెచ్చటి ముచ్చట ల్పరుల కిచ్చిన నేమి ఫలంబు నాదు ప
ల్కచ్చపురీతి దీని వినుమా కనుమా నను మాన్యదృష్టిచేన్. 73

క. ఏరూపంబుననైనఁ బ
నారాజ్యప్రాప్తికలసునాశీరుఁడు దు
ష్ప్రారంభము లొనరించును
మారుతసప్తకజనిక్రమం బెఱుఁగ వొకో. 74

1. శివుఁడు.

క. వారిపయిఁ గరుణ గలఁ డసు
రారి యతం డిప్పు డిట్లు [1]హ్రస్వాకృతితోఁ
జేరె నినుఁ గపటవృత్తిం
దా రూఢిగ నమ్మ నమ్మ నమ్మ మదుక్తిన్. 75

క. పలికి వెలయింపకుండినఁ
గులదేశిక యంతకంటెఁ గొల దేహికిలం
గలదే మొక్కైద నీకసూ
ర్వ్యాలుకం గా వలదు వలదు వల దించుకయున్. 76

క. అనుటయు శుక్రుఁ డొకించుక
యును దాఁ జేయునది లేక యుస్సురటంచుం
జనె నచ్చోటు వాసి వసిం
చునె తన సుడి సాగనట్టిచో ఘనుఁ డెందున్. 77

క. తా నెంతటి బలియైనం
గానీ తన కవిహితోక్తి గనునం దగునే
మానం డప్పుఁ డాతఁడు తన
పూనిక [2]భవితవ్యతావిమోహితుఁ డగుటన్. 78

మ. చని వింధ్యావని యంతలోన మణిభాస్వత్ప్రీతిఁ దోయంబు నిం
చిన భృంగారపుఁ బళ్లెరంబుఁ గొనిరాఁ జేఁబూని యాతండు స

1. చిన్నరూపముతో. 2. ముందు ఏమి చేయుటకుతోచనివాఁడు.

య్యానఁ బీఠం బిడి యవ్వటు న్నిలిపి యర్ఘాభ్యర్హణం బాచరిం
చి నిజప్రేయసి ధారవోయుటకు నీక్షింపం దదాచార్యుఁడున్. 79

క. ఎంత తడవైన నంతియ
సంతోషం బదియె చాలు సమకుఱ రాదే
యంత నొక యంతరాయము
వింతగ నని యాతఁ డొదిగె భృంగారువునన్. 80

క. బంగారపుభృంగారపు
నంగన వంప నొక బిందు వైనను బడకు
న్నంగని బలి యిదియేమను
డుం [1]గుశకాండమున నవ్వటువు పొడుచుటయున్. 81

క. సుడివడి వడి నిలఁబడె శు
క్రుఁడు కన్నుగ్రుడ్డునకుఁ గాఁడ గ్రుచ్చికొనఁగ న
ప్పుడు కాణుండై కడు
నెక్కుడు వడిగా లోహనాళ గోళము వోలెన్. 82

క. స్వామిప్రియుకాముఁడు తన
బాములు గణుతింప కధిపు పని చెడకుండం
గా మెలఁగు బతినిరంకుశుఁ
డై మాటలు సరకుసేయఁ డనుకొనఁ డెందున్. 83

---

1. దర్భ.

గీ. ఏమి చెప్పవచ్చు నామెయి శుక్రుండు
సామి హితము గోరి "చావుఁదప్పి
కన్నులొట్టయయ్యె" నన్న నామెతకుఁదా
మూల మగుచు నొక్క మూలనొదిగె. 84

క. గురువును మంత్రియు స్వప్రియు
నిరతుఁడు నగువాని నిట్లు నిరసించినచో
నొరుమాట సరకు సేయునె
నిరంకుశు లధీశ్వరు ల్గణింతురె హితులన్. 85

గీ. అప్పు డందఱు నటు లరుదంది చూచు
నంతలో నాతఁ డిల్లాలినరయ నామె
పాణిభృంగారువు నొకింతవంచునంత
జలజల జలంబుధారగా జాఱఁగాంచి. 86

క. సాక్షతముగ నయ్యుదకము
నక్షయ్యం బగునటంచు నవ్వటుచేతం
బ్రక్షేపించెను రక్షో
ధ్యక్షుఁడు సద్భక్తి నీశ్వరార్పణ బుద్ధిన్. 87

శా. ధారాపూర్వముగా నొసంగిన మహీదానంబుఁ బ్రీతి న్బుధా
ధారార్థంబుఁ బ్రతిగ్రహించె వటుమూర్ధన్యుండు వాఁ
డేరూపంబుననైన స్వీయుల భయోద్వృత్తి న్నివారింపఁగా
స్వారబ్ధక్రియ నిర్వహింపఁగ సదా యత్నించునే వాఁ డిలన్. 88

క. ధారంగొని దాతను బహు
ధారంజకఫణితఫణితిఁ దనియించి మహో
దారంబుగ రూపం బరు
దారం బూనఁగఁ గడంగె నతఁ డపుడు నడిన్. 89

చ. ధర నొగి నుద్గమించి విదితంబుగఁ బైపయి వ్యాప్తిఁ జెంది బం
ధురగతి మిన్ను ముట్టెను గనుంగొనుచుండెడు నంతలోన స
త్పురుషుని కీర్తివోలె నలపొట్టి వటుండు పటుప్రభావ వి
స్ఫురణము తేటతెల్లముగఁ జూపఱు లచ్చెరు వొందునట్లుగన్.

మ. తనసార్వత్రికభావముం దెలుప రోదఃపూర్ణుఁడై మించు వా
మనదేవుం గని "దేవదేవ సకలామర్త్యేష్టసంధాయకా
య! నమస్తే ఖలఘస్మరప్రశమితాన్యాయ్యాయ! తుభ్యంనమో"
యని దేవర్షులు మింటఁ బేర్కొనిరి. భక్త్యాయత్తులై యత్తఱిన్.

శా. శుక్రాదు ల్భయవిహ్వలాత్ము లగుచుం జూడం ద్వరాడంబరా
వక్రప్రక్రమలీలచేఁ బెరిఁగి [1]విష్వగ్వ్యాప్తదీప్తాంగుఁడై
శక్రప్రీతిగ విక్రమింపఁ దొడఁగెం జంచద్గతి న్ధారణీ
చక్రం బంబరచక్రముం బదయుగచ్ఛన్నంబుగా నీగతిన్. 92

క. మన్నొకపదమాత్రమ్మున
మిన్నొకపదమాత్ర నాక్రమించి వటుండా

1. ఆకాశము నందంతట వ్యాపించిన వాఁడై.

యున్న పదమాత్రమునకో
యన్నా! యేమందువన్న నబ్బలి వలికెన్. 93

శా. దేవా! తావకసేవకావళికి నెంతేఁ జూడఁగా దుర్లభం
బై వేదాంతశిరఃకిరీటతటవిన్యాసక్రియాప్రౌఢి సం
భావింపం దగి తార్క్ష్యమూఁపు పయి మోపన్నెంచు నీదౌ పదం
బీవేళం గృప నాదు మస్తకమునం దిచ్ఛారతి న్నిల్పవే. 94

మ. అనఁ దన్మస్తకదేశమందునఁ దృతీయంబౌ పదన్యాసముం
బొనరించె న్దివి దేవదుందుభిరవంబు ల్పుష్పవృష్టు ల్మరు
ద్వనితానర్తనము ల్మునిస్తుతులు గంధర్వాది గానంబులుం
దనరంగా నతని న్రసాతలము నొందం జేయుచు న్మెల్లనన్. 95

క. ఆహా! రవ మెసఁగఁగ మ
ర్త్యాహారవరు ల్రసాతలాంతరమున క
త్త్యాహితమతిఁ జని రాది
త్యాహితమతిహైన్య మిడుఁగదా యెవ్వరికిన్. 96

క. మూఁడవపద మటు లిడ ముద
మూఁడ వగ ల్మూఁడనడఁగి యొగిబలితో శ్రీ
రాడవమానితగతిఁ గని
రాఁ డవనికి నొక్కఁడైన రక్కసుఁడు వెఱన్. 97

చ. బలిగుణశాలి యే నికటవర్తులు దుర్నయమూర్తు లౌటచే
నలవడె నిట్లు హస్తగత మైనచోఁ గాటపుఁ గల్మిఁ బాసి యు

గ్గల మగు గాసి నొందఁగ జగంబున నెంతటి దొడ్డవానికిం
గలుగక మానునే యధిక కష్టము దుష్టులఁ జేరఁ దీసినన్. 98

సీ. వడిశపించుట యెదుర్వాసుండె కాఁగఁ గాని
కృపఁ దానె తగఁ దొలఁగింపఁడయ్యె
వజ్రిదుర్జయుఁడంచు బలి వల్కె నేకాని
కలుపు లిప్పటిరీతిఁ గలవఁడయ్యె
గురునివంచఁగ శుక్రుఁడు తలంచె నెకాని
యిదియిట్టులౌనంచు నెంచఁడఁయ్యె
సురలఁదోలుటయె[1]యాశరులు చూచిరికాని
తత్ప్రాపకబలంబుఁదలపరైరి.

తే. గీ. భావి యీరీతి నుండ నెవ్వారు దానిఁ
ద్రిప్పఁగల రప్పుడే చొప్పు దేవతలకుఁ
జొప్పడియె నిప్పుడా చొప్పు సోఁకులకును
గూడెఁ దోడ్తో నతిట్టిన గ్రుద్దినిట్లు.

మ. బలిఁ బాతాళముఁ జేర్చి యాతని గృహద్వారంబునం దాను గా
వలి యుండ న్వర మిచ్చి యచ్చట సదాభాస్వద్గదాపాణియై
నిలిచె న్దాసులపాలిపాలనవిధి న్నీచోచ్చ భావంబులం
దలఁపం డాహరి తత్పరస్పర విరోధం బెన్నఁ డెన్నం డెదన్. 100

1. రాక్షసులు.

క. ద్వైవతమునిసేవితత
త్త్రైవిక్రమమూర్తియై యథాస్థితి మరలన్
గోవిందుఁడు వామనుఁడై
కావించె నోమ్మెద మమరఁగా నమరులకున్ 101

క. ఇంద్రానుజుఁడ వగుట ను
పేంద్రుఁడ వైతివుడు మరల నింద్రునిచేతన్
సాంద్రప్రేమంబున [1]ని
స్తంద్రత నేలింపు మయ్య స్వారాజ్యంబున్. 102

క. అని యనిమిషులు మునుఁ ల్వోఁ
శిన సన్నాహంబౌనర్పుఁడీస్వారాజ్యం
బున నింద్రుని వెస నభిషి
క్తుని జేయుట కనుచునచ్యుతుఁడు వచియింపన్. 103

సీ. మృదుఫేనవిశదబుద్బుదలసద్బిందుబృం
దస్ఫూర్తి నమృతకుండంబు నిండఁ
బీనతరాపీనపానవర్ధిత[2]తర్ణ
క వినోదమతిఁ గామఁగవి చరింపఁ
బల్లవకోరకప్రసవఫలవ్యాప్తిఁ
గల్పకద్రుమపంచకము దలిర్ప
ననుకూలగతిఖేల దనుకూలజలవీచి
కాసముస్నతి నభ్రగంగ వొంగ

1. అలసతలేకుండ. 2. దూడ.

తే. గీ. శ్రీహరికృపాకటాక్షవిశేషమహిమ
నహిమరుచిరోచిరనుషక్తి నంబుజాత
వనమురీతి నిరీతిని వాసిఁ గాంచెఁ
ద్రిదివ మెప్పటిగతి శ్రీసమృద్ధమగుచు. 104

ఉ. అప్పుడు విప్పుకంటిదొర లందఱునుం దన వెంటరా గురుం
డప్పురుషోత్తముం దరిసి యస్మదభీప్సితసిద్ధి యయ్యె మా
యప్ప! భవత్కటాక్షమహిమాతిశయంబునఁ జేసి యిప్డు మే
మెప్పటిచొప్పు లొప్ప వసియింపగఁ జేయవె స్వస్థలంబునన్

క. పట్టం బింద్రున కిఁక వెసఁ
గట్టము స్వఃపట్టనాధి కారంబునకుం
బట్టిన పట్టొనరఁగఁ దుద
ముట్టినఁ గద పౌరుషంబు పురుషున కెందున్ 106

సీ. అదితికశ్యపుల కత్యంతంబునియతిమై
నతుఁడౌచు వారియానతిని బడసి
[1]హేరంబునకు మహోదారంబుగా నంత
సకలోపచార పూజలనొనర్చి
భక్తిమైఁ దారకేశ్వరలింగమూర్తికి
నమృతాభిషేకంబు లాచరించి
శాశ్వతైశ్వర్యభాస్వద్వృత్తి నివసింప
శ్రీమహాలక్ష్మిఁ బ్రార్థించిపొగడి.

---

1. విఘ్నేశ్వరుఁడు.

తే. గీ. యీవు సన్నాహ మొనరింపు మీ యటన్న
వెంటనే యింద్రుఁ డిన్నిగావించుకొని యె
బ్రహ్మ బ్రహ్మర్షి యుక్తుఁడై వచ్చుటయ్యె
నఖిల సంభారములు సిద్ధ మయ్యె నయ్య. 107

గీ. అనుడు శ్రీహరి నవ్వుచు నతనిఁ జూచి
యిట్లనియె నేకతంబున నింతపుట్టె
దాని నిపుడైన మరలింపఁ గానఁడయ్యె
నయ్యమరభర్తదాని కేమందునయ్య. 108

మ. అని యాశ్రీహరి వల్కి గీష్పతి మహాత్మా! చాలదే మున్నుచే
సిన లోపం బిపు డట్టులేల మరలం జేయుం [1]బిడౌజుండు పే
ర్కొని సద్భక్తిని దార కేశు నభిషిక్తుం జేయ సంప్రీతుఁడై
కనుపట్టెం బరమేశ్వరుం డెదుట శ్రీగౌరీ సమేతంబుగాన్. 109

గీ. ప్రేమఁ దనప్రమోల సాక్షాత్కరించినట్టి
పార్వతీపరమేశుల పాదములకు
భక్తిసాష్టాంగముగ మ్రొక్కి స్వాశిప్రభుండు
స్వాపరాధంబు సైరింపుఁ డనుచు వేడ. 110

క. కరుణామతి నప్పరమే
శ్వరి యప్పరమేశ్వరుండు సంక్రందనునిం

1. ఇంద్రుఁడు.

గరములను బొదివి యెత్తిరి
శరణార్థుల నుత్తముల్విసర్జింపరుగా. 111

గీ. అనుచు లేవంగ నెత్తి వారస్మదీయ
భక్తనిర్మాల్యములగౌరవం బెఱుంగ
కవమతియొనర్చితివి దాన ననుభవింపఁ
గలిగె నీకిట్టి ఘోరసంకటము లింద్ర. 112

గీ. అయిన దేమయ్యెనో భక్త మయ్యెఁగాని
యిప్పుడై ననుదృశ్యమందించుకైన
నీశ్వరునికంటె భేదమం చెంచఁ బోకు
దాన శాశ్వతైశ్వర్య మొందంగఁగలవు 113

గీ. వెసనొనర్పించుకొనుము త్రివిష్టపాధి
రాజ్యపట్టాభిషేకభద్రప్రయత్న
మచ్యుతానుజ్ఞమున్నుగా నంతదనుక
నిందె సాక్షాత్కరించి నే మున్దు మింద్ర. 114

క. అని యయ్యాదిమదంపతు
లనుజ్ఞ నిడి నిలిచి రయ్యె యచటనె నీవుం
జనుదెమ్మనినఁ ద్రివిక్రముఁ
డనుమోదముతోడ వెడలె నాకంబునకున్. 115

సీ. ప్రవితతప్రతిచత్వర[1]ప్రతోళీనద్ధ
కాదంబినీసాంద్ర [2]కాయమాన
మాబద్ధపారిజాతాగపల్లవగుచ్ఛ
తోరణాఖిలగృహ ద్వారముఖము
ప్రోత్తంభితాష్టాపదోరులాంఛనవైజ
యంతీలసద్వైజయంతపదము
నిహితాచ్ఛచింతామణీభద్రపీఠ ని
ర్మలసుధర్మాస్థాన మండపంబు

తే. గీ. భావుకశ్రీప్రసాధనైరావతంబు
చారుసమ్యగలంకృతోచ్చైశ్శ్రవంబు
నగుచునపుడొప్పె నింద్రపట్టాభిషేక
శుభవిభవసూచకస్ఫూర్తి సురపురంబు. 116

క. శ్రీమించురథము నిల్పె స
చామరమును సధ్వజంబు సచ్ఛత్రమునుం
గా మెఱయంగ సరయగతి
శ్రీమాతలి హరులఁ బూనిచి [3]హజారమునన్. 117

సీ. పరమపదోపాత్త విరజాసరిన్ఝరీ
శుంభదంభ[4]శ్శాతకుంభకుంభ

1. పెద్దవీథిని గట్టఁబడిన. 2. మేలుకట్టు. 3. కొలువుకూటము. 4. బంగారు.

మీఁశకపర్దగం గాశ్శైవలిన్యంత
రర్ణః ప్రపూర్ణ సౌవర్ణఘటము
నలినజకరకమండులుగర్భతలసంభృ
తాపస్స్ఫురజ్జాత రూపకలశి
త్రిజగన్నదీనద తీర్థాంబుపూరిత
స్వచ్ఛజాంబూనద స్థాలికయును
తే. గీ. సప్తరత్నాకరాంతర సముపనీత
పరమపావనజీవన పాత్రికయును
బంచవిధసారతరుపల్లవాంచితముగ
నుంచిరాస్థానిగురునిశిష్యులు గడంగి. 118

క. అమరగవిదధిఘృతక్షీ
రములుం గల్పద్రుసుమ మరందము నమృతం
బమరఁగఁ బంచామృతముల
సమకూర్చిరిమునులురత్న [1]చషకంబులలోఁ. 119

చ. పరవుగ నేకనాదమయి పర్వ యఖర్వసుపర్వదుందుభు
ల్మ్రోరయఁగ నేకధారమయి మ్రొగ్గిమరుత్తరుపుష్పవర్షము
ల్గురియఁగ నేకరేఖమయి కూడిసురీకరవల్లకీశ్రుతు
ల్బెరయఁగ నేకపర్వమయి. బేర్చెఁ ద్రివిష్టప మప్పు డెంతయుఁ.

1. పాత్రిను.

శా. స్నాతాలంకృతవిగ్రహుండయి శచీసంయుక్తుఁడై దిగ్వరా
నీతుండై త్రిదివేశ్వరుండు సురమానిశ్రేణి దీవింపఁగా
నేతెంచెం బెరిమెన్ జయంతుఁడు కరం బింపొప్పఁ గైదండ యీ
మాతాపిత్రనువృత్తి నత్తఱి సుధర్మామంటపస్థానికిన్. 121

గీ. అపుడు తమతమవాసగేహములనుండి
వనజసంభవవామనవామదేవు
లచటి కేతెంచి సమధిష్ఠితార్హపీఠు
లగుచు నిఁక నేలతడవు సేయంగ ననిన. 122

గీ. దేవరలయాజ్ఞ యనుచు సద్ధిషణుఁడైన
ధిషణుఁడు శచీయుతముగ నద్దివిజవరుని
భద్రచింతామణీపీఠిపై వసింపఁ
జేసి విఘ్నాధిపతిని బూజింపఁ జేసి. 23

మ. విధిపూర్వంబుగ నర్హకృత్యములఁ గావింపించి నానావిధౌ
షధిసారంబుల సంభృతాఖిలజగజ్జాలస్రవంతీపయో
నిధినీరంబుల నించినట్టికలశానీకంబు నర్చించి వా
గధిపశ్రీపతిపార్వతీశ్వరులయాస్యంబు ల్విలోకించినన్. 124

క. చూపులు కృపారసమునకుఁ
బ్రాపులుగా నరసి లేచి వాసవుభద్ర
శ్రీపీఠంబున కెదుట స
మీపంబున నిలిచి వారు స్మేరాననులై. 125

గీ. ఈవుమున్నుగాఁ బన్నుగా నిన్నగారి
నెన్నఁగారాని విభవంబు చెన్ను మీఱ
నాకలోకాధిపత్యాభిషేకమదితి
కశ్యపులచే నొనర్పింపఁ గడఁగుమనిన. 126

మ. గురుఁ డభ్యర్చిత [1]శాతకుంభమయసత్కుంభంబుఁ జేఁ బూని ని
ర్జరలోకేంద్రునకాభిషేచనికమంత్రగ్రామపూతంబుగా
శిరమం దల్లన పల్లవాగ్రముల మున్సించించి తోడ్తోన శ్రీ
కరనీరంబులచే నొనర్చె నభిషేకం బప్రతీకంబుగాన్. 127

క. తరువాత నదితికశ్యప
హరిహరచతురాస్యు లతని కభిషేక మొన
ర్చిరి తిరముగఁ ద్రైలోక్యముఁ
బరిపాలింపుము నిలింప వల్లభ యనుచున్. 128

గీ. వరుస నంతట వసుదిగీశ్వరసురర్షి
యోధకన్యాపురంధ్రులత్యౌత్సుకత్వ
మునసుగంధిప్రసన్నాంబు పూరములను
శక్రునభిషిక్తుఁ జేసిరి స్వర్గమునకు 129

సీ. తుంబురునారదాదులు త్రిమూర్తులసభ
నెఱపుపాటవినంగ నెగడువారు

---

1. బంగారు కలశము.

గంధర్వులందంద కాన్పించుదశవిధ
రూపకంబులకుఁ బర్వులిడువారు
నచ్చరల్ దగువారి యాస్థానములఁ జేయు
నృత్యంబు వీక్షింప నేగువారు
విశ్వకర్మబయళ్లఁ బేర్చియేర్చడువింత
బిరుసులఁదిలకింప వెడలువారు
తే. గీ. నగుచుఁ దేజోవతీముఖ్యనగరవాసు
లమరలోకాధినాథుపట్టాభిషేక
విభవమీక్షింపనేతెంచి వింతనెల్ల
నరసిసంతసమందిరయ్యవసరమున. 130
సీ. తప్తతైలకటాహతాపంబువిడనాడి
యమలోదకములనోలాడుచుండ
నసిపత్రవనహతి వ్యసనంబులఁదొలంగి
నిబిడద్రుమంబుల నీడనిలువ
నంధకూపావాసజాయాసమునుబాసి
వెలుగొప్పుతెఱపుల విశ్రమింప
ఘనకాలసూత్రబంధనబాధలనువీడి
యిచ్ఛావిహారైకవృత్తి మెలఁగఁ
తే. గీ. గలిగె నత్తఱిఁగలనారకులకు నెల్ల
నిరయమునుండిదండిదండితనముడిగి

యా_ర్తరక్షకుఁడైన త్రిమూర్తు లెలమి
నిడిన యానతి వేవేగ విడిచిపుచ్చ. 131

ఉ. పట్టి జయంతుఁ డయ్యెడ స్వపాణిసుపాణి మెఱుంగుముత్తెపుం
దట్టపుఁ జెల్లిఁ బట్టఁగ నుదంచితకాంచనరత్నమండలీ
ఘట్టితదండచామరయుగం బొగి నశ్వను లూని వీవఁ జూ
పట్టె మహేంద్రుకొల్వు చెలువంబుగ సర్వసుపర్వపర్వమై. 132

ఉ. [1]అంటఁగరాని వేల్పు మొద లౌకడ లేలుమనీలు [2]బాసవా
ల్దంటలు మింటిద్రిమ్మరుల దాఁటులునుం దెఱఁగంటి పెద్ద ము
క్కంటిని దమ్మికంటి దొరఁ గన్గొని యొప్పుగ నెప్పు డిట్లు మీ
బంటులబంటు బన్నముల పాల్పడకుండఁగఁ [4]బ్రోవుఁడీ యనన్. 133

క. కనకోదర [3]కమలోదరు
లనలాదిదిగీశమునిజనామరవరులం
గని యిట్లని రిట్టల మగు
కనికరమున నట్టివెరపుఁ గఱపుతలఁపునన్. 134

గీ. స్థిరతరైశ్వర్యమెవఁడు వాంఛించు నతఁడు
పరమమాహేశ్వరాచార నిరతవృత్తి
నూనవలె నట్టు లూనలే కున్నవాఁడు
పృథివిలింగప్రతిష్ఠఁ గావింపవలయు. 135

1. అగ్ని. 2. బ్రాహ్మణులు. 3. బ్రహ్మ. 4. విష్ణువు.

క. కావున నీతఁడు గరుడ
గ్రావసమీపమున బంధురసరస్తటి ని
ష్ఠావాప్తికి మహిని మహా
దేవుని లింగాకృతిం బ్రతిష్ఠింపనగున్ 136

క. అని యింద్రుని గరుడాచల
మున యందుక్త ప్రదేశమున శివలింగం
బు నొగిం బ్రతిష్ఠఁ జేయఁగ
ననిచిరి ననిచినదయ నయంబున నంతన్. 137

మ. [1]పురుహూతుం డిల కేగుదెంచి మహిమల్వొల్పొందుసుక్షేత్రమౌ
గరుడాహార్యము పొంత బంధురమహాకాసారతీరోర్విశం
కరలింగంబుఁ బ్రతిష్ఠితంబుగఁ దగం గావించె నిష్ఠాప్తి కాం
గిరసుం డుక్తవిధిం గ్రియ ల్నడుప భక్తిశ్రద్ధ లేపారఁగన్. 138

సీ. అందు నయ్యిందుమౌళి పెంపందుచుండెఁ
బ్రమథగణయుక్తిఁ దత్క్షేత్రపాలకుండు
గాఁగ నుత్తరపూర్వాది [2]కచ్చత్వరమున
సత్వరక్షణదీక్షోల్లసత్వరతిని. 139

క. క్రమ్మఱ నమ్మఘవుఁడు స్వ
ర్గమ్మునకు న్సమ్మదమ్ము గ్రమ్మఁగ జని వృ

1. ఇంద్రుఁడు. 2. చౌపదము.

త్తమ్మవ్విధువిధులకు విశ
దమ్ముగ నెఱిఁగింప వారు దయ దైవాఱన్ 140

క. నీకీక్రియ నికఁముందు త్రి
లోకీసామ్రాజ్యమహిత [1]లుంటాక జయో
ద్రేకస్థితిపూజ్యము న
స్తోకధృతిప్రాజ్యమగుచు శోభిలు మఱియున్. 141

క. శత్రుక్షయ మిత్రోచ్ఛ్రయ
పుత్రోదయ నష్టరాజ్య పునరాశ్రయము
[2]ల్పత్రిపగోత్ర క్షేత్రప
విత్రస్థలి నీ చరిత్ర వినఁ జదువ నగున్. 142

మ. వినయంబొప్ప నెవండు నీదయిన యీ వృత్తంబు నెందేనియు
న్వినువిన్పించుఁ బఠించు శ్రీవరకృపా విస్ఫూర్తి దీపింప నె
ట్టన నాతండు జగత్ప్రసిద్ధి గని నష్టద్రవ్యలాభాఢ్యుఁడౌ
నని యమ్మువ్వురు నివ్వరంబు నిడి స్వేచ్ఛాసక్తి విచ్చేసినన్. 143

క. పునరధిగతరాజ్యోన్నతి
ననిమిషనాయకుఁడు [3]స్వస్థుఁడై త్రైలోక్యం
బునునిష్కంటముగఁ బా
లన మొనరించెను త్రిమూర్తుల కటాక్షమునన్. 144

---

1. దోచుకొన్నవాని. 2. గరుడాద్రిక్షేత్రము. 3. స్వర్గరాజ్యమునందుండువాఁడై.

సీ. తనకార్యసాఫల్యమున కెవ్వరెట్టుల్ల
శ్రమమోర్చి రటువారి సత్కరించె
నీకల్మి తన శక్తినే కల్గె మరలనం
చవలేపపడ కడంకువ మెలంగె
గురుమహాసముఖపూజ్యు లరుదెంచు వార్తలు
దెప్పించుకొని వినీ తిని భజించె
నేలోక మేవేళ నేలీలఁ బాలింప
నగునట్టు లప్పట్టు లరసి ప్రోచె

తే. గీ. విజితు లగువారు తమనెంత వినయవృత్తిఁ
బ్రేమ నమ్మించి కొలిచిన విశ్వసింప
కాప్తబంధుగురూత్తముల నాదరించె
నతఁడు క్రమ్మఱఁ దన రాజ్య మధిగమించి. 145

క. శతగుణసంస్థాపితభూ
పతికుల జేగీయమాన పరమాచార్యాం
చితవితతయశస్స్తోమా
శ్రితవసననిబద్ధహేమ శ్రీరఘురామా. 146

చ. రవికులదీపకా! భువన రంజక దివ్యకలాకలాపకా!
నవఘనవిగ్రహా! నతజనప్రతిపాదితభూర్యనుగ్రహా!
పవనజసేవితా! సకల పండితపావనభావభావితా!
ప్రవిమలవర్తనా! మునివరప్రకరస్తుత పుణ్యకీర్తనా! 147

స్రగ్విణి. భానుమన్నందన ప్రాజ్యరాజ్యప్రదా!
మానిగార్హ్యస్వసంపత్కరశ్రీపదా!
జ్ఞానిచిత్తాబ్జసంచారకృత్షట్పదా!
జానకీమానసోత్సాహలీలాస్పదా! 148

## గద్యము.

ఇది శ్రీమద్రామనామపారాయణపరాయణాతిధన్య కౌండిన్యగోత్ర
పవిత్ర దేవులపల్లికులపయఃపయోనిధికళానిధిసీతారామశాస్త్రి పౌత్ర
వేంకట కృష్ణశాస్త్రిపుత్ర తమ్మనాభిధానాంతర వేంకట కృష్ణ
శాస్త్రినామాగ్రజన్మ త్రిలింగదేశాగ్రజన్మ సుధీ
విధేయ సుబ్బరాయశాస్త్రి నామధేయ ప్రణీతం
బైన మహేంద్రవిజయం బను ప్రబంధంబు
నందుఁ బంచమాశ్వాసము.

శ్రీ సీతా రామా ర్పణ మస్తు.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ



శ్రీ రామ.

# శ్రీ మహేంద్రవిజయము

## షష్ఠాశ్వాసము.

శ్రీరమ్యభూరిమహిమో
దార! సదారక్షితాఖిలాంఘ్రిప్రణమ
ద్వారా! సజ్జనచిత్తవి
హార! కృపాధార! దశశతాంగకుమారా! 1

గీ. అవధరింపుము శౌనకాద్యఖిలమౌని
బృందమున కల బృందారకేంద్రుచరిత
సాంగముగఁ బల్కి మరల నిట్లనుచుఁ దెలుపఁ
దొడఁగె నవ్వలి కథను సూతుఁడు గడంగి. 2

ఉ. ఇంద్రుని సుస్థిరంబుగ స్వరింద్రునిఁ జేసి యుపేంద్రుఁ డిట్లు [1]ని
స్తంద్రత నుండు మంచుఁ దలిదండ్రుల సన్నిధి కేగి మోదయూ
సాంద్రమనీషులార! సుర సత్తముఁ డుత్తమవైభవంబు గాం
చెం ద్రిదశుల్ మహోచ్ఛదశఁ జెందిరి యుష్మదనుగ్రహోన్నతిన్. 3

---

1. మెలఁకువతో.

క. దితిజప్రతతి రసాతల
గత మయ్యె సుతుండ నైతిఁ గద నేనును మీ
కతులతపోన్వితులారా!
హిత మింతకు వేఱె కలదె యెయ్యది యైనన్. 4

ఉ. నావిని వార లిట్లనిరి నందనునం దనువొందుకూర్మిచే
నీ విటు మా మనోరథము లెల్ల ఘటించితి దానఁ జేసి మా
భావము లుల్లసిల్లె నిఁక వాంఛితము ల్మఱి వేఱె యున్న వే
కేవల మిప్పు డేము కృత కృత్యుల మైతిమి ఖ్యాతి మీఱఁగాన్. 5

క. ఐనం గల దొక యీప్సిత
మోనందన! నీవు మాకు నుదయించిన యీ
స్థానంబున [1]నర్చాకృతి
వై నిలువఁగ వలయు నెపుడు నది యే మనినన్ 6

క. తనయులు పొడమిన వాసర
మునఁ బండువు సేఁత సుతులు పొడమిన గేహం
బున శుభవిధులం గూర్చుట
జననీజనకులకుఁ జిత్త సమ్మద మొదవున్. 7

క. తల్లియుఁ దండ్రియునుం దమ
యుల్లంబులలోనఁ బిల్ల లుల్లాసముతోఁ

1. పూజకుఁదగిన ఆకృతిగలవాఁడవు.

జల్లగ వర్ధిల్లఁగ భువి
నెల్లప్పుడు దలఁచుచుందు రిట్టి శుభవిధుల్. 8

గీ. కాన నీవు బలిని గానఁగా నేగిన
నాటిఁయాశ్రమంబునను సతంబు
నిలిచియుంట మాదుతలఁ పని తెలుపఁ బు
త్రుండు కేలుదోయి దోయిలించి. 9

చ. అల బలిఁ గానఁగా నరిగి నప్పటియాశ్రమ మందు నుండఁగా
వలయు నటన్న మీ నుడులు వ్యర్థము లౌనె తదాశ్రమంబునన్
[1]వలనుగ నెల్లకాలమును వర్తిలువాఁడ మదీయమౌ జని
స్థలమును వీడ కచ్చట నె సమ్మతి నుండుఁడు మీర లెప్పుడున్. 10

గీ. భాద్రపదమందు మజ్జన్మ వాసరమున
శక్తికొలఁదిగ భక్తి నుత్సవము లెవరు
సలుపుదురు వారి కోర్కు లొసంగు చుందు
ముఖ్యముగఁ బుత్రవాత్సల్య పూర్ణులార! 11

సీ. మీమాట జవదాఁట మీ రాన తిచ్చిన
యాశ్రయంబును వీడ నని తలంపుఁ
డగ్గరుడాద్రిపై నఖిలపూజ్యంబైన
యర్చాకృతి వహించి యధివసింతుఁ

---

1. ఒప్పుగా.

గలికల్మషవినాశకంబై మదర్చావ
    తారంబు కడుమహత్త్వంబు గాంచు
వేంకటేశాభిఖ్యవెలయు నాలుగుపుణ్య
    దేశంబులందు మదీయమూర్తి

తే. గీ. ధరణిఁ గలివేళ శేషాద్రిద్వారకయును
    నౌపురము నుపమ్మాకయు నాఁదనర్చు
    దివ్యదేశంబు లవి జగత్సేవ్యమాన
    భవ్యవిభవమహత్త్వసంభావ్యగరిమ. 12

గీ. కొంతకాలంబు శేషాద్రిఁ [1]గొమరసామి
    యనుచు భావింపఁగాఁ బడియంత నంత
    శ్రీనివాససమాఖ్యఁ బ్రసిద్ధమైన
    వేంకటేశాఖ్య వెలయుదు విశ్రుతముగ. 13

ఉ. అంతట ద్వాపరాంత మగు నప్పుడు నారదమౌని మన్నగో
    పాంతముఁ జేరు సేతుమధురాదికదక్షిణదేశయాత్ర ల
    త్యంతము దీక్షఁ జేసికొని యందు మదీయ నివాసపుణ్యవృ
    త్తాంతము నాన తీవలయు నంచు ననుం గడువేఁడు వేడుకన్. 14

మ. అపు డానాలుగు మన్నివాసముల మాహాత్మ్యంబు సొంతంబుగాఁ
    గృపనేఁ దెల్పఁగ దేవమౌని యురగాధీశాద్రిపై నుండి య
    య్యుపమాకం గన నేగుచు న్నడుమ నెన్నో పుణ్యదేశంబు ల
    చ్చపుభక్తిం దిలకించు నంచును భవిష్యద్వృత్తమేఁ దెల్పఁగన్. 15

---

1. కుమారస్వామి.

క. అక్కడ నె యుంట ముని విని
యక్కడ కేతెంచి మిగుల నానందముతో
న[1]క్కాటికవడుగుc బనివిని
య[2]క్కాటిక న్విడిచి యేగె నభిమతగతియై. 16

సీ. ఏగి యన్నారదుం డెపు డెపు డావ్యాప
రావసానం బని యాత్మయందుc
దలcచుచు నుండంగc దత్సమయంబురా నంత
దక్షిణ దేశయాత్రల నొనర్చి
కొని శేషగిరి నివాసుని శ్రీనివాసుని
వేంకటేశ్వరుని సేవించి యుండc
గరుణ శ్రీహరియు సాక్షాత్కరించి మదీయ
నిలయము ల్గొలువcగా వలెనటన్న

తే. గీ. స్వామి! శ్రీమాధవ! మహాప్రసాద మనుచు
వెడలి ప్రథ[3]మావసథముగా వెలయుదాని
మాని శ్రీకాళహస్తినామప్రసిద్ధ
సిద్ధనిలయంబుc దొలుత వీక్షించె నెదుట 17

మ. వినువీథిం జనుదెంచుచుం గనియె నవ్వీణామునీంద్రుండు తి
న్నని భక్త్యున్నతిc దన్నుc గొల్వ మది నానందంబునుం బొంది తి

1. వామనబ్రహ్మచారి. 2. గ్రామము. 3. ఇల్లు.

న్నని లోఁగొన్నసమీరలింగని నిశాంతంబైన శ్రీకాళహ
స్తినగస్త్యప్రభవాతటిన్నతజనశ్రీదంబుఁ బ్రాసాదమున్ 18

చ. ఘనతరభక్తి నమ్మునిశిఖామణి దచ్ఛిఖరత్రిశూలమున్
గనుఁగొనినంతనే మహతికాజపమాలలతోడి కేలుదో
యిని నిటలంబు నందు ఘటియించి తదంతరమూర్తి నాత్మలోఁ
జొనిపి నమశ్శివాయ యనుచుం దగ మ్రొక్కె నతోత్తమాంగుఁడై

సీ. అడ్డదిడ్డంబుగా నొదల నిడుకొన్న
వలిపంపుమడుఁగు దోవతులపిడుప
లళికప్రదేశాది కాంగకంబుల లెస్స
ప్రామినదట్టంపు భస్మరేఖ
లెడమమూఁపులయందు దృఢముగాఁ గస్పట్టు
స్వచ్ఛప్రభంబులౌ జన్నిదములు
గడుశుభ్రముగఁ దోమినడి కేలఁ దాల్చిన
యా[1]తామ్రతామ్రమయాంబుపాత్ర

తే. గీ. లమరఁ గాంచనముఖరీజ లావగాహ
నములఁ గావించి వాయులింగము భజించి
పరశివస్తవముఖు లౌచు వచ్చుద్విజులఁ
గాంచి దివిజమహర్షి హర్షించె మిగుల

1. ఎఱ్ఱని, రాగి.

శా. ఏవారిం గనుఁగొన్న [1]పాశుపతదీక్షైకస్ఫురల్లాంఛనం
బేవారిం గనుఁగొన్న నిర్జరధునీ హృద్యాంబుపూరోపమం
బేవారిం గనుఁగొన్న బద్ధమదమత్తేభేంద్రదానోక్షితం
బేవారింపఁగరానిభాగ్యగతిచే నిచ్చోటి కేతెంచితిఁ. 21

మ. పురి పంచాక్షరి విప్రులెల్ల జితకాము ల్భూపతుల్ రాజశే
ఖరు [2]లూరవ్యులు గిన్నరాధిపతిసఖ్యప్రఖ్యు [3]లంఘ్ర్యుద్భవుల్
పరమాహీనగుణుల్ సమస్తజను లైశ్వర్యాఢ్యులుం గావునం
గర మాక్షేత్రముచూడ దక్షిణదిశా కైలాసమై భాసిలున్. 22

సీ. శ్రీకాళహస్తిపురీనాయకుఁడు సర్వ
మంగళాఢ్యుఁడు రాజమకుటమాళి
జ్ఞానప్రసూనాంబ సకలభూభృద్రాజ
మూర్ధావతంసంబు ముద్దుఁబట్టి
సౌవర్ణముఖరిప్రసన్నపావనమూర్తి
బహుజీవనాధార భవ్యకీర్తి
పరివారదేవత ల్పరశివధర్మప్ర
భూతప్రభూత విభూతిశాలు

తే. గీ. లహహా! దక్షిణకైలాసమై యెసంగు
నీమహాక్షేత్రవాసుల కిహపరములు

1. శివదీక్ష. 2. కోమట్లు. 3. శూద్రులు.

కరగతఫలంబులై యుండుఁ గాన నిందు
నిలువ నలువయు బలువైన నిష్ఠఁగోరు. 23

గీ. ఇచటఁ గీటసరీసృపమృగకిరాతు
లవ్యయానందమును జెందిరని యెఱిఁగియు
నేల స్వర్గాదిపదవుల నేలఁదివురు
శతముఖాఖిలామర సముదయంబు. 24

చ. ఋషి దనియించె స్వర్గముఖరీసరిదంబుఝరీపరిస్ఫుర
త్పృషతపరంపరాభరధురీణసమీరణపోతజాతము
న్మిషదరవిందగంధభృతి మెల్లన వచ్చుతదీశలింగరో
హిషతురగార్భకానుగతి నిమ్మడియై యవు డల్ల నల్లనన్. 25

ఉ. మాని తదీశ గేహముఖ మంటపసీమను సాఁగిమ్రొక్కి యా
స్థాన[1]సభాజిరంబునఁ బ్రదక్షిణకృత్యము దీర్చి నందిరా
జానుమతిం దదంతరగృహంబున కల్లన యేగి నమ్రుఁడై
జ్ఞానసుమాంబికాహృదయ నాథుఁ గనుంగొని భక్తియుక్తుఁడై. 26

క. [2]మందాకినితోయంబుల
మందారప్రసవములను మరుదాకృతి నీ
శుం దానములను బూజల
నుం దనిపి మునీశ్వరుండు నుతియించె నిటుల్. 27

1. సభాంగణము. 2. ఆకాశగంగ.

గీ. దేవతాదేవ! తావక సేవకత్వ
భావుకులకును భవభవ ద్భవ్యనామ
సంస్మరణశీలురకుఁ గాక [1]సంసరణము
దాఁటఁ దరమెగజ[2]ఝషణదాటదమన. 28

క. బహుగతుల నిటుల శ్రీకా
ళహస్తినగరీశువినుతుల నొనర్చి ముహు
ర్ముహురావర్తితకీర్తన
మహతిసహాయముగ గాన మాధురిఁ జూపెన్. 29

ఉ. అచ్చట నుండి వెల్వడి వియచ్చరమాని పినాకినీధునీ
ప్రోచ్చలదూర్మిమజ్జనసుపూతతరాకృతులై భజించినన్
గ్రచ్చర లిచ్చు రంగపతిఁ గన్గొన [3]విక్రమసింహపట్టనం
బచ్చపుభక్తి మీఱఁగ విహాయసపద్ధతిఁ జొచ్చెఁ జెచ్చెరన్. 30

ఉ. శ్రీరమణీయమై కవివరేణ్యనరేంద్రుల కెద్దియాంధ్రభా
షారసికత్వకీర్తి నిడఁ జాలి బృహస్పతినైనఁ గేరి మె
య్యారను ముద్దరాలయిన నుక్తిచమత్కృతిఁ జూపు నట్టినె
ల్లూరుపురంబుఁ జొచ్చె దనయోరలఁ బౌరులు వెంటఁ గొల్చిరాన్.

క. పెన్నఁ గని మాని నుతి సలి
పె న్నగనిర్ఝరిణి కాదు పిన్నగఁ దగు రూ

1. సంసారము. 2. నీటఁ దిరుగు మొసలి. 3. నెల్లూరు.

పెన్నఁగ నిర్జరనది కిది
పెన్నగ నిక్కముగఁ గాశ్యపి కిది యటంచున్. 32

గీ. లోని కరగి భుజంగశయానుఁ డగుచు
యోగనిద్రాభిరాముఁడై యొప్పువాని
రంగనాయకు మన మలరంగఁ గాంచి
మేని పులకాంచితాంగుఁడై మహితభక్తి. 33

క. వలఁగొని సాష్టాంగనతుల్
సలిపి రహి న్మహతి గాన సారామృతమున్
వెలిసి మెల పొలయఁగా మే
ల్కొలిపి ప్రసన్నునిగఁ జేసి కొని వెడలి వడిన్. 34

సీ. మంగళాచలసీమ మంగళామలధామ
వర్తియౌ నరసింహమూర్తి సేవఁ
గావింపఁగా నెంచి భావింపఁగా నంచి
తంబైనభక్తిచేతంబు లేవఁ
దనరంగ ఘనలీల దనరంగదనుకూల
సరణిగా వింతైన కరణి భావ
భవ్యంబుగా శ్రుతి శ్రావ్యంబుగా శ్రుతి
స్వరలయగ్రామభాస్వరతఁ గేవ
తే. గీ. లంబుగను జేతనాచేత నంబులుగను
వృత్తి వినిమయ మబ్బ ముద్వృత్తిఁ జేయ

వీణ వాయించెఁ గానప్రవీణతైక
సుందరుం డందు మౌనిపురందరుండు. 35

గీ. సామిచేఁ గ్రోలఁగాఁబడి సామి శేష
మైనయాత్మకమండలు పానకంబు
నాని యందుండి యమ్మౌని యరిగి కాంచెఁ
గృష్ణవేణి పయోనిధి కృష్ణవేణి.

శా. ఆ కృష్ణానది దేవమౌని తడవు ద్యద్భక్తిమై స్నాన ని
ష్ఠాకృష్ణాశయవృత్తి మీఱ నియతుండై మజ్జనోన్మజ్జన
వ్యాకీర్ణాత్మజటాభరంబుగఁ దదేకాసక్తి నుండం బ్రజా
నీకం బారయుచుండె నొడ్డునఁ ద్రివేణీసంగమభ్రాంతిచేన్. 37

గీ. ఆతఁ డచ్చోఁ దడవు తీర్థమాడి విహిత
కృత్యములఁ దీర్చికొని లేచి గిరితటమున
దిటముగా భక్తులను బ్రోచు దీక్షనున్న
కనకదుర్గామహాదేవిఁ గాననరిగి. 38

క. అంబా త్రయరూపిణి! యో
యంబా! శ్రితవితతిఁ గడు దయం బాలనఁ జే
యం బాపములం బాప భ
యం బాఁపఁగ నోపు దీవయంబా! జగతిన్. 39

క. నీపదములఁ జూడంగా
¹నీపదళస్రగ్విభాసి నీ! పదపడి నే
నీపదములఁ బాడంగా
నీపదవి న్వచ్చినాఁడ నీపదమునకున్. 40

మ. అన నద్దేవి ప్రసన్నురా లగుచు నాహా! దేవ మౌనీంద్ర! నీ
ఘన సంగీతకలాకలాపకలనా కౌశల్య మెన్నాళ్లకో
వినఁ గల్గెం గద నేఁడు వెండియు మఱి ద్వీపంబున న్నాఁడు విం
టిని శ్రీరామపదాంకగేయమును దాని న్వీణియం జొన్పితే. 41

క. అన విని యనిమిషముని యను
జననీ! శ్రీరామనామ సారజ్ఞత్వం
బనఁగా నీవల్లభునిది
యను నీయదియును గదమ్మ! యోహరుకొమ్మా! 42

క. నీమణివీణాసన్నిధి
నామహతి యనంగ నెంత నాగానకళా
సామగ్రి యెంత నన్నీ
వేమేమో పెద్దఁ జేసె [illegible] 43

క. వాయించెద నావీణియ
మ్రోయించెదఁ దంతియలను శ్రుతులకు రక్తిం

1. కడిమిపూఁదీఁగల హారము.

జేయఁగ నీదరిఁ జాలుదు
నా? యమ్మా! తప్పదనుటయది నాయమ్మా? 44

క. నీ వాన తిచ్చినట్టులు
గావించెద ననుచు లెస్స గాన మొనర్చెన్
దేవియు జతగాఁ దనవీ
ణావాదన మాచరింప నారదుఁ డెలమిన్. 45

గీ. ఇట్టుల ద్దేవిసేవించి ఋషివరుండు
పనివినెడునప్పు డామె యిట్లనుచుఁ బలికె
మెచ్చితిని గోరుకొనుమయ్య యిచ్చెదాన
వరము నెద్దియునైననిర్జరమునీంద్ర.

గీ. అనిన విని యామెతోడ నిట్లనియె మునియు
నంబ నన్వీతరాగుఁడ నని యెఱింగి
యును వరముఁ గోరికొను మటంచును వచించి
తరయ నన్వీతరాగుఁడ ననియొ చెప్పుమ. 47

క. విన నొక కోర్కి కలద
మ్మా! నామది రామనామ మంత్రమ్మునకున్
ధ్యానాద్యుపాసనల కే
వైన విశేషంబు లున్న నవి విన వలఁతున్. 48

మ. కో. నావుడుం దరహాసమున్ వదనంబునన్ వెలయించి యా
దేవి యమ్మునిఁ గాంచి యిట్లని తెల్పెఁ దారకమంత్రమం

దే విశేషము లున్నవో పరమేశ్వరుండు మదీశ్వరుం
డే వచింప [1]వలంతి గాకొరు లెవ్వరైన సమర్థులే? 49

క. వరము వేఁడు మనుచు బలవంత మొనరించి
యడుగనిడఁగ జాల కుడుగ వలసె
నైన నాదనుడువు వ్యర్థం బొనర్తునే
తగినవెరవుఁ దెల్పు దానఁ గాక. 50

గీ. మునిజనవరేణ్య కాశికాపురమునందు
విశ్వనాథుండు మన్నాథుఁడీశ్వరుండు
రామనామప్రబంధకీర్తనము వినినఁ
దన్మహామంత్రరాజతత్త్వంబుఁ దెలుపు. 51

తరలః

గని కృతార్థుఁడనైతి మోదము గంటి ఖేదము గెంటితిన్. 52

ఉ. ఇమ్మహి వేంకటేశ్వరుని యిమ్ములు నాల్గు చెలంగు దివ్యదే
శమ్ములు సేవలమ్ముఁ గలుషమ్ములఁ బాపఁగ నోపు నర్థవా
ద మ్మిది గాదు శేషగిరి ద్వారక నావురి గారుడాద్రి స
త్యమ్ము ప్రసిద్ధసిద్ధనిల యమ్ము లభీష్టఫలప్రదమ్ములున్. 53

1. సమర్థుఁడు.

క. ఆనాల్గు దివ్యపదముల
లో నెవ్వఁడు తప మొనర్చు లోకజనిత్రీ!
వానిది యగుఁ దప మల[1]రే
వానదితటిఁ జేయుతపమువలె నిడు ఫలమున్. 54

క. ఆ వేంకటవిభు నెళవుల
కేవారలు నైన యాత్ర కేగుదురో వా
రా వెనుక నితరయాత్రలు
గావింపఁగ రాదటంచుఁ గల విలఁ బలుకుల్. 55

సీ. కావున నిచ్చోటుఁ గడచి యెవ్వలనికిఁ
జనఁజన దని కొంత సందియంబు
నచట నమ్మంత్ర మత్యల్పమైన జపింప
నగు సిద్ధి యనుచుఁ గొండంతయాస
కోరికొమ్మని యాస గొల్పి లేదన నొప్ప
నే యని యడుగ నీ యెడ భయంబు
నీమెకే తెలుపఁ డా యీశుండు నాకెట్టు
లెఱిగించు ననుచునిస్పృహత గొంత.

తే. గీ. "పెట్టఁజాలక యుండినఁ బెట్టునిల్లు
నైనఁ జూపింపవలయు" నన్నట్టు చూపి

1. నర్మద.

తీవటంచు సమాధానవృత్తి కొంత
కలిగి నాడెంద మిట్టి ళిఁ గలఁత నొందె. 56

మ. అన మందస్మిత మొప్ప దేవి కరుణాస్వాంతంబుతో మౌని కి
ట్లనియె న్గమ్యము.దక్కి నిన్నడుమఁ బుణ్యక్షేత్రముల్ రెం డోగిం
గనుపట్టుం గద ద్వారకాపురియు నౌకాపల్లియు న్వేంకటే
శనివాసంబులు సిద్ధసేవ్యములు శశ్వద్విశ్వసంభావ్యముల్. 57

క. రేవాతీరతపంబును
శ్రీ వేంకటనాథుఁ డుండు క్షేత్రంబులలోఁ
గావించుతపంబును సరి
యై వెలయు న టన్నుడి యథార్థము గాఁగన్. 58

ఉ. గౌతమియొడ్డునం దప మఖండఫలప్రద మంచుఁ గోవిద
వ్రాతము వల్కుచుంట వినవా మన వామనవామదేవుల
పూతమహాస్రవంతి కిరుపొంతల నాజలరాశిగాఁగ నా
త్మేతరదేవత ల్గొలువ నిచ్చ వసించిరి పెక్కురూపులన్. 59

క. నారద భద్రాద్రిస్థిత
తారకమంత్రాధిదైవత శ్రీరామో
దారపదోదకపావన
యైరాజిలు గౌతమీమహానది యెల్లన్. 60

గీ. దేవతను బట్టి క్షేత్రంబు దివ్యమగును
దీర్థమును క్షేత్రమును బట్టి దివ్యమగును

[1]త్రితయమొక్కెడఁ గూడిన దివ్యదేశ
మిద్ధరిత్రి నిదే కద సిద్ధపదము. 61

క. ఆకరణి దివ్యపదమగు
నా కాపలి యందు రామనామ జపం బే
కాగ్రవృత్తి జేసినఁ
జేకుఱుఁ దన్మంత్ర విధ మశేషముగ వెసన్. 62

సుగంధి. ఓతపస్విలోకనాథ యుగ్రమౌతపంబు నీ
గౌతమీస్రవంతిఁ జేయఁగా దయార్ద్రచిత్తుఁడై
ప్రీతి వేంకటేశ్వరుండు పెంపుమైఁ బ్రసన్నతన్
సీతలంపుఁ దెల్పు నాథునీవతంస మిట్లనున్ 63

శా. నాతీరంబున సంవసించి కరుణన్నాకావిహారంబుల
న్నాతోయంబుల సంచరించుచు నను న్మన్నింపవే యంచు నా
[2]స్రోతస్వ్యవతంస మీప్సితపుఁ దీరుం దెల్పనల్పేతర
ప్రీతిం దా నివసించెఁ దత్తటమునన్ శ్రీవేంకటేశాకృతిన్. 64

గీ. అట్టులాతఁడు వసియించి నట్టిదేశ
మోడపల్లె యనంగఁ బేరొంది వెలసె
నందుఁ దపమాచరించిన యట్టివారి
వాంఛ లీడేర నాహరి వర మొసంగె. 65

---

1. మూఁడును. 2. నదులలో శ్రేష్ఠమైనది.

గీ. అందుఁ గొన్నాళ్లు నియతి నీ వధివసించి
యరుగు మవ్వలి దరికిఁ గార్యార్థివగుచు
నచటి కెదుటను దోఁచుఁ బుష్పాద్రిపద్మ
శైలధవళాచలములు నిర్జరమునీంద్ర! 66

సీ. గోదావరీవారిఁ గోటిలింగేశ్వరు
భక్తియుక్తిగ నభిషిక్తుఁ జేసి
తత్పార్శ్వవర్తిసీతారామమూర్తిఁదా
రకనామదివ్యమంత్రమునఁ దనిపి
తద్వాయ్వభాగసంస్థాయిమార్కండేయ
శంభులింగము సమర్చన మొనర్చి
తద్దక్షిణమ్మున ధవళాద్రిశ్రీజనా
ర్దనుఁ గొల్చి రామపాదముల కెఱఁగి
తే. గీ. యవలఁ దూర్పుదెసకు నై యోజనత్రయ
దూర మరిగి యచటఁదుల్యాదరిని
వెలుగుచున్నయట్టి శ్రీకుమారారామ
సీమ భీమనాథు సేవఁజేసి. 67

క. అందుండి పీఠపురమున
కుం దరలుము కుక్కుటేశు కోవెలనడుదా
రిం దోఁచు గవనిప్రోలఁగ
నం దగు నందీశకేతనస్తంభముతోఁ. 68

క. ఆదిన్యక్షేత్రంబున
నీదగు కోరిక లభించు నిక్కంబుగ నీ
కేఁ దెల్పునుపాయం బదె
యోఽద్వైతమునివరేణ్యా! యురుతరపుణ్యా! 69

చ. అదియెటు లన్నచో నొకయుపాయముఁ దెల్పెద నంటి మున్నె యా
సదయునివిశ్వనాయకుఁ బ్రసన్నుని జేసికొనంగఁ గాశికై
యది పని గాఁగ నేగవలదంతట నాతఁడు నిండియుండు నా
రద! జగదంతరాత్మయని ప్రాజ్ఞులు పల్కఁగ నాలకింపవే. 70

శా. కైలాసంబునుఁ గాశికానగరియుం గాణాచిగా నాతఁ డే
లీలం దా వసియించియుండు భువి నాలీల న్వసించెం గదా
యేలాతీరమునందుఁ బీఠపురి దేవేంద్రార్థసిద్ధ్యర్థమై
వాలాయంబుగఁ గుక్కుటాకృతి స్వయం వ్యక్తాచ్ఛలింగంబునన్.

శా. ఆకాశీపురి యాదిమం బిది ద్వితీయం బంచు విశ్వేశ్వరుం
డో కంజాతభవాత్మజాత! సతతం బుల్లాస మేపారఁగా
శ్రీ కైలాసమునందుఁ బోలె నివసించెం గుక్కుటాకారుఁడై
లోకానుగ్రహకాంక్షఁ బారిషదపాళుల్వేలుపుల్గొల్వఁగాన్. 72

సీ. భాగీరథి యటంచు వచియింతు రచ్చోట
నేలానది యటంచు నిచటఁ బేరు
బిందుమాధవుఁ డంచు బేర్కొందు రచ్చోటఁ
గుంతిమాధవుఁ డంచు నెంతురిచట

మణికర్ణిక యటంచు గణుతింతు రచ్చోట
ఖ్యాతి యిచ్చుటఁ బాదగయ యటంచు
నన్నపూర్ణయటంచు నెన్నుదు రం దెందు
శ్రీరాజరాజేశ్వరి యని కీర్తి.

తే. గీ. యందు విశ్వేశ్వరుం డందు రిందుఁ గుక్కు
టేశ్వరుం డందు రింతె కాకింతయైన
భేదమున్నదె కాశికిఁ బీఠపురికి
సంజ్ఞలే భేదములుగాని సన్మునీంద్ర. 73

క. అది యైదుక్రోశముల నిడు
పిది యామడవర్తుల మగు నెటుఁ జూచిన న
య్యది యిది పరమేశ్వరునకు
సదనంబులు భుక్తిముక్తి సంస్థానంబుల్. 74

శా. మున్నాటర్వది [1]దేవతాయతనము ల్పొల్పొందు నవ్వీటిలోఁ
జెన్నారు న్నలుతట్లు యూపముల వాసిం జెంది యేలాతటిం
గన్నారం గన సౌధయూథము లసంఖ్యాతంబు లవ్వీథులం
దున్నం దన్నగరీప్రభావము దరంబే యేరికి న్నారదా! 75

ఉ. తారకమంత్రముం గురుఁడు దా వయి మానుగ నిచ్చుటన్ జనుల్
దారకలంకులై మనఁగ దప్పక యొప్పుగ నిప్పురంబునం

---

1. దేవాలయము.

దారకవిద్విషద్గురుఁడు దా నుపదేశ మొనర్చ సత్కృపో
దారకటాక్షుఁడై శిశుత యాదిగ నైహికసౌఖ్యముల్గనన్. 76

ఉ. ఓదివిజర్షి వర్య! పురుహూతికపేరిటిశక్తిపీఠ మ
ష్టాదశపీఠులం దిది నిజంబుగ నెన్నఁ బిత్ర్యాణిముక్తికిం
బాదగయాఖ్యతీర్థము విభాసిలు నిందు గయాత్రయి న్నత
శ్రీదునిఁ గుంతిమాధవు భజింపఁగ నౌ నిటఁ బంచమాధవిన్. 77

క. గంగానది గోదావరి
యుంగావేరియును గృష్ణయును బోలికఁ జే
యంగాఁ దగ వేళేటికి
బంగారమె పండుదాని వాఃపూరములన్. 78

చ. జనములు గుంతిమాధవనిశాంతసుదర్శనదర్శనంబు చే
సిన మును చేసినట్టివి యశేషముగా నఘము ల్నశించు న
వ్వనజదళాయతేక్షణుని పాదసరోరుహదర్శనంబుఁ జే
సినఫల మిట్టిదింత యని చెప్పఁగ శక్యమె నీకెఱుంగవే. 79

చ. పొరిఁబొరి లేచి ప్రత్యహముఁ బ్రొద్దునఁ బుష్కరిణీజలంబులం
బరువడిఁ దీర్థమాడి జిగి పట్టుమడుంగులు గట్టి యొప్పుగాఁ
దిరుమణి [1]కాపు దీర్చికొని దివ్యతరద్రవిడప్రబంధభా
స్వరనినదాస్యులై తగఁ బ్రపన్నులు గోవెలఁ జొత్తు రే డ్రైజర్.

---

1. కావలిబొట్టు.

శా. సేవాకాలమునందు నందు నలలక్ష్మీజానికైంకర్యముం
గావింపంబఱతెంచి యొక్కమొగి భక్తశ్రేణి నిత్యంబు న
య్యావాసంబున భక్తిచే నుభయవేదాంతజ్ఞు లధ్యాపకు
ల్ఠేవం జేయు [1]ప్రబంధఘోషముల నాలించుం బ్రమోదంబునన్.

సీ. సిరి యురంబున వసుంధరయునీలయు నెమ్మి
నిరుప్రక్కలవసించి మురువుఁ జూప
శంఖచక్రగదాసిశార్ఙ్గాయుధంబులు
మూర్తిమంతంబులై మ్రోలఁ దోఁప
వైనతేయుండువిష్వక్సేనుఁడును భక్తిఁ
గేల్దోయిమొగిచి ముంగిటను గొలువ
వివిధోపచారముల్ సవరించుచును శేషుఁ
డన్నివంకలఁ దానయై భజింప

తే. గీ. సురలుబ్రహ్మేంద్రసహితులై చుట్టునిలువఁ
బ్రత్యహముఁ గుంతిమాధవస్వామి కెలమి
బార్వతీపరమేశ్వరు ల్వచ్చి నెఱపు
రాజభోగంబుఁ గనుట దుర్లభము సుమ్ము. 82

సీ. మును మున్ను మాధవ పుష్కరిణీవారిఁ
దీర్థంబులాడి యద్దేవుఁ గొలిచి

1. ద్రవిడ వేదములు.

యాపెన్కఁ బాదగయాన్వితుఁడై హస్తి
ముఖుఁ గాంచిదక్షిణామూర్తి నరసి
షణ్ముఖు సేవించి చండీశు భావించి
భైరవు భజియించి ధ్వజ [1]వితర్ది
కెలన నాత్మప్రదక్షిణముల నొనరించి
నందీశు నానతి నొంది లోని

తే. గీ. కేగి యచ్చట శ్రీకుక్కుటేశుఁ బరమ
భక్తి నభిషిక్తునిగఁ జేసి ప్రస్తుతించి
రాజరాజేశ్వరీ దేవిఁ బూజనముల
సలిపి నాఁ డందు నివసింప వలె జనుండు 83

శా. సాయంకాలమునందు నందుఁ బురవాస్తవ్యుల్ సురస్త్రీవ్యూఁడా
నాయీశానుని సేవనార్థమయి భక్త్యావేశ మేపార యా
తాయాతస్థితిఁ గూర్చుసందడి కమర్త్యశ్రేణి పాదప్రూలం
దే యుంచుం దమ [2]వ్యోమయానములతో నింగి న్నిరీక్షించుచున్.

గీ. ఇతరులగు వేలుపులను బ్రత్యేకముగను
దత్తదాలయములఁ జూడఁ దగుఁ గడంగి
యందునున్న స్నిన్నాళ్లు ప్రత్యూహమునందు
నరయవలె రేపుమాపు శ్రీహరినిహరుని 85

---

1. అరుఁగు; వేదిక. 2. విమానములు.

సీ. వాణి వీణియఁ బూనిరాణతో వాయింప
విబుధేంద్రుఁ డింపుగా వేణు వూదఁ
గమలజుం డనుకూల గతిఁ దాళమును మీటఁ
[1]నాళీకనిలయ గానంబుఁ జేయ
గంభీరముగ మృదంగము శౌరి మ్రోయింప
ననిమిషశ్రేణి చుట్టు నివసింప
నచ్చరల్ క్రమలయన్యాసంబుఁ బరికింప
బ్రహ్మర్షు లానందపరత నుండ

తే. గీ. రాజరాజేశ్వరీదేవి రత్నఖచిత
సింహపీఠికఁ గొలువుండి చిత్తగింప
సాంధ్యవేళలఁ గుక్కుటేశ్వరుఁ డొనర్చు
తాండవముఁ జూడఁ గన్నుల పండువగును 86

ఉ. ఆనటనావసానసమయంబున నల్లన విశ్రమార్థ మీ
శానుఁడు దేవితోడ వల చక్కినిఁ జక్కఁగ నేకపీఠికం
దా నివసించి యుండఁ బ్రమథద్వితయం బిరుతట్లఁ జామరల్
పూని విభూషణంబులకుఁ బొందగు విందుగ వీచుచుండఁగన్. 87

గీ. పీఠమూలంబున వసించి వినయవృత్తిఁ
దనయు లిరువురుఁ బదమునొత్తంగ ముదము

---

1. లక్ష్మి.

గదురఁగొండొకసేపందుఁ గరుణనిలచి
కొలువుఁగావించునందఱఁగలయఁగనుచు. 88

మ. స్మిత మొప్పన్ శశిమౌళి భృంగి దెస వీక్షింపం దదిచ్ఛన్ సభా
గతు లెల్లం గడుఁబొర్లి నవ్వఁగఁ జమత్కారంబుగా నాతఁడం
చితమౌహాస్యకళావినోదముఁ బ్రపంచింపంగఁ గొండొక్క సే
పు తగన్ లీలఁగఁ జిత్తగించి విలసన్మోదాత్ముఁడై పిమ్మటన్.

శా. దేవి న్నవ్వుచుఁ గాంచి యంతట నె నందిం జూడ నాతండునుం
బ్రావీణ్యంబును జూపు వేడుక నుమామాణిక్యవీణాగుణా
రావశ్రీ దన కంఠరాగమునకుం బ్రాపై విజృంభింప భా
షావామాక్షియు మెచ్చఁ బాడి విభునాజ్ఞం జెంది చాలించుచోన్.

చ. అమరమునీంద్ర! మంచిసమయం బది నీ కపు డీవుఁ జక్కఁగా
నమరిచికొన్నవీణియ సమంచితరీతి గ్రహించి రామనా
మము స్మరియించుకొంచు [1]సుర మస్కరిమండలినుండి మ్రోల నిన్
గ్రమముగఁ గానిపించుకొనఁ గా [2]దరహాసముఁ జేయు నీశుఁడున్.

గీ. అదియయనుమతిగా నెంచి యంచితముగ
రామనామప్రబంధకీర్తనముఁ జేయు
మతఁడు నావలె సంతుష్టినొనతిచ్చు
వరముఁ గోరు మటంచు నో వరమునీంద్ర. 92

ఉ. అందుల కీవు డెందమున యందలివాంఛ నివేదితంబుఁ జే
యం దగు నందుపై ముదము నందుచు నందిహాయుం డమందమా

1. సురముని. 2. చిఱునవ్వు.

నందము నీవు చెంద విధినందన! తారకమంత్రతత్త్వపుం
జందము నెల్లఁ దెల్పు నిటు సల్పు మటంచును దద్విశేషముల్. 93

ఉ. ఇంతియ కాదు తన్నగరి కీ వరుదెంచితి వన్నవార్త వి
న్నంతనె నిన్నుఁ గాంచు తెపు డంచుఁ దలంచుచు దేవసేవలం
దెంతయు భక్తి మ్రొక్కు లిడు నెప్పుడు నప్పుర మేలు ధారణీ
కాంతుఁడు వాని దుర్గమునకై చని యాతనిఁ బ్రీతుఁ జేయుమా.

ఉ. ఆతఁడు నిన్నుఁ దారక మహాత్త్వముఁ దెల్పు మటంచు వేఁడినం
జేతము బ్రీతి నొంద శశి శేఖరుఁ డేగతి నీకుఁ దెల్పె నా
రీతి సమస్తముం దెలిపి తృప్తిని జేయఁ దగుం గులక్రమా
యాతముగాఁగఁ దన్నిరతి నాతనిసంతతి వృద్ధిచెందఁగన్. 95

ఉ. ఆవిధి లబ్ధవాంఛితుఁడవై యుపమాకకు నేగు మంచు న
ద్దేవి యనుగ్రహించిన నిదేశము చొప్పున నప్పు డొప్పుగా
దైవతమాని వెల్వడి యథాక్రమరీతి సమస్తతీర్థసం
సేవల నాచరించుకొని చెచ్చెర నగ్గరుడాద్రి కేగుచోన్. 96

క. వడి నడవిదారిఁ గొని కా
ల్నడఁ దా జడదారి యొకఁడ నడచెడు నెడ నొ
క్కెడఁ బ్రొద్దు గ్రుంకగా న
క్కడ నారే యుండఁ గడఁగి [1]కడ లీక్షింపన్. 97

1. దిక్కులు.

సీ. కహాకహారార్భటిఁ గాక [1]కంకగృధ్రోలూక
ములు గూండ్లదరిఁ జేయుకలకలంబు
వఱడు మున్నసివట్టి వాసితం బొనరింపఁ
గడువడిఁ జేరు నక్కలరుతంబుఁ
బొడసూపఁదఱియంచు బడిబడి నేతెంచు
నలఁతిభూతములు గొండాడురొదయు
వడిగీఱి భువిఁ బాఱవైచినయస్థికై
కలహించి మొఱుగు కుక్కలరవంబుఁ

తే. గీ. గలసి కర్ణకఠోరంబు గాఁగఁ దోఁప
బ్రహ్మరాక్షసచిరతరావాస మగుచు
ననతిదూరంబునం దొక్క ఘనవిశాల
మైనయశ్వత్థ వృక్షంబు గానవయ్యె 98

క. ఆరావిచెట్టువంకకుఁ
జేరక యొకగున్నమావి చేరువఁ దోఁప
న్నారదమునివరుఁ డాసహ
కారముక్రింద నివసించెఁ గడు నెమ్మదిగాన్. 99

ఉ. అంతటఁ దన్నిశం బ్రథమ యామమునం [2]జలపత్రభూరుహ
ప్రాంతము నుండి నక్ జెనక రావము రావ మటంచు బిట్టుగా

1. రాబందు. 2. చలపత్రము = రావిచెట్టు.

నింతియెలుంగు దోఁప నిది యేమొకొ యంచు మునీంద్రుఁ డక్కుజో
పాంతముఁ జేర నేగి యరయంగ నొకండును గానరానిచోఁ. 100

క. ఇది యేమని యబ్బురపడి
మొదలిటి సహకారమూలమునకుం జనఁగాఁ
పదపడి యప్పటిచొప్పున
ముదితయెలుఁగు వినఁబడంగ ముని సత్వరుఁడై. 101

క. అప్పాలనికిఁ జన నచ్చటఁ
నెవ్వండును లేక యున్న నిది యే మనుచున్
నివ్వెరపడి విడిదికిఁ జనె
నివ్విధమున మూఁడు సారులేగుచు రాఁగన్ 102

ఉ. సంధితమైన యంధతమసంబున వెండియుఁ గూయి దోఁప ది
గ్బంధ మొనర్ప నన్నెలవుఁ బాయు నుపాయము లేక మేన నే
సంధియునుం జలింపమిఁ బిశాచరముఖ్యమైన [1]క్ర
వ్యాంధసు లున్నచో నిలువ నచ్చటికిన్ ముని యేఁగి ముంగిటన్.

సీ. పవడపుఁగోళ్ల చప్పరపుమంచముమీఁద
హంసతూలికల శయ్యాతలమునఁ
గుదిటితోఁ దెమలించి కొని తెచ్చి యుంచిన
పూత కుసుమ్మఖమైనపూవుఁదీప

2. రాక్షసులు.

పోలికఁ దముఁ బాసిపుడమి కేతెంచిన
మెఱుఁగారుక్రొక్కారుమించుఁ గదసి
కదలపండఁగఁబట్టికలిపిన మొయిలన
పెన్నెరుల్ మెయి నిండ విరిసియుండఁ

తే. గీ. జక్కఁదనమునఁ జొక్కపుఁ జుక్కవోని
దాన నక్కజమైనచందమున నచటి
యునికిఁగలదాని నెలప్రాయమునఁదనర్చి
మించునొకచిన్నదానివీక్షించియెదుట 104

సీ. కొఱవితో జగడించు కఱకునల్లని మేను
మిడిగ్రుడ్లు గడితంపు మిట్టనుదురు
వెడఁదనోరును దుట్ట పెదవులుగొగ్గికో
ఱలుఁ బుఱ్ఱముక్కునిట్టలపుఁ జెవులు
గుఱువంపుఁ చేతులు గుంటఱొమ్మును దొట్టి
కడుపుఁ నిడుపుఁ గాళ్లుఁ బొడువు మెడయుఁ
బల్ల వెండ్రుకలుఁ దోల్పచ్చడంబును నల్ల
పూఁతగందమ్మును బుట్టతలయు

తే. గీ. నెముకకోలయుఁ బ్రేవుజందెమును బునుక
చెంబుఁ గలవానిఁదిండికై వెంబడించి
యులఁతి బూచులు గొలువంగ వలఁతి యగుచు
గండఁడగునొక్కబ్రహ్మరాక్షసునిఁ గాంచి. 105

శా. ఓహో! యీతనికృత్యమా యిది నిజంబూహింపఁగా నేల త
[1]ద్వ్యాహారంబులచే బయల్పడుఁగదా యంచుం గృపాయత్తుఁడై
యా [2]హంసీగమనావతంసము భయవ్యామోహముల్ వాపి నీ
వాహాకార మొనర్ప నేటి కన నయ్యబ్జాక్షియుం డిగ్గునన్. 107

క. మంచము డిగి పెన్నెఱుల స
మంచితముగఁ గ్రొమ్ముడిగ నమర్చికొని సమా
కుంచితవిగ్రహయై ముని
పంచాస్యునిపాదయుగళిఁబట్టి వచించెన్. 108

ఉ. ఓ మహితానుకంప! సమయోచితదివ్యతరప్రభావశా
లీ! మునివర్య! యే నొక నరేశ్వరుపట్టిని నన్నుఁ బట్టి వీం
డ్రీమెయి నీమహాటవికి నిమ్మణిమంచముతోడఁ దెచ్చి రిం
కేమి భయంబు నీపదము లేఁ గనుఁగొంటిని గంటి సౌఖ్యముల్

చ. అనవుడు బాల! నీ వెవతె వమ్మ? వసించెదు దేశ మెద్ది? యె
వ్వనిసుత? వివ్వనంబునకు వంచన నిమ్మణిమంచమధ్యశా
యిని నిను గ్రుచ్చిలించుకొని యీఖలు లంతిపురంబునుండి యే
యనవునఁ దెచ్చి రమ్మ? వనితా! వచియింపుము మాకు నంతయున్.

చ. అన విని నేను గన్యను మహామహుఁడైన కళింగదేశపుం
జనపతిపుత్రికన్ మదను జన్మఁడు బాలుఁడు తండ్రి వైరితోఁ

---

1. మాటలచే.  2. అంచనడలుగల వనితారత్నము.

బెనఁకువ బోరుచో నొకని ప్రేటున వేఱొకండుగా వడిం
దనువులు వాసి వీరవిహితం బగులోకముఁ జేరి రిర్వురున్. 111

క. పిమ్మట మాపదవికి మా
యమ్మను రాజ్ఞిగ సమాత్యు లనుమతిఁ జేయన్
నెమ్మిగ నామెయు రాష్ట్రం
[1]బుమ్మలికముఁ బొరయకుండ నోముచు నుండెన్. 112

గీ. పిన్ననాఁడు తండ్రి నన్నంధ్రదేశనా
యకున కిచ్చువాఁడ ననుచు ముద్దు
లాడుచుండు నాతఁ డట్లైనఁ దల్లియు
నట్టిపూన్కిఁ దానుఁ బట్టియుండె. 113

క. సచివౌఘము మజ్జనకుని
వచనంబులు వినుట నంధ్ర వసుధాధీశున్
సుచరిత్రునిగా నెఱుఁగుటఁ
బ్రచురంబుగఁ దలఁపు లతని పై నిడి యుండన్. 115

ఉ. నాజనయిత్రి వెంట నరణంబుగ వచ్చిన మంత్రి యొక్కఁడ
వ్యాజిని గూలినట్టి [2]యభియాతికుమారుని వంగదేశపుం
రాజవునంచు వాని కిడ రాదొకో నీదు తనూజ నంచు నే
వ్యాజముచేతనైనఁ గొనియాడును వానిని న న్గాసంగఁగాన్.

1. దుఃఖము. 2. శత్రువు.

గీ. విని విని యమాత్యులను బిల్వఁ బనిచి యొక్క-
నాఁడు తత్తత్క్రియాలోచనముల నెఱపి
యిష్టగోష్ఠీవశంబున నిదియుఁ దలఁప
వారలందఱు నొక్కటఁ బలికి రిట్లు. 116

ఉ. ఒదవెడు భీతి నీదు తనయుండతి బాలకుఁ డౌట వానిమే
నదయుఁ డటంచుఁ బాపభయమన్న దెఱుంగఁ డటంచు మాపయిన్
వదలనిమత్సరంబు గలవాఁ డనుచున్ వినుచుందు మట్టిదు
ర్మదుఁ డగువానిబాంధవము మానుటయే సుమి మాకు మన్ననల్.

క. మాయేలిక యీబాలిక
యాయంధ్రనృపాలు దేవి యౌఁగద యనుచున్
మాయందఱి ముందట వా
లాయముఁ బలుమాఱుఁ దన తలఁ పెఱిఁగించెన్ 118

క. ఆతఁడు పుణ్యశ్లోకుఁడు
వీతాఘుఁడు సూక్ష్మబలవివేకాదులవి
ఖ్యాతుఁడుఁ గావున నాతని
కీతరుణి నొసంగ నిశ్చయింపుము మఱియున్. 119

ఉ. బవరపుమాట యమ్మనుజపాలునివీనుల సోఁకినంత నే
జవనహయాధిరూఢుఁ డయి సైన్యసమేతముగాఁగ వ్రేల్మిడిం
బవనసమానవేగమునఁ బాసటగా మనపక్షమూని వ
చ్చి వినఁగరానిమాట విని చెచ్చెర నేగె స్వరాజధానికిన్. 120

క. కావుననాజనపాలున
కీవనిత నొసంగ నిశ్చయింపుము నీవున్
మా విభునితలఁపు నట్టిద
నావుడు వారలకు మజ్జనని యిట్లనియెన్. 121

క. అనఘాత్ములార మీ తె
ల్పినచొప్పునఁగాక యెందు విధమునఁ గావిం
తు నె యని తద్బాంధవమున
కు నెదస్ మజ్జనని యియ్య కొనియున్న యెడన్. 122

గీ. నేఁటిమధ్యాహ్నమున వంగనృపునిపట్టి
నంగ దేశాధినాథుండు సంగరమునఁ
జీవసంయుక్తునిగఁ బట్టిచెఱను బెట్టె
ననుచు మంత్రుల కొకవార్త వినఁగ వచ్చె. 123

ఉ. దాన నొకింత సంతసిలు దానను గావున నిర్మలోదక
స్నాన మొనర్చి సౌధమున సంజకడ న్నెఱు లార్చుకొంచు మం
దానిలసేవ్యమాన నయి యల్లన మంచముననన్ వసింపఁగా
నే నిదురించితిం బిదప నిచ్చట మేల్కని కన్ను విచ్చితిన్. 124

క. ఆ లో నీలోహాకృతి
యీ లోకభయంకరాత్ముఁ డెదుటం దోఁపన్
నాలో నే నొందిన వెఱ
పాలోకేశ్వరుఁ డెఱుంగు నంతట పీఁడున్. 125

గీ. నిన్ను మ్రింగువాఁడ నీమెడయం దున్న
పసిఁడిబిళ్ల ద్రెంచి పాఱవైవ
కున్న ననుచు మిగుల నుగ్రుఁడై జంకింప
నడలు జెంది బొబ్బ లిడితి మిగుల. 126

క. ఆర్చినకోలంది పిఁడును
బేర్చినయాగ్రహముతోడ వెస మంచముతోఁ
జేర్చి నొకకొండమఱుఁగున
గోర్చితిఁ దత్సంకటముల కోపుణ్యనిధీ. 127

గీ. చిన్ననాఁడు తండ్రి శ్రీవేంకటేశ్వర
ప్రతిమ [1]నఱుత నంగరక్ష గాఁగఁ
గట్టె దానిమహిమగా నెంచి కొండంత
ధృతిని మంచ మేను దిగక యుంటి. 128

మ. అనఁ గారుణ్యమునన్ మునీంద్రుఁడును బాలా! యింక జంకేల? నీ
జననిం గూర్చెదఁ జేర్చెదన్ వడి మనస్సంప్రార్థితుండై ననా
ఘనితోడ న్నినుఁగూడ నేఁడె యని యద్దృష్టాత్ముపై దోషనా
శనకృత్పాదగయోదకంబు కలశస్థం బల్లనం జల్లినన్. 129

క. పీతాఖిలపాతకుఁడై
యాతఁడు పైశాచక్రియావిముఖుండై

---

1. మెడను.

యాతపసిపదములం బడి
యోతంద్రీ! ప్రోవుమనుచు నాగిఁ బ్రార్థింపన్. 130

శా. నీ వెవ్వండవు? నీకు నెప్పగిది నీనిర్భాగ్యరూపప్రచా
రావస్థాదులు గల్గె? నీయబల యెట్లాకృష్టయైచిక్కె నీ
చే? వీండ్రెల్ల నెవండ్రు దెల్పు మిఁక రక్షింతున్ సమగ్రానుకం
పావేశంబున వీండ్రతో నిపుడె నిన్నన్నం బిశాచేంద్రుఁడున్. 131

గీ. పాండ్యదేశాధిపునిప్రాడ్వివాకవంశ
భవుఁడనగు నొక్క శ్రోత్రియ బ్రాహ్మణుండఁ
బృథివి ధూర్జటిశర్మాఖ్య వెలయువాఁడ
నెల్లరకుఁ దెల్లమగుజాడ నెసఁగువాఁడ. 132

సీ. బాల్యకాలమునందె స్వాధ్యాయమయ్యును
జవిచూచినాఁడ శాస్త్రము లొకింత
[1]నాభిజాత్యము గలదంచు నిక్కుచునుందు
సప్రమాణోక్తి కింతైన వెఱవఁ
గడు [2]వికత్థనతచే మిడిసిపడుచునుందు
నొరుల పెంపునకుఁ జూపోపఁ జాల
బ్రహ్మజ్ఞుఁడ నటంచుఁ బగ్గెలు గొట్టుదు
నెఱుఁగనివిద్య నికృష్టమందు.

1. వేదజ్ఞానము, 2. స్తోత్రము.

తే. గీ. నొరుని వలన నాఁకు నుపకృతి యెందాఁక
నొనరుచుండు నంత దనుక మెచ్చి
యేఱుదాటి తెప్ప [1]నేర్చిన చందాన
వాని పేరు వినఁగ నైన నొల్ల. 133

క. అనువర్తన గల యధముని
ఘనుఁడంచును గాక యున్న ఘను నధముఁ డటం
చును విభుసభ నభయుఁడనై
వినసీ వినకుండనీ చెవింబడ నఱతున్. 134

గీ. చేసిన యఘంబు దాఁపక చెప్పికొనినఁ
బోవునందురు గానఁ దెల్పుదు మునీంద్ర
యెన్నియగుణంబులున్నవో యన్నినాదు
సొమ్ముగాఁ బ్రదిమ్మరుదుఁజుమ్ము రిమ్ముకొనుచు. 135

గీ. చిత్త మెపుడు ధనార్జనాయత్తమగుట
యాగభిక్షామిషంబున నచటికచటి
కేగఁగఁదలంచి కొమరుండు నేనుగూడి
యుత్సవంబులఁగంటిమూరూరుదిరిగి. 136

గీ. బ్రహ్మబంధునిఁ గేవల బ్రహ్మయనుచు
నుత్సవంబున జనులకు సత్కరించు

1. కాల్చిన.

ప్రతినయుండుట సను బ్రహ్మమతిఁ దలంప
వలసినంతధనంఁ బటఁ బడసి నాఁడ. 137

క. దాని నొకబండి నిడికొని
సూనుండును నేను శకట చోదకుఁడును దే
శానకును మరలి రా నీ
స్థానమున దినావసాన సమయం బగుడున్. 138

సీ. ఆనాఁడె గౌతమీ స్నానయాత్రార్థమై
నడచి యేతెంచుచు నలుగురైదు
గురు మమ్ముఁ గూడిరాఁగొన్నిముచ్చటలందుఁ
బరిచయంబయ్యెనప్పరుసవారు
కర్మఠుండని నన్ను గారవంబునఁ జూడఁ
గోరియద్దఱి నొక్క గుంటజలము
లుంటఁ గన్గొని యేగుచుండుఁడు మాకుఱ్ఱ
వాఁడు మీరును సంధ్య వార్చివత్తు

తే. గీ. ననుచు వెనుక మొగంబైతి నరిగె బండి
కొంచెమైనను దడవుగా వించి చనఁగ
వలదె యని డొంకచాటున నిలిచియుండ
వచ్చెనాకస్మికంబుగ వ్యాఘ్రమొకటి. 139

క. అటపై నా కొడవిన ము
చ్చటఁ దెల్పఁగ నేల ని ప్పిశాచత దానం

ఘటియిల్లె రావిచెట్టు
ప్పటినుండియు నిదియె నాకు వసతిగ నమరెన్. 140

క. ఈయున్న పిశాచంబులు
నాయట్లప్పాలిమొగంబునం బడి యిట్లై
నాయంతటి వవి గామి
న్నాయకునిగఁ దలఁచి యెపుడు నను సేవించున్ 141

క. పిమ్మట సుతుఁ డేమయ్యెనొ
యిమ్మెయిఁ గూర్చినధనంబు లేమయ్యెనొ యం
చుమ్మలిక మందుచుంటిని
జుమ్మీ యని బ్రహ్మరాక్షసుండన మునియున్ 142

క. చింతింపకు మొక్కింతయు
నంతయు నెవింటెఁ జుమి త్వదాత్మభవుని వృ
త్తాంతముఁ బీఠపురి న్నీ
సంతతికిం బాండ్యమథుర సౌఖ్యము సుమ్మీ. 143

మ. పులివాతం బడి నీవు రాకునికి నీ పుత్రుండు ద[1]త్సార్థముం
బలుచందంబులఁ జింతచేఁ బొగులఁ దత్ప్రాంతస్థమౌ పల్లియం
గల గోపాలురు వారి డాసి యొక వ్యాఘ్రుం బిచ్చటం జేరి పాం
థులఁ బెక్కండ్రను బట్టి మ్రింగె ననినిం [2]దోధూయమానాంగులై

1. సమూహము. 2. కదలుచుండు దేహములుగలవారయి.

క. గొల్లలు మాపల్లెకు రం
జెల్లి గన న్వచ్చు మా మహీపతి యీరే
యెల్ల మృగంబుల వేటం
బల్లార్చివధింప నిచట వసియించె ననన్. 145

క. వల్లే యని వారందఱు
నుల్లంబుల నొల్లఁబోయి యుండఁగ నారే
యెల్ల మెకంబులఁ బొరిగొని
యల్లన తద్దేశపతి సమాగతుఁ డయ్యెన్. 146

గీ. వచ్చె యవ్వార్త యచ్చటివారు దెలుపఁ
దాను గూర్చినపులిపొద దాపునందుఁ
గ్రొత్తనెత్తుటఁ దడిసిన యుత్తరీయ
మందుఁ గల పేరివర్ణంబు లరయఁ జేసి. 147

క. దైవగతిఁ గలుగు నాపద
లో విప్రకుమార! చింత నొందకు మదిలోఁ
నీ విత్తంబును నిను మీ
యావాసపుటూరఁ జేర్తు నయ్యా యటంచున్. 148

గీ. తగిన సాహాయ్యమును గూర్చి తద్గృహంబుఁ
జేర్చె నేఁటేఁటఁ గొంత వార్షిక మొసంగు
చుండునఁట నాఁటి యమ్మహీంద్రుండు నేఁటి
కిని దదన్వయయుగ మట్టు లెనయు మైత్రి. 149

క. అని యచటి పౌరవృద్ధులు
నను గూర్చి తదీశకుల గుణస్తుతి గావిం
చు నెడం దెల్పినచరితం
బును నీపల్కినచరిత్రమును సరి గూడెన్. 150

గీ. పద్మయోదకబిందుసంపర్కమునను
దుష్టభావంబు మాత్రంబు దొలగెఁ గాని
విడిచిపోదయ్యెనుపిశాచవృత్తిగాన
దాని నెడఁబాయుచంద మందఱు వినుండు. 151

సీ. మీపిశాచత్వంబుఁ బాపుదు గొంద ఱి
మ్మంచంబుతోడ నిమ్మించుఁబోఁడి
నీయంధ్రదేశంబు నేలు శ్రీపీఠికా
పురనాథుసౌధాగ్రమునను డించి
యతని మేల్కొలిపి యీయతివ వృత్తాంతంబు
నంతయు నెఱిఁగించి యనుగుదెంచు
నంతలోఁ గొంద ఱియ్యంతి నంతిపురంబు
నందుఁ గానక చింత నడలుచున్న

తే. గీ. యీమెతల్లికి నివ్వార్త యెల్ల దెలియు
నట్టులాకాశ [1]భారతి యనుకొనంగ

1. వాణి.

నోరు లెవరు మిమ్ముఁ గనకుండ నుగ్గడించి
రావలయు నంత దనుక నిం దేవసింతు. 152

క. అని ముని చెప్పిన చొప్పునఁ
బనివిని యప్పని యొనర్చి వడి వెల్వడి వ
చ్చిన నందఱు నుపమూకకుఁ
జనుదెం డని వెంటఁగొని వెసం జని మ్రోలన్ 153

చ. గిరిఁ దిలకించునంతఁ బులకించెను మౌనికి మేను డగ్గఱం
గ రమెదలోన సమ్మదము గ్రమ్మె గుడిం బొడఁ గాంచి నంతనే
పరవశ మయ్యె మానసము భక్తులు భాగవతైకసేవచేఁ
బరవశు లౌదు రన్న భగవత్పరిచర్యకుఁ జెప్ప నేటికిన్. 154

క. అటు లగ్గిరితటిడగ్గఱి
జటి యద్దరివాండ్ర నిలిపి సాఁగి శిరమునన్
ఘటితాంజలిపుటుఁడై యొ
క్కట నక్కటకమున కెఱఁగి కౌతూహలియై. 155

క. పురికిన్ వలగొనియాదట
గిరికిఁ బ్రదక్షిణము దిరిగి కృతబంధురపు
ష్కరిణీమజ్జనుఁడై యం
త రహిఁ నమజ్జనులఁ గ్రందునన్ మందగతిన్. 156

క. చనుచుండు నప్పు డాగుం
పుననుండి కనంగ నయ్యె ముని కనుఁగవకున్
మనసు కరఁగింపఁజాలిన
ఘనమగుజాలి నొదవింపఁ గల జన మెదుటన్. 157

సీ. అస్ఫుటస్వరముగా నటు నిటుఁ గరసంజ్ఞ
గల తలంపేమేమొ దెలిపికొనుచుఁ
దమ ప్రశ్నలకు నుత్తర మొసంగిన వేఱె
వాక్యగా నెద్దియో పలికికొనుచుఁ
బురి గిరి పిఱిఁదిగాఁ దిరిగి బయల్ గాంచి
ప్రోవవే హరియంచు మ్రొక్కికొంచుఁ
గొండదండకు మమ్ముఁ గొంపోరె నడయాడ
నేర మటంచు మూఁతఁ గోరికొనుచు

తే. గీ. మూక బధిరాంధపంగులమూఁక లెదుట
నున్నఁగనుఁగొని యీప్రజనున్నరుజగ
నెన్నఁడొనరించునో కృప నెన్నఁ డెన్నఁ
డనుచుఁ దలపోసె నతఁ డప్పు డనుచు జాలి 158

క. కొండదరి కరిగి వారలఁ
గొం డొక తడ వూరడించి గోవింద హరీ
యండజరాజహరీ యని
మెండుగఁ బేర్కొనుచు మొదటి మెట్టెక్క తఱిన్ 159

సీ. గొంతెత్తి గోవింద గోవింద యని సంత
రవ్వగా బిట్టువాక్రుచ్చు వారు
శ్రుతిమాత్ర మారుతాహతి పీణెసారణి
ననువుగా సవరించు మనెడు వారు
ద్వారగోపుర [1]దృషద్వారశాసనవర్ణ
సమితి విస్ఫుటముగాఁ జదువు వారు
వడివడి ముందుకై నడచి క్రమ్మఱి తన
యడుగులఁ బడి మ్రొక్కు లిడెడు వారు

తే. గీ. నైనవారలఁ దన వెంట నరుగుదెంచు
వారినలమూక బధిరాంధపంగుజనులఁ
జూచుచుఁ గపటనాటక సూత్రధారు
చిత్రనాటకపటిమ కచ్చెరువు చెందె 160

క. అక్కరణి నొక్కచో నడు
చక్కం బెంపెక్కు పెక్కు జక్కరలు దరుల్
జక్కగఁ జూచుచు నక్కడఁ
జుక్కలు చేఁజిక్కనన్న చో నొక్కయెడన్. 161

క. సాలగ్రామశిలాఫల
కాలేఖ్యాకారదర్శి తాత్మనిఁ దులసీ
సాలగ్రామమహోన్నత
సాలగ్రామణ్యాగార సంస్థాయిఁ గనెన్. 162

1. దృషత్ = శిల.

క. కనుఁగొని సాష్టాంగముగా
వినతులు గావించి లేచి వినమితతనుఁడై
వినయం బెనయఁగ నమ్ముని
వినతాసుతశైలనిలయు వినుతించె నిటుల్. 163

క. కారుణ్యశరణ్య! నిరా
కారముఁ సాకారమున్ సకలభువనచయా
కారము నగుభవదీయా
కారముఁ ద్రివిధంబుగాఁగ గణుతించు శ్రుతుల్ 164

గీ. బ్రహ్మవిద్గోచరంబందుఁ బ్రాథమికము
దెలిసికొందురు బుధులు [1]తార్తీయమూర్తి
భక్తులకు రెండవది దోఁచు భావనాను
రూప మగు రూపముగ ధీనిరూపణీయ. 165

క. పంచాయుధీసమంచిత
మంచుఁ జతుఃపంచశాఖమంచున్ మించున్
మించుజిగిమంచి సాల్గల
దంచున్ వించుందు నీరెయియూరమును హరీ. 166

క. భయ మేది నుడివెద జగ
త్ప్రియమే దినదిన మొనర్చు మృదుపదకమల

1. మూఁడవ.

ద్వయ మేదిని మును సగరా
న్వయ మేదినత్రోయ మేది నరహరి చెపుమా. 167

సీ. పొక్కిటఁ బొందమ్మిపువ్వుఁ జూప వేమి యు
రంబునఁ గౌస్తుభరత్న మేది
వనమాలఁ గంఠంబు నను జూప వేమి నీ
[1]వత్సంబుకెలన శ్రీవత్స మేది
తపనీయమకుట మాదలఁ జూప వేమి క
ర్ణములందు మకరకుండలము లేవి
సదములం బైనహాసముఁ జూప వేమి స
త్కరుణాకటాక్షవీక్షణము లేవి

తే. గీ. యిరుగెలంకుల వీచోపు లిడుచుఁ జెలిమి
దోఁపఁ దీపించు నిల నీలఁ జూప వేమి
యన్నిటికి నేమి సామి బాహాంతరాళ
దివ్యమందిరయిందిరాదేవి యేది? 168

క. మృగయాఖేలనలీలన్
మృగయులు ప్రేరేప నడవిఁ ద్రిమ్మరఁ జని యా
మృగములఁ దునుమాడుచు నో
[2]మృగధరభావుక! వసించితే యందుఁ దమిన్. 169

1. ఱొమ్ము. 2. చంద్రుని బావ.

క. నీవిందారయఁబడవిది
గో విందాఁకలియెడంగఁ గొమ్మనియెవఁడో
నీవిందావలఁబిలువఁగ
గోవిందాయేగి యచటఁ గూర్చుండితివో. 170

మ. అని యేవం విధమైనరీతి మదిలో ధ్యానించి ప్రార్థించుచోఁ
గనవచ్చెన్ మునికిన్ముకుందుఁ డెదుటం గంజాతముం గౌస్తుభం
బును [1]దోమాలెయు లాంఛనంబు మకుటంబుం గుండలంబుల్ స్మితం
బు నపాంగంబులు ధాత్రినీళరమయుం బొల్పొంద బల్పొందుగాన్.

క. హరియెదుట నిటుల సాష్టాం
గ్కారించిన విరించిసుతుఁడు గడు వేడుక నీ
చరణములే శరణము లని
పరువడిఁ బరమప్రపత్తిఁ బ్రణతుం డయ్యెన్. 172

క. మించిన ప్రపత్తి మదిఁ బ్రస
రించిన [2]మస్కరి నమస్కరించిన నంకూ
రించినకృప శ్రీహరి పరి
కించి నతునివినతు లాలకించినవాఁడై. 173

క. ఆరెండుపనులకై యిరు
సారులు మును విడువవలసె సదనము మాకున్

---

1. వనమాల. 2. ముని.

నారద మూఁడవ పరి నీ
కారణమున మరల నేఁడు కదలఁగ వలసెన్.- 174

క. నావుడు మునిపుంగవుఁ డో
దేవా! మొదలింటిరెంటిఁ దెఱఁగు లటుండం
గా వినఁగ వలసె వెడలుట
నావలనం గలిగె నేఁడనం గతము ననన్ 175

క. మున్నింటిరెంటి తెఱఁగులె
మున్నుగ వినవలయు వరుస మూఁడవయది నీ
పన్నినసన్నాహమె నీ
కన్నరపతి మీఁద నున్న యసమప్రేమన్. 176

గీ. అనిన ముని నతోత్తమాంగుఁడై యిట్లను
నొక్కదాని కంటె నొకటి వింత
యగుచుఁ దోఁచుచున్న దడిగిన నీఁక నేమి
వచ్చునో వచింపుఁ డిచ్చకొలఁది. 177

మ. అనినన్ నవ్వుచు నవ్విభుం డనె మునీంద్రా! వింత లే దింతయున్
మనమం దీవు నెఱింగినట్టిదియ యైనం దెల్పెదం బొల్పుగాన్
వినుమీ వేఁట యొనర్పఁగా నఱిగియున్ విందన్న విచ్చేసియున్
మును మే ముంటిమి స్వల్పమౌదినము లీహాంతంగరం బొంటిగాన్.

సీ. శేషాద్రి మేము వసించియుండఁగ మునుల్
గొందఱు మముఁగూర్చి ఘోరతపము

సేయఁగాఁ బ్రత్యక్షమై యభీష్టం బేమి
యన వారు మోక్షంబు నభిలషింప
నది తపోధ్వరజపస్వాధ్యాయముఖసత్క్రి
యాకలాపంబులఁ బ్రాప్త మగునె
నాచేతహేతులకు జ్ఞానసంగతులకుఁ
గాని కైవల్యంబు గలుగ దెందు

తే. గీ. నాగనాగాశనాగవనాగమముల
గము లమర మన ముగ్రమృగముల మగుచు
సాధులకు బాధఁ గావింప సాధులగుచు
వారు మొఱ లిడఁగ సపరి వారుఁ డగుచు. 179

చ. గరుడునిమీఁదఁ గూర్మి యధికం బగుటం దదహార్యసీమ మం
దిరముగ నున్నయీహరియె నిక్కముగా మన వాంఛఁ దీర్చునం
చరిగిరి సాహసైకపరు లాత్మసముద్యమసిద్ధిమాత్ర త
త్పరమతి నుండ్రుగాని యిది త ప్పిది యొ ప్పని కర్జ మెంతురే.

క. తలఁచుకొనినంత పని వా
రలు సేసిరి దాని కేను బ్రతివిధిఁ జేయన్
వలసె నవి యెవ్వియైనను
ఫలియింపకయుండునే తపస్వులవాంఛల్. 181

క. ఈపని మొదటిది దీనికె
[1]చాపనిషంగాసిముఖ్య సన్నాహాముతో
మాపని రేపని చూడక
యేపని కేగి నటు లొప్ప నేగఁగ వలసెన్. 182

చ. వలలును మాట్లు [2]దీమములుఁ బాదులు జోపులు వేఁపులున్ మొదల్
గలతగుసాధనంబు లెసఁగ న్నొకపోటరి వేఁటకాండ్రు రా
వలదని నిల్వఁగా వలసె వాని కవే యెదు రేగుదెంచి ని
శ్చలముగ లక్ష్యసీమ వరుసం గుహనామృగము ల్వసించుటన్ 183

గీ. అప్పు డొకపరి నాల్గైదహర్నిశమ్ము
లుండవలసెను మాయుండు కొండ విడిచి
మఱియు నొకపరి వెడలుచు మరలుచుండ
వలసెఁ గొన్నాళ్లు దాని నేర్పడఁగ వినుము. 184

చ. కలఁ డొకగొల్లఁ డిద్దరి నొకానొకపల్లియ నందగోపస
త్కులజుఁడు వాఁడు పుట్టినది గోలె నొకప్పుడు నూరు నిల్లునుం
దెలియనివాఁడు నా నడవిఁ ద్రిమ్మరుచుం బసి త్రోదు వాఁడుగా
మెలఁగుచునుండు నప్పసుల మేపుల మే పులకింప నెప్పుడున్. 185

క. అటులుండఁగ వానికి గో
పటలీసేవైక పుణ్య పరిపాకమునన్

---

1. ధనస్సు, అమ్ములపొది, కత్తి. 2. వేఁట పిట్టలు మొ॥

ఘటియిల్లెఁ దెలివి మది వి
స్ఫుటతరముగ నిట్టు లొకటఁ జోద్యముగాఁగన్. 186

సీ. అడవిమ్రాఁకులఁ గాంచి పుడమి నెవ్వఁడు నాటె
వీని నెల్ల నటంచు విస్మయపడు
నెలయేళ్లఁ దిలకించి యిల వీని నెవ్వండు
ద్రవ్వించె ననుచు వింతవహియించు
భూధరంబులఁ జూచి ప్రోవువెట్టె నెవఁడీ
రాతిగుట్ట లటంచు భ్రాంతిఁ జెందు
మెకములఁ గని వీని మేపు నీర్వట్టు నె
వ్వఁడు గాంచు నంచు నబ్రమువహించు

తే. గీ. గొప్పదొరయొక్కఁ డెవ్వఁడో తప్పకుండ
నిట్లు గావింపుఁ డని యానతిచ్చియుండ
వచ్చు లెంకల కాఁబంటు బలఁగమైనఁ
గానరా దయ్యెఁ జిత్రమిక్కాననలోన 187

చ. అని మఱియుం దలంచు నిటులౌర నన్నుం గనె నాదు తండ్రి యా
తనిఁ గనె వాని తండ్రి యిటు తండ్రుల తండ్రుల నెన్న మున్నుగా
జననము నొంది యుండవలెఁ జక్కఁగ నొక్కఁడు వాఁ డెవండొకో
యని తెలియం దగుం దెలుపు నాతనిఁ దొల్త నెఱుంగఁ గానగున్.

క. అనుకొనుచుఁ గంటి కెయ్యది
గనిపించిన దాని కెల్లఁ గారణ మొకఁడుం
డును దానిఁ దెలుపు నెవఁడో
యనుకొనుచుండంగ నొకయహర్ముఖవేళన్. 189

క. వాని కొకవిప్రుఁ డెదుటం
గానంబడె రేయిఁ ద్రోవఁ గానక కానన్
దా నొక్కెడ నిలచి యుష
స్స్నానమునకు జలము లుండుచక్కి నెమకుచున్. 190

శా. ఆవిప్రుంగని డాయఁగా నరిగి యయ్యా! యియ్యరణ్యంబునం
దీవొక్కండవు సంచరింపఁగఁ గతం బేమంచుఁ బల్కంగ నీ
క్రేవన్ గారుడపర్వతంబు గల దగ్గిర్యగ్రభాగంబునం
దేవుండుండుఁ గదా తదంఘ్రియుగ మర్థిం గొల్వఁగా నెంచుచున్

ఉ. ఏనొకరుండ నిన్న నట కేగుచునుండఁగ సంజప్రొద్దునన్
వాన [1]మొయిల్ వడిం గవియఁ బైనిరు లేచఁగ దారిదప్పి యి
క్కాన నిశన్ వసించితి నొకానొక [2]యారమునందు వేకువన్
స్నానజలంబు లిం దరయ నా కగపించితి వీవు నాపుడున్. 192

క. అయ్యా! నాపున్నియ మే
మయ్యో యియ్యెడకు మీర లరుదెంచుటచే

1. మేఘములు. 2. పొదరిల్లు.

నియ్యెడ దొడ్డది యయ్యెం గ
దయ్యా యియ్యడవి మీఱ లడుగిడు కతనన్. 193

క. ఒదవె న్నిన్నుం గాంచుట నాం
డం దలంచినతీర్థము యెదుటను దోంచినటుల్
వెదుకం బోయినతీవియ
పదముల దవిలి నటు లిపుడు పావనమూర్తీ. 194

క. పులుంగులరాయనికొండం
గల్గం డొక దేవుండు వానిం గనంగాం జనంగా
వలె నంటి నతండు బాపండో
పొలుపగుదొరకొడుకొ గొల్లబోయండో చెపుమా. 195

మ. అనినన్ ముప్పొరు గాండు ముప్పొరుగ నయ్యావేళలం దోంచె న
య్యనఘుం డందఱికంటె నాథ్యుండు జగం బాతండె కల్పించె నా
తనికిం జేయంగరాని దొక్కటియు నీధాత్రీ తలంబందు లే
దనినం గ్రక్కునం దత్పదంబులకు సాష్టాంగంబుగా మ్రొక్కుచున్

శా. ఎవ్వారైనను దెల్పంగాం దగినవారే తెంతురో యంచు నే
నువ్విళ్లూరుచునున్న దెన్న నిదియే యొక్కండె కల్పించినాం
డెవ్వండో జగ మెల్ల నంచు మదిలోనే నెంచుకొంచున్న య
ట్లివ్వేళన్ వచియించినాండవు గదే యీ వానుడుల్ నిక్కముల్

క. అందఱికంటె నతండే
ముందు పొడమి యుంటం జేసి మొదలిటివాం డౌ

చుం దనరు నట్లు నాతల
పుం దోఁచెడి నతని కంఠెఁ బూర్వుఁడు లేమిన్. 198

క. నీమాటకుఁ దార్కాణగ
నామదిలోఁ దోఁచె నతఁడు నా యడిగినయ
ట్లాముప్పూరు గాఁడని మఱి
యాముప్పూరు నగుదు రంటివది యెట్లొక్కో. 199

చ. అన విని బ్రాహ్మణుం డనియె నాతఁడు బాపఁడు గాఁడు రాజనం
దనుఁ డనరాదు గొల్లఁ డనఁ దప్పగు నాతఁడు మూఁడు జాతులన్
జననము నొందె రాముఁ డను సంజ్ఞల మున్ ప్రజఁ గొన్ని వేళలన్
ఘనమతిఁ బ్రోవ నట్లగుటఁ గాఁడని యానని తెల్పఁగాఁ దగెన్.

క.వి. అనిన ముదంబున నాతఁడు వొంగుచు నయ్యా వినందగు నాతని వ
ర్తనములు రాముఁడరణ్యమునందు విరాధునిఁ గూలిచి రావణుఁజం
పిన ఘనుఁడే కద వీనికతల్ మును వీనులవిందుగ నేమఱు విం
టినిజుమి యాతఁడు నిక్కము దేవుఁడు వీనులల్లనె నిక్కవముల్.

క. కొయ్యలకును గోఁతికిఁ దోలు
దయ్యమునకు దొరతనంబు దయనొసఁగెఁ గదా
నెయ్యమున నతనిఁ గొలిచిన
నెయ్యది సమకూరకుండు నెవ్వారికైనన్. 202

క. ఆయయ్య రాచకొమరుం
డాయన నని గెలువలేక యరిగెను బాపం

డీయిరువురుఁ దగుదురు మఱి
నాయింట నొకండు పొడమినాఁ డంట గాదే. 203

క. నీవంటి యెఱుకగలవా
రీవిశ్వమునందుఁ గలరె యెచ్చోనైనం
గావున దేవునిఁ దెలియం
గావలె నతని నెటు గానఁ గాఁ దగుఁ జెపుమా. 204

గీ. ఎచట నుండు దేవుఁ డే తీరుగా నుండు
నేమటంచుఁ బిలువ నేగుదెంచు
నేవి యారగించు నెంతద వ్వాతని
యెల్ల యెల్ల నాకు నెఱుఁగఁ జెపుమ. 205

క. అని మూఢభక్తి వేఁడిన
విని విప్రుఁడు వానిభక్తి విశ్వాసాదుల్
తనకున్ ముదమిడఁగా నా
తనిదయఁ దరియింపఁ జేయు తలఁపునఁ బలికెన్. 206

చ. పరమపదంబు వానికి నివాసము నల్లని మబ్బు [1]గెబ్బునం
గరుచిగలాఁడు స్వామి! మముఁ గావు మనం బఱ తెంచు నెద్ది యె
వ్వరి కిల నోగిరం బదియె వానికి నింపగు నెంతదవ్వు కు
య్యరయ వినంగ నౌనొ యతఁడంతటి దవ్వున నుండు నంతటన్.

1. ప్రకాశించు.

శా. నీ వా దేవునిఁ జూడఁ గోరితివ యేనిం దెల్పెదన్ సర్వవాం
ఛావాప్తిన్ ఘటియించు దాని నొక దివ్యంబైన మంత్రోత్తమం
బావర్తించుచునుండు మొక్క నెల నిత్యంబుం గడుం బూన్కి పెం
పై వర్ధిల్లఁగ వేయిసారు లటపైఁ బ్రార్థింపు మీచొప్పునన్. 208

క. నల్లని మేన్గలసామీ
తెల్లనిమోరగలపక్కి తేజిపయిన్ నీ
వల్లన యరుదెంచి కృపం
జల్లనిపాల్మీఁగడయును చవిఁగొని చనుమీ. 209

క. అని వేఁడుకొనిన దేవుఁడు
గనికరమున నీవసించు కడ కేతెంచున్
దినదిన మిటుచేసిన ద
ర్శన మిచ్చుం జనువు లిచ్చు రమ్మన వచ్చున్. 210

క. అని తెలిపిన నమ్మంత్రము
ననుగ్రహింపవలెననియు నాపై మఱియున్
దనబందుగులకుఁ గూడం
గనుపట్టెడువెరవుఁ జూపఁగావలె ననియున్. 211

క. ఒనరఁగ విప్రుని పదయుగ
మున దనమూర్ధంబు సోఁక మ్రొక్కిన నతఁ డో

య్యాన లేవనెత్తి యొక [1]ఖుర
మున స్నాతునిఁ జేసెఁ దాను మున్నుగ వానిన్. 212

క. పిమ్మటఁ దారక మను భే
దమ్మగు చతురక్షరిన్ యథావిధి నుపదే
శమ్మొనరఁ జేసి యిమ్మం
త్రమ్మెమఱకుండు మనుచుఁ గ్రమ్మఱఁ బలికెన్. 213

ఉ. అల్లదె నల్లనై పొడవునై మన మిప్పుడు చెప్పుకొన్న శ్రీ
వల్లభుఁ డిల్లుగాఁగ నిలువం జెలువంబుగ మించు నీడ భూ
తల్లజుకొండ దాని కొకదండ నెసంగు సరోవరంబు సం
ఫుల్లపయోజ[2]హల్లక సముల్లసితంబయి బంధురాఖ్యచేన్. 214

క. నీవారి దాని వారిన్
వేవేగం దానమాడ నియమింపుము నీ
వా వేళ నీవొసఁగు పా
ల్ద్రావఁగఁ జనుదెంచి మీకు దర్శన మిచ్చున్. 215

క. అప్పగిదిఁ జెప్పి విప్రుం
డప్పుడె తన దారిపట్టి యరిగిన నాతం
డొప్పుగ నుపదేశోక్తుల
చొప్పున మంత్రము జపించి శుద్ధాత్మకుఁడై. 216

---

1. సెలయేరు. 2. చెంగలువ.

గీ. కాఁచి చల్లార్చి పాలుమీఁగడ సమర్చి
బిగ్గఁరగఁ బేర్చి ననుఁగూర్చి పిలువఁదొడఁగె
నల్లనగుసామి[1]చిల్వబోనపుహలుమాయి
నెక్కి రావయ్య యిపుడు నాచక్కి కనుచు. 217

మ. త్వరతో నన్నుఁ బ్రపన్నుఁడై దరికి నాహ్వానంబు గావింప వే
డ్క రహింపం దరియం గృతవ్రతుఁడ నౌటం జేసి తద్ధ్యాననై
ఖరిఁ బక్షీంద్రహయుండనై యచట సాక్షాత్కారముం జేయఁగా
నరుగంగా వలసెం జుమీ యపుడ భక్తాధీనతం దెల్పుచున్. 218

క. ఆనాఁడటు నేనరుగఁగ
నానాఁటికి నతఁడు నెమ్మి నమ్మికయుఁ దగం
గా నటు పిల్వఁ దొడంగుట
నేనేగుట నాకు నిత్యకృత్యం బయ్యెన్. 219

గీ. అటులు కొన్నాళ్లు గడపి యంతట నతండు
బంధుగుల కెల్ల నిప్పని బయలుపఱప
వార లబ్బురపడి మమ్ముఁ దారుఁ గూడఁ
జూడఁ గోరినఁగోలన నీరాడఁజేఁగ 220

ఉ. వారికి నెల్లదర్శన మవారితలీల నొసంగి యాతఁడీ
తీరునఁ జేయుచుండఁ బని తీరు నె మాకని వానిఁ బిల్చి యా

---

1. పాము భోజనముగాఁ గల వాహనము = గరుత్మంతుడు.

భీర! హితంబు వేఁడు మన భీరహితాత్మత నన్న నెప్డు మా
చేరువ నుండఁ గోర మముఁ జేరు వరం బిడి నారమర్మిలిన్. 221

గీ. అతఁడు చతురక్షరీజప ప్రతనిరూఢ
బుద్ధిఫలసిద్ధిఁ బడసిన యద్ధరిత్రిఁ
జెంది నిల సర్వసిద్ధి ప్రసిద్ధి బంధు
రంజకసరస్సునకె బంధుర మను పేరు. 222

క. తొలుత నొకగొన్ని ప్రొద్దుల
కొలఁదిగ నొకకొన్ని యేళ్ల కొలఁదిగ నేఁడుం
దలఁగితి మిటుపైఁ దలఁగక
వలయుం గద వేల కొలఁది వర్షంబులుగాన్. 223

ఉ. నాఁవుడు నన్నుఁ గూర్చి సదనంబును మూఁడవసారి వెల్వడం
గావలె నంటి రీ రిపుడు గావున నట్లననేమి కారణం
బో వినకున్న సందియము పోవునె నాదు మనంబు తొట్రుపా
టానహిలం దలంకెఁ జెపుమా కృప నాయపరాధమున్ హరీ. 224

క. అనవుడు నీ. వపరాధం
బనుకొని యొనరింపకున్న నది యపరాధం
బును గాక యున్న యయ్యెన్
మునివర మాచలనమునకుమూల మె టన్నన్. 225

ఉ. కుక్కుటలింగమూర్తి గడుఁ గూరిమిఁ దెల్పినతారకక్రమం
బక్కడిరాజశేఖరున కంతయుఁ దెల్లముఁ జేసి వచ్చితీ
విక్కడి కాతఁ డంత జపియించెను దన్మహిమం బెఱుంగ నం
దొక్కవిధంబుఁ బూనివిధియుక్తిగ నొక్కదినంబె పేర్మితోన్. 226

క. తావన్మాత్రజపంబున
నే వానికి వరము లొసఁగ నేగి తదీయం
బౌ వాంఛ యేమి యని సం
భావింపఁగవలసెఁ దత్ప్రభావము వలనన్. 227

సీ. అతఁ డా జపమునకై దీక్షఁ బూని సం
కల్పించు నపుడు సాంగపరివార
ముగ మమ్ముఁ బ్రత్యక్షమగుఁ డటంచుఁ దలంప
నచ్చటి కప్పుడె యరుగుచుండ
నంతఁ బ్రదోషనాట్యావసరంబునఁ
గుక్కుటేశ్వరు కొల్వుఁగోరి వేడ్క
గుంపులై వచ్చు నిలింపు లంతంత నె
మ మ్మంతరిక్షమార్గమ్మునందుఁ

తే. గీ. గాంచి యెదురేగుదెంచి సమంచితముగ
నక్కడకు మమ్ముఁగూడ రమ్మనుచు వేఁడ
నింత కన్నను మేలున్నదే యటంచుఁ
జెలఁగి మేమందఱము ప్రవేశించు నపుడు. 228

ఉ. మాపటివిష్ణురూపమును మానకొగిం బవళింపఁ జేయనో
తేపకుఁ దేపకుం బ్రబలు తేజపు వేఁడిమి మగ్నమూర్తియై
పాపికొనంగనో గగనవర్త్మపరిభ్రమణప్రభూత సం
తాపము దీఱ మజ్జన మొనర్పనొ భానుఁడు ప్రాలె వార్ధికై. 229

గీ. కాలసభికాగ్రగణ్యుండు కాలగళుని
నటనపటిమావలోకనానంతరమునఁ
శౌరితోషిక యిడఁగ నంబరము కొసను
బసు పొసంగించె ననసంజపసఁ బొసంగె 230

క. జగ మంధకారితను జెం
దెఁ గదా యవి తోడుతోనదీపకలాపం
బొగిఁ దోఁచెను [1]భసితద్యుతి
యుఁ గడుం జొప్పడియె నప్పడొప్పగఁ జూడన్. 231

గీ. అంతట నిశాసుధాకరవ్యతికరమునఁ
గడలుకొను రాగ మన సమగ్ర మగురీతిఁ
బొడువుఁగెంజాయ రంజిల్లు పొలుపుఁ గాంచెఁ
బ్రాక్పదంబున కొకవింతవన్నె యిడుచు. 232

మ. [2]బలభిత్ప్రోన్నతరత్నసౌధ[3]వలభివ్యాలంబిరక్తచ్ఛదో
జ్జ్వలశారీకలధౌత పంజరము తేపం దూరువుం గొండపైఁ

1. బూడిదరంగు. 2. ఇంద్రుఁడు. 3. శిఖరము.

బొలిచెన్ సోదయరాగలాంఛనపరిస్ఫూర్తిం దుషారాంశుమం
డల మూర్ధ్వప్రతిపాదిరశ్మిగణసంధానస్ఫురన్మూర్తియై. 233

శా. ఆ రేయెల్లను మున్న శంకరునినాట్యం బంత భృంగీశుహా
స్యోరుప్రౌఢిమ మంత నందికృతమై యొప్పారు గానక్రియా
సారస్యంబును బిమ్మట న్నృపతపస్సంరంభశుంభత్ప్రశం
సారూఢోక్తులు గాలయాపనము సేయ న్నెమ్మిమై నుండఁగాఁ. 234

సీ. తొలికోడితానయై యెలుఁగెత్తి మూఁడు భం
గులఁ గుక్కుటేశుండు కొసరి కూసె
నాలమందల కెల్లనధినేత తానయై
హొంకంబుగా నంది అంకెవైచెఁ
దీర్ఘంబుఁ దెచ్చు హస్తికిఁ బెద్ద తానయై
లంబోదరుఁడు బృంహితం బొనర్చె
విహగంబులకు నెల్లఁ బెద్ద దానై కుమా
రుని కేకి పెలుచ నిస్వన మొనర్చెఁ

తే. గీ. దానె లింగార్చకులకుఁ బ్రాథమికుఁ డగుచుఁ
బ్రాతరనిలుండు గేతనాగ్రమున నున్న
ఘంట మ్రోయించె వందిమాగధులు తామె
యగుచు భక్తులు పేర్కొని రపుడు మున్న. 235

ఉ. అంతట భానుమంతుఁ డుదయాచలరంగము నందుఁ దోఁచె న
త్యంతము రమ్యమైన యరుణాంగమునుం జతురాస్యవిభ్రమం

బెంతయు నొప్పఁగా భువనసృష్టికరోన్నతి మించు భారతీ
కాంతుని వేష మొప్పఁగ జగజ్జన సభ్యులమ్రోల నొప్పఁగాఁ, 236

క. అంతటను గుక్కుటేశుఁడు
సంతసమున సముచితోపచారమ్ముల మ
మ్మెంతయును గారవించి యొ
కింతయు భేదమ్ము లేని హితము దలిర్పన్. 237

గీ. మమ్ములను బంపు నపుడ య్యుమాధవుండు
కొమరసామిని రావించి కొంతదవ్వు
సాగనంపించు మని పంప నాగుహుండు
దోడరా నేగితిమి రాజదుర్గమునకు. 238

క. అపు డానృపుఁడాయం జని
చెపుమా యుపమాకనుండ శీఘ్రము గాఁగన్
జపముం దపమున్ మముఁ గూ
ర్చి పరంతప! రాఁదలంచి చేసితి గాదే. 239

క. నచ్చితి మదుగుము వరముల
నిచ్చెద మమ్మంత్రమహిమ మిదె తెలిసెఁ గదా
సచ్చరిత యనిన [1]నమ్మహి
భృచ్చంద్రుఁడు మాకుమ్రొక్కి వివరించె నిటుల్. 240

---

1. రాజు.

శా. దేవా! తారకమంత్రతత్త్వము ప్రసాదించెన్ మరున్మౌని నా
కీవే వేలుపునైనఁ గోర్కె లిడ రావే యంచుఁ బ్రార్థించినన్
వేవేగం జనుదెంచి నీ దగు మనోభీష్టం బమోఘంబుగాఁ
గావించుం జుమి యంచుఁ దెల్పి మఱియుం గారుణ్యచిత్తంబునన్.

క. కలి శ్రీవేంకటరమణుఁడె
తలఁపఁగఁ, బ్రత్యక్షదైవతం బటు గానం
దొలుత జప మితనిఁ గూర్చియె
సలుపుము నీవాంఛితము లొసఁగ నేతెంచున్. 242

క. కావున వేంకటరమణుఁడె
తావకవంశంబునందుఁ దరతరములుగా
భూవరులఁ బ్రోచుచుండి జ
నావన మొనరింపు మనుచుఁ బ్రార్థింపు మనెన్. 243

గీ. తన్మహామంత్రమున కధి దైవతంబు
రాముఁ డీతండు వేంకటరమణుఁ డనుచు
భేద మెంచకు మాతఁడు విభవమూర్తి
దలఁపఁగా నీతఁడ ర్చావతారమూర్తి. 244

క. నారదముని చెప్పిన యా
తీరున ధ్యానం బొనర్చి తిని నే సాక్షా
త్కారం బొనరించితి వీ
వారీతిన్ భక్తవరద యవితద్వరదా. 245

క. కావున నలమేల్మంగా
దేవియు నీ వెలమితో మదీయాన్వయముం
బ్రోవంగ నిందు వసింపుఁడు
దేవా ప్రతినృపతిచెంతఁ దేజ మెలర్పన్. 246

క. అటు లైదువేల వర్షము
లటుపై నాచంద్రతార కార్యంబుగ ని
ప్పటు బలుఁడు కుమారుం డై
ప్పటి కప్పుడు నృపులఁ బ్రోవవర మీవలయున్. 247

చ. అని యిటు లానృపాలమణి ప్రార్థనఁ జేయఁగ వాని నీవు కో
రిన వరమిచ్చినార మని ప్రీతునిఁ జేసి కుమారు నింటికిన్
బనిచి సతీసమేతముగ వచ్చితి మిచ్చటి కేము నీతలం
చినగతి నయ్యెఁగాదె మునిశేఖర యంచు వచించి వెండియున్.

శా. నీ వారాజకులావతంసమునకుం డెందంబునం బ్రీతిగా
శ్రీవంశప్రతిభాప్రతాపజయసౌశీల్యాదు లెంతేనిఁ బెం
పై వర్ధిల్లఁగఁ దారకంబు భవఘోరాంభోధినిస్తారకం
బో[1]వాచంయమివర్య తెల్పితిఁగదే యూహించి యుక్తంబుగాన్.

క. అందుల కేమును మోదముఁ
జెందితి మింక నేమి కోర్కు లున్నవొ చెపుమా

---

1. మునిశ్రేష్ఠ.

డెందంబున సందేహముఁ
బొందక యని శౌరివల్కె మునిముదితుండై. 250

క. స్వామీ! నిష్కాముఁడనగు
నే నిమ్ము నేమనుచుఁ గోర్కె లివి యని యడుగం
గా మదిఁ దలంతు నైనను
నీ మాటకు మేరమీఱమియు నుచితమగున్. 251

క. కావున నీయిరు తెఱఁగుల
నీవేళ నొనర్పఁ దగిన దెద్దియొ యనుచున్
భావమునందు వితర్కము
గావించుచునుందు భక్తకల్యాణకరా. 252

గీ. అనిన నిష్కాము లగు తపోధనులు మున్ను
గడఁగుపనులును లోకోపకారమునకుఁ
గాదె యలవడె నీవు నక్కరణిఁ జేయ
రాదె యన నాతఁడు మహాప్రసాద మనుచు. 253

క. జగములకుఁ బ్రీతిఁ జేయుట
జగన్నివాసునకుఁ బ్రీతి సలుపుట యనుచున్
దగ మున్నిటిమునిగణ మ
ప్పగిదిం గావించుచుండవచ్చు నటంచున్. 254

సీ. దేవసేవనముఁ దైర్థికుఁడు గావింపఁగా
నరుగుచో [1]సృతినొకింతైన నడుమ
వలెనంచు నెఱిఁగిన వాఁడు గావున మాని
తేవన దీక్ష నెంతేవసమునఁ
జనుచుండఁ బ్రొద్దుగ్రుంకిననాఁటిరాతిరి
నడవి దా నివసించుటాదిగాఁగ
స్వామి కంతయును విజ్ఞాపనం బొనరించి
తత్పిశాచత్వంబు తలఁగఁ జేయు

తే. గీ. టొకటియుఁ గళింగరాజకన్యక త్రిలింగ
విభునిపట్టపుదేవిఁ గావించు టొకటి
యును మనంబునఁ గోర్కులై యున్న వెన్న
విన్నవించితి భక్తప్రసన్నహృదయ. 255

మ. అన శ్రీవేంకటనాయకుండు దరహాసాంకూరరమ్యాస్యుఁడై
యను నప్పండితమాని వ్యాఘ్రహతుఁడై యట్లయ్యె నే నాఁడు యా
చనకై యేగుచువచ్చునప్పు డొగి మా సంసేవనం బాచరిం
తు నటం చీగుడిఁ గాంచి మ్రొక్కి చనె నీత్రోవన్ సుతాన్వితుఁడై

గీ. మరల వచ్చునాఁడు మముఁ గొల్వ లేదు మా
కొండవంకఁ జూడకుండ బండి

---

1. మార్గము.

యైన డిగ్గఁడయ్యె సూనుండు తెలిపిన
వినియు విననియట్లు వెడలు మనియె. 257

ఉ. వాని తనూజు పౌత్రుఁడు స్వవార్షికలబ్ధిఁ బీఠికాపురా
స్థానికి వచ్చి నిన్నఁ దగు సత్కృతులం గని యింటి కేగువాఁ
డై నియమంబుసం బడగ యాంజలమజ్జన మాచరించి య
చ్చోనిడెఁ బిండదానము విశుద్ధమతిన్ స్వపితృప్రియంబుగాన్

శా. దానం జేసియు నీవుఁ జేసిన తదుద్యద్వాఃప్లుతిం జేసియున్
వానిం బాసి తొలంగెఁ గ్రూరత యిఁకం బైశాచకవ్యక్తి యె
ద్దానిం బాయు నటన్న బంధురసరోంతర్వారిపూరంబులం
దానం బాడిన వీఁడు వీనిసఖులుం ధన్యాత్ములౌదు ర్వడిన్.

గీ. అనిన నిపుడయే వచ్చెద ననుచు మాని
వర్యుఁ డగ్గిరివరబహిర్వాసులైన
వాండ్ర నందఱు బంధు రవారి ముంప
నంద అందుండి వెల్వాడు నంతలోన. 260

క. [1]ఇంగాలము లగ్నిశిఖా
సంగంబున దీప్తి వడసి క్షణమాత్రములో
నంగారము లయినట్టుల
పొంగారు మనోజ్ఞరూపములఁ గని వారల్. 261

1. బొగ్గులు.

క. మునుపటి కొలంది ప్రాయము
మునుపటి కొలఁది యగు రూపమును గని వారల్
మునుపటిగొనమొక్కటిఁ గన
రనఘం బగు తత్పరోమహత్త్వం బసదే. 262

క. నారదుఁ డచటనె యున్నటు
లారక్షకుఁడైన శౌరి నరసి తదాజ్ఞన్
వారికి నందఱ కపుడా
నారాయణుపాదదర్శనంబు ఘటించెన్. 263

గీ. దయను గతపాపులయిన యందఱను గాంచి
శౌరి కరుణించి మీ కల్మషములు వాసెఁ
బావనాకృతులై తిరి భవ్యులార
యనుచుఁ గ్రమ్మఱ నమ్మౌని నరసి పలికె. 264

క. కరుణం దారకమున [1]ద్వ్య
క్షరి నుపదేశింపు మీ ప్రజకు వెస వారుం
దురు సాంతానికలోకము
లిరవులుగా నిర్విచారవృత్తి దలిర్పన్. 265

మ. ఇఁక నక్కన్నె త్రిలింగదేశధరణీ భృన్మౌళి దేవేరియౌ
నొకొ కాకుండునొకో యటంచు మదిలో నొక్కింతసందేహ మూ

1. రామ మంత్రము.

నకు మా రాజు నిజానురక్తను గుణజ్ఞం డౌటచేఁ బెండ్లి యా
డక వర్జించునె యిట్టిచుట్టముల వీడం జూచునే యెయ్యెడన్. 266

క. ఎల్లియె యయ్యీరుపురకును
దెల్లంబుగఁ బెండ్లియగు నదే పయనంబై
తల్లి దన పరిజనముతో
నల్లునిపురిఁ జేర నరుగు నారయు మెదుటన్. 267

సీ. ఈముద్దుఁగొమ్మ మూఁడేండ్ల ప్రాయంబున
నుండ నికొండపై నున్న మమ్ముఁ
గొలువంగఁ బరిజనంబులతోడఁ దలిదండ్రు
లే తెంచి మాకు సంప్రీతిఁ జేయ
నంధ్రదేశేంద్రుపురంధ్రియౌ నిది యంచు
వరము మే మొసఁగంగఁ బడసి యేగు
నపు డంగరక్షకై యస్మదాకృతితోడి
కనకప్రతిమ దీని కంఠసీమ

తే. గీ. హారతరళంబుగాఁ గూర్చి యరుగునంత
వత్సరంబున నగ్గజధ్వజవిభుండు
వినయవతియందుఁ గలభాంకుఁ డనెడి విభునిఁ
గనియె నీభద్రమతి యను కన్నె వెనుక. 268

గీ. [1]స్వాప మెప్పుడు నొప్పదు సాంధ్యవేళ
ముక్తమూర్ధజులై నిద్ర వోవఁగూడ
దనుచు నిమ్మద్దియ యెఱుంగ కట్లొనర్చు
నంత నంతర మొదవె భూతాళిగవియ. 269

చ. అది యటు లుండ నిమ్మ సముదారుఁ డమానుషబాహుశౌర్యుఁడు
న్మదరిపుహారి పీఠపుర నాథుఁడు పుణ్యయశోభిధానుఁ డా
ప్పిదముగ నెల్లి భద్రమతిఁ బెండిలి యా. నిఁక వత్సరంబులో
హృదయ మెలర్ప మేము వసియింపఁగ నచ్చటి కేగఁగా వలెన్.

ఉ. తద్దయు నీవు లోకహిత తత్పరతన్ మముఁ గొన్ని కోరి తిం
కెద్దియు నేనిఁ గోర్కె గల దేని ఘటింతుము వేఁడు మంచునా
నద్దివిజేంద్రవందితు దయారసమానసు వేంకటేశ్వరుం
బెద్దయుఁ బ్రొద్దు కోర్కెలిడఁ బేర్కొని యమ్ముని వల్కె నిమ్మెయిన్.

సీ. సుకవిసారస్వతస్ఫురణంబు రసికాంత
రంగరంజకమై యొసంగవలయు
నృపనయవ్యాపార మేపార దాక్షిణ్య
మున జనావనవృత్తిఁ బూనవలయుఁ
బర్జన్యుఁ డనుకూలవర్షియై కర్షక
హర్షకరోత్కర్ష నలర వలయు

1. నిద్ర.

జనపదంబులు సుభిక్షంబులై తృణకాష్ఠ
జలసమృద్ధములుగాఁ జెలఁగ వలయుఁ

తే. గీ. ప్రకృతిజనసంచయంబుఁ బరస్పరంబు
చెలిమి వాటించి పాడిపై నెలమిఁగాంచి
కలిమిని వహించి పాఁడిపంటల రహించి
రాజవిశ్వాసపరతచేఁ బ్రబల వలయు. 272

క. అని ముని [1]యాశాస్యము దె
ల్పిన విని గరుడాద్రివాసి వేంకటరమణుం
డనుమోదంబున నిప్పని
కనుమతి గావింతు ననుచు ననియెం గరుణన్. 273

సీ. బ్రహ్మవిద్యామహాప్రజ్ఞానిధిత్వంబు
దివిజేంద్రసదృశవైభవసమృద్ధి
యదితికశ్యపసమానాపత్యయోగంబు
నంధ్రనాయకకౌతుకానుషక్తిఁ
నారదప్రతిమాన తారకజపసిద్ధి
ధూర్జటినిభభూతదోషవృత్తి
హీనభూతాభసాంతానికలోకాప్తి
వల్లవతుల్యకైవల్యపదవి

1. ఆశీర్వదింపఁ దగినది.

తే. గీ. యేతదస్మత్ప్రపూతవిఖ్యాతమహిమ
సహితమహితకథావిధశ్రవణపఠన
నిరతనిరతులకొదవు మునివర! వార
లున్నెడల నీతలంచి సల్లింపుఁజుమ్ము. 274

గీ. అడరు మునివాస మొంటిమామిడి యనంగ
విప్రరాక్షసురావి రావికముపాడు
బ్యాజుఁడు వార్చెద ననుగుంట తేటగుంట
పల్లవులపల్లె గోపాల పట్టనంబు. 275

శా. లోకానుగ్రహకాంక్ష నీగతిఁ గృపాళుండై మరున్మానికా
శ్రీకాంతుండు వరంబు లిచ్చి దని యించెం దార్క్ష్యభూమీధరా
స్తోకశ్రీమహిమంబు శౌనకముఖర్షుల్ ప్రీతిఁ బొందంగ వి
ద్యాకల్పుం డగు సూతుఁడుం దెలిపె నిట్లత్యంతమోదంబునన్. 276

మ. శుభసంధాయక శాలివాహనశ[1]కేష్వశ్రోత్రహస్తీందు స
చ్ఛుభకృద్వత్సర చైత్రశుద్ధనవమీ శుభ్రాంశుజాహంబునం
దు భవద్భావుక పాదమూలమున నెంతో భక్తి నర్పించితిం
బ్రభుతం గైకొని రామ యీకృతిఁ గృపం బ్రఖ్యాతి నొందింపవే.

క. శ్రీరమ్యగుణస్తోమా!
రారాజత్కీర్తికామ! రాజలలామా!
గౌరీసన్నుతనామా!
తారకమంత్రార్థతత్త్వధామా! రామా. 278

1. 1825.

శా. లంకారాజ్యనివేశితారిసహజశ్లాఘార్హబాహానిరా
తంకప్రౌఢబలాబలా! హితహితార్థప్రేషితస్వర్ణస
త్వంకేరుట్సరపారితోషికనితాంతప్రీతరత్నాంగదా
లంకారద్వయదానమోదపరిఖేలద్వాయుజాతాంగదా. 279

మానిని. శ్రీవిభసాస్పదశంఖరథాంగకచిహ్నమనోహరమంజుసదా
భావుకదేవులపల్లికులప్రభవద్విజపూజితభవ్యపదా!
రావుకులోత్తమరాజశిఖామణి రామధరావరనందనస
ద్భావకుమారమహీపతిసూర్యనృపాలముహుఃపరిపాలనధీ.



## గద్యము.

ఇది శ్రీమద్రామనామపారాయణపరాయణాతిధన్య కౌండిన్యగోత్ర
పవిత్ర దేవులపల్లికులపయఃపయోనిధికళానిధిసీతారామశాస్త్రి పౌత్ర
వేంకట కృష్ణశాస్త్రిపుత్ర తమ్మనాభిధానాంతర వేంకట కృష్ణ
శాస్త్రినామాగ్రజన్మ త్రిలింగదేశాగ్రజన్మ సుధీ
విధేయ సుబ్బరాయశాస్త్రి నామధేయ ప్రణీతం
బైన మహేంద్రవిజయం బను
ప్రబంధంబునందుఁ సర్వంబు

షష్ఠాశ్వాసము.

శ్రీరామార్పణమస్తు.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ

శుభోదయా ముద్రాక్షరశాలయందు ముద్రితము, మద్రాసు. 6

